వాడుక
భాష
సదస్సు

విశాఖపట్నం
*1980*
ఏప్రిల్
*26, 27*

# వాడుక భాష ఉద్యమం

తెలుగు గడ్డమీద వాడుక భాషా ఉద్యమం ప్రారంభమై దెబ్బయ్యేళ్ళు నిండాయి కృతకమైన గ్రాంధిక భాష నెదిరించి గిడుగు వేంకట రామమూర్తిగారు సాగించి సంగ్రామం చరిత్ర ప్రసిద్ధమైంది. ఫలితంగా వాడుక భాష విశ్వరూపంతో దేశమంతా తాండవిస్తుంది. గ్రాంధికం తెలి ముసుగుతో అక్కడక్కడా విశ్వవిద్యాలయాల మాటున తలదాచుకుంది. విశ్వవిద్యాలయాలలో వాడుక భాషకు పీఠం లభించేవరకు తనకు శాంతిలేదని "తుది విన్నపం" చేసి రామమూర్తిగారు కన్నుమూసారు

విజ్ఞులయత్నం మూలంగా కళాశాలల స్థాయిలో పాఠ్యగ్రంథాలు వాడుక భాషలోనే రూపొందించటానికి తెలుగు అకాడమీ పూనుకుంది. తెలుగు ఆధునిక సాహిత్యానికి సంబంధించిన పి హెచ్. డి. పరిశోధనా వ్యాసాలు వాడుక భాషలో రాయటానికి తిరుపతి వెంకటేశ్వర విశ్వవిద్యాలయం అంగీకరించింది

ఆంధ్ర విశ్వవిద్యాలయం శ్రీ ఎం. ఆర్. అప్పారావుగారి అధ్యక్షతన ఒక పండిత సంఘం నియమించి, ఆ సంఘ నివేదిక ననుసరించి ఈ క్రింది తీర్మానాలు ఏకగ్రీవంగా అంగీకరించింది.

"ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగులో పి. హెచ్. డి. కోసం సమర్పించే పరిశోధనా వ్యాసాలు వ్యవహారిక భాషలో కూడా రాయవచ్చును "

"ఆంధ్ర విశ్వవిద్యాలయం అన్ని స్థాయిలలోనూ తెలుగు పరీక్షా పత్రాలకు సమాధానాలు వ్యవహారిక భాషలో రాయవచ్చును. అన్ని తరగతులకు పాఠ్య పుస్తకాలుగా వ్యవహారిక భాషలోవున్న గ్రంథాలు కూడా నిర్ణయించవచ్చును."

# డెబ్బయ్యేళ్ళ ఉత్సవం

ఇదంతా సహించలేని గ్రాంధిక వాదులు పెడదారిని అడ్డంకులు మొదలు పెట్టారు. పరీక్షలలో సమాధానాలు ఎలావున్నా ప్రశ్న పత్రాలు మాత్రం గ్రాంధికం లోనే వుండాలని తీర్మానం పెట్టారు. హాస్యాస్పదమైన ఈ తీర్మానం కొన్ని షరతులకు లోబడి నెగ్గించుకున్నారు. ఫలితంగా వాడుక భాష ప్రగతి కుంటుపడింది. వాడుక భాషలో పాఠ్య గ్రంథాల నిర్ణయం మందగించింది. నష్టపడుతున్నది విద్యార్థులు, కుంటుపడుతున్నది సాహిత్యం.

ఈ జడత్వం సడలించాలి. ముందు కర్తవ్యం నిర్ణయించుకోవాలి. అందుకే విశాఖపట్నంలో (ఏప్రిల్ 26, 27, 1980) ఈ సదస్సు.

సకాలానికి అందిన పత్రాలను ఇందులో ప్రచురిస్తున్నాం.

అబ్బూరి రామకృష్ణారావుగారు మరణించి అప్పుడే సంవత్సరమైంది. ఈ సభాస్థలికి అబ్బూరివారి పేరు పెట్టడం సముచితం.

ఈ సందర్భంలో సరిగ్గా యిలాటి సదస్సునే నిర్వహించాలని ఎంతో ఉత్సాహంతో పథకాన్ని రచించి అంతలోనే దురదృష్ట వశాత్తు కనుమూసిన డా. రమేష్‌కు శ్రద్ధాంజలి ఘటిస్తున్నాం.

ఈ సదస్సు ముగింపు రోజున అరసం అధ్యక్షవర్గ అధ్యక్షులు కళాప్రపూర్ణ పురిపండా అప్పలస్వామిగారికి జరిగే సన్మానం వాడుక భాష ఉద్యమానికి, అభ్యుదయ రచయితల సంఘానికి జరుగుతున్న సన్మానంగా భావిస్తున్నాం.

---

—సంపాదకవర్గం

# ఆహ్వాన సంఘం

గౌరవాధ్యక్షులు

శ్రీ ఎమ్. ఆర్. అప్పారావు

అధ్యక్షులు

డా॥ పురిపండా అప్పలస్వామి

ఉపాధ్యక్షులు

ప్రొ॥ జి. సుందరరెడ్డి

శ్రీ ఎమ్. గోపాలకృష్ణారెడ్డి

శ్రీ వాకాటి పాండురంగారావు

శ్రీ అబ్బూరి గోపాలకృష్ణ

శ్రీ ఎమ్ వి భద్రం

శ్రీ భాట్టం శ్రీరామమూర్తి

ప్రధాన కార్యదర్శి

డా॥ చందు సుబ్బారావు

కార్యదర్శి వర్గం

శ్రీ విరియాల లక్ష్మీపతి

శ్రీ పెమ్మరాజు గోపాలకృష్ణ

శ్రీ అజం

సభ్యులు

ప్రొ॥ యస్వీ. జోగారావు

ప్రొ॥ కె. వెంకటేశ్వర్లు

శ్రీ ఎ. మురళీకృష్ణ

శ్రీ గరిమెళ్ళ సీతారామస్వామి

శ్రీ గంటి శ్రీరామమూర్తి

శ్రీ ఇంద్రగంటి రామచంద్రమూర్తి

శ్రీ పిప్పళ్ళ సూర్యప్రకాశరావు

ప్రొ॥ కొర్లపాటి శ్రీరామమూర్తి

డా॥ యస్. యమ్. ఇక్బాల్

డా॥ అత్తలూరి నరశింహారావు

డా॥ యల్. చక్రధరరావు

శ్రీ ఐ. సి. హెచ్ బసవరాజు

కుమారి చాగంటి తులసి

# రామమూర్తి పంతులుగారితో 36 గంటలు

—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

నవంబరు యిరవై మూడో తేదీ, శనివారం, సాయంత్రం, రమారమి యెనిమిది గంటలవేళ, పర్లాకిమిడిలో, నేను, రావుసాహేబు శ్రీ గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారి యింటికి వెళ్ళాను ఇరవై అయిదో తేదీ, సోమవారం, ఉదయం, అలాగే యెనిమిది గంటలవేళ, మళ్ళీ అక్కణ్ణుంచి బయలుదేరాను

ఈ 36 గంటలనూ నేను వెలకట్టలేను నా జీవితంలో, యింతవరకూ, నేనిలాంటి సమయం గడిపి యెరగను ఇకముందు కూడా గడపబోను.

పంతులుగారి కటాక్షవీక్షణం నామీద ప్రసరించినంతసేపూ యేదో అపూర్వ శక్తి వొకటి నాలో జాగరితం అవుతూ వున్నట్టు తోచింది. తెలుగు భాషను గురించిన సమ్యగ్ఙానం నా మెదటిలో సంచితం అవుతూ వున్నట్టు కూడా అనిపించింది.

ఆంధ్రదేశానికి నూత్న సందేశం వెలువడ్డ ఆ గదిలో కూచుని వుపదేశం చేస్తూ వుండగా పంతులుగారి దివ్య దర్శనం చేసుకున్నాను. నా జన్మ సఫలం అయింది

నేను వెళ్ళేటప్పటికి, పంతులుగారు, టేబిలుముందు కూచుని ఫలాహారం చేస్తున్నారు" రాజమండ్రీనుంచి యెవరో వచ్చా"రని మాతృశ్రీ, అన్నపూర్ణమ్మగారు మనవి చెయ్యగా వారు, వెనక్కి తిరిగి చూశారు. వెంటనే నేను నమస్కారం చెయ్యగా అందుకున్నారు, గాని సన్మానవాలు కట్టలేకపోయారు.

రాజమహేంద్రవరంలో వారికి సన్మానం జరిగాక మళ్ళీ నేనిదే వారి దర్శనం చెయ్యడం

ఇది యిలాగే జరుగుతుందని నేను చేతిలోనే వుంచుకుని వున్న కార్డు అందించాను. వెంటనే వారు, గభీమని లేచి "అలాగా? చాలా సంతోషం" అంటూ నా భుజంమీద తట్టి, కొంచెం దూరంలోవున్న కుర్చీ తెచ్చి వేసి కూచోమన్నారు. నేనే అది తెచ్చుకోవాలని ప్రయత్నించాను; గాని ఆ పులిపంజాలలో

వున్న కుర్చీని నేను స్వాధీనపరుచుకో లేక పోయాను

నన్ను చూశారు. అప్పటిదాకా ఫల హారం చేస్తూ, పూసిపోడానికి మూలు గుతూ వున్న పంతులుగారు, గ్రాంథిక వాదులలో కొమ్ములు తిరిగిన వారి తప్పుడు రచనల ప్రస్తావన ప్రారంభిం చారు.

అవి గ్రాంథిక వాదుల అప ప్రయో గాలే కాదు, అర్థం లేని ఆక్షేపణలేకాదు, కుట్రలేకాదు, కుత్సితాలే కాదు, అశక దుర్దసణలే కాదు-అది అఖండ గోదావరి నిండు ప్రవాహం.

ఈ కారణంవల్ల, తరవాత, పది నిమిషాలలో పూర్తి కావలసిన ఫలహా రానికి ముప్పావుగంట పట్టింది

తరవాత నేను భోజనం చేసి వారితో కూడా మేడమీదకి వెళ్ళాను

ఆ గదిలో వొకచోట సవరనిఘం టువు చిత్తులు, ఒక చోట తయారులో వున్న సాపులు ఒకచోట ప్రూపులు. ఒకచోట నాలుగైదు రోజులుగా వచ్చిన తెనుగు పత్రికలు, ఎదటి గూట్లో అరవం కన్నడం, మరాఠి, ఇంగ్లీషు, జర్మనీ, ఫ్రెంచి వగైరా భాషల బృహన్నిఘంటు వులు.

వాటిమధ్య, శరీరం అంతా చిత క్కొట్టబడ్డ పీరమ్మన్యుడులాగ పడివున్న శబ్దరత్నాకరం

ఆ గదిలో కార్యస్థానపు లక్షణాల కంటే యుద్ధరంగపు లక్షణాలే యెక్కు వగా వున్నాయి.

మళ్ళీ కబుర్లు మొదలయినాయి.

బ్రహ్మశ్రీ (మారేపల్లి రామచంద్ర) కవిగారి ప్రస్తావన వచ్చింది.

వెంటనే లేచి, పంతులుగారు, నా చెయ్యి పట్టుకుని పసారాలోనికి తీసుకు వెళ్ళి, గడమంచీ మీద వున్న ఇండెడు తాటాకు పుస్తకాలూ చూపిస్తూ "కవి గారికి విశాఖపట్నం జిల్లావారు షష్టిపూర్తి మహోత్సవం చెయ్యడం బాగానే వుంది; కాని వారి ఘనత కా గౌరవం చాలదు వారి పేర, యలమంచిలో, బోర్డు యాజ మాన్యం కిందగాని విశాఖపట్నంలో మునిసిపాలిటీ పెత్తనంలోగానీ వొక పుస్తక భాండాగారం స్థాపించి, రిజిస్టరీ చేయించేటట్టయితే నేనీ తాటాకు పుస్తకా లన్నీ ఆ భాండాగారాని కిస్తాను సీతాపతి యింటో లేకపోవడం మీరు చూస్తూనే వున్నారు విశాఖపట్నం వెళ్ళి నేనా మహోత్సవం కళ్ళారా చూడవలసిన వాణ్ణే కాని ఇల్లు కదలలేని స్థితిలో వున్నాను మీరు వెళుతున్నారు కనక యీ సంగతి మీ మాటలతో మహాసభలో చెప్పండి" అని సెలవిచ్చారు.

తరవాత, వారి, యీ సందేశం, నేను విశాఖపట్నంలో మహాసభలో ప్రకటిం చాను.

అదివరకే నేను, కవిగారు గొప్ప పండితులని యెరుగుదును; కాని పంతులు గారి యీ సందేశంవల్ల నాకు కవిగారి పదవి మరింత మహోన్నతంగా కనపడింది.

ఇవాళ, తెనుగు దేశంలో, ఆంధ్ర పండితుల తారతమ్యం తెలుసుకోవా లంటే, అందుకు రామమూర్తి పంతులు గారి నిర్ణయం వొక్కటే ఆధారం.

తరవాత వీరేశలింగం పంతులుగారి శిలావిగ్రహం సంగతి వచ్చింది. "రేపది రాజమహేంద్రవరంలో మహోత్సవంతో ప్రతిష్ఠించబడుతోంది కదా మీ రిలా వచ్చేశా"రేమని పంతులుగా రడిగారు "ప్రబుద్ధాంధ్ర నన్నింటో వుండనివ్వడం లే"దని రాసి చూపించాను "ఔనౌను. మీ ప్రచారంసంగతి విన్నాను. ప్రబుద్ధాంధ్రకు, సంపాదకుడు నెలకు ఇరవై రోజులచొప్పున ప్రెస్సు బిల్లూ పేపరు బిల్లూ పూర్తిగా చెల్లకపోతూ వుండడం దేశీయుల గాఢ నిద్రకు నిదర్శనం అయితే: ఈ వూళ్ళో మీరు మా యింటో బసచేయడం బాగా లేదు ఏమంటే? అన్ని విధాల మాకీ వూళ్ళో వెలి. ఈ వూరి తాపీపనివాడెవడూ మా యింటో పనిచెయ్యడానికిరాడు వస్తే, తరవాత, కంట్రాక్టర్లూ రాజాగారి పోష్యవర్గంలో వారూ వాణ్నిక చేర నివ్వరు. పెంకులమ్ముకునే వాడు మాకు పెంకులివ్వడు. ఇస్తే వాడిక వర్తకం కట్టిపెట్టుకోవాలి. రాజాగారితో సంబంధం వున్న పెద్దమనుష్యులెవరూ మా యింటికేసి కూడా చూడరు ఎక్కడేనాకనపడితే దూరంగా తొలగిపోతారు మాకే గాక మరి కొందరికి కూడా యిలాంటి చిక్కులున్నాయి. మీరు మరోచోట బస పెట్టుకుంటే పని జరిగివుండు" నని పంతులుగారన్నారు దానికి నేను "తమ దర్శనం కోసం వచ్చాను మరేమీ పనిలేదు; వచ్చాను కనక యిదివరకే తమద్వారా చందా దారులై వున్న వారిని చూస్తాను" అని రాసి చూపించాను. పంతులుగారు సంతోషించారు; కాని "మాటలవల్ల పనులు జరుగుతాయా? సరే మరీ. కష్టపడండి. దేశీయులు మీ సేవను గుర్తిస్తారు. కొంతవరకూ గుర్తించి కూడా వున్నారు." అని చెబుతూ మళ్ళీ వీరేశలింగం పంతులుగారి ప్రస్తావన అందుకున్నారు

"వీరేశలింగం పంతులుగారు పండితులనడానికి వీలులేదు; కాని పండితులే. చెయ్యవలసిన పనులెన్నో చేశారు వారు చేసిన పనులు మరెవ్వరూ చెయ్యలేక పోయారు కూడాను. వారు చివరికి, నా వాదం అంగీకరించారు. వెంటనే వారి ఆనందాశ్రమంలో వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజం యేర్పడబడ్డది. దానికి పంతులుగారే అధ్యక్షులు. అప్పటికి వారు ఆంధ్రకవుల చరిత్ర సంస్కరిస్తున్నారు మద్రాసు ప్రయాణం తొందరలో కూడా వున్నారు. "ఈ పని పూర్తి కాగానే నేనీ సమాజం పని శ్రద్ధగాచేస్తా" నని చెబుతూ వారు మద్రాసు వెళ్ళారు; కాని కొద్దిరోజుల్లోనే వారక్కడ కాలం చేశారు. ఈ సంగతులన్నీ తెలుపుతూ శిలా విగ్రహ ప్రతిష్ఠకు ప్రధాన పురుషులైన పెద్దాడ సుందర శివరావు గారికి నేను జాబు రాశాను. వారు దాన్ని ఆ సభలో చదువుతారని నమ్ముతున్నా" నన్నారు పంతులుగారు.

అప్పటికి రాత్రి పది గంటలుదాటింది. పంతులుగారింకా మాట్లాడ గలిగేటట్టే వున్నారు; కాని ప్రయాణపు బడలికవల్ల నాకంతకుముందే నిద్రమత్తు ప్రారభమయి వుంది. అది చూసి. వారు, నాకు, "పడుకో" మని సెలవిచ్చారు.

నవంబరు 24 :–

సూర్యోదయం అయ్యే అప్పటికే

పంతులుగారు కాలకృత్యాలు తీర్చుకొని సిద్ధంగా వున్నారు. మరో అరగంటకి నేను తెమిలాను. మాతృశ్రీ గారిచ్చిన కాఫీ పుచ్చుకొని యిద్దరమూ మేడమీదకి వెళ్ళిపోయాము

పంతులుగారు నన్ను, రెండో గదికి తీసుకువెళ్ళి ఉత్తమ ప్రబంధాలున్నా బీరువా తెరిచారు. భారతం, భాగవతం-రామాయణం, మను వసు చరిత్రాదులు, ఏవితీసినా పరిష్కర్తల తెలివి తక్కువ సవరణలు ప్రతీ పేజీలోనూ గుర్తు పెట్ట బడి వున్నాయి. కవిసార్వభౌముని శ్రీ కృష్ణ భారతం కనపడింది ఎర్రపెన్సిలు తో గీటు పెట్టని పంక్తి కనపడలేదు. వావిలాల వాసుదేవశాస్త్రిగారి ఉత్తరరామ చరిత్ర కొత్త మార్పు కనపడింది అక్షరం అక్షరానికీ గీట్లున్నాయి. ఒకచోట శాస్త్రి గారు "హాని బొసగదు" అని వాడారు. అది చూపించి, నవ్వుతూ "శాస్త్రిగారికి బొసగు ధాతువు అర్థం తెలవదు దాని ప్రయోగం అసలే తెలవదు అయినా ఉత్తర రామ చరిత్ర తెనిగించారు అయితే; వారి రచనలో వ్యావహారిక శబ్దాలు కుప్పలుగా వున్నాయి. తెలిసి వుందేవారు వాటిని వాడారని నేను చెప్ప గల"నన్నారు పంతులుగారు.

వడ్డాది సుబ్బరాయుడుగారి ప్రస్తావన వచ్చింది "శబ్దరత్నాకరం లేనిదే వారు మాట్లాడ" రని చెబుతూ పంతులుగారు, నన్ను, మొదటి గదికి తీసుకు వెళ్ళి శబ్ద రత్నాకరం ముందుపడేశారు

. చూస్తిని గదా, బలమైన దారంతో అది గట్టిగా కట్టబడి వుంది విప్పగా, ఏ అట్టకా అట్ట, ఏ కాగితానికా కాగితమూ విడిపోయి వరసగా మాత్రం వున్నాయి. అందులో తప్పులేని శబ్దం కనపడ్డంచాలా కష్టమయింది. ప్రతీ పేజీలోనూ అచ్చు భాగం కంటే పెన్సులుతో రాసిన భాగమే హెచ్చుగావుంది అది మళ్ళీ యథాప్రకారంగా కట్టేస్తూపంతులుగారిలా చెప్పారు.

ఇద్దరమూ నుంచునే వున్నాం. "తమరు కూచోండి" అని కుర్చీ దగ్గరికి లాగాను, కాని "నుంచుని మాట్లాడడమే నా కలవాటు" అంటూ వారలాగే వుండి మాట్లాడారు.

"ఇటీవల నేను, శబ్దరత్నాకరం మరో ప్రతి కూడా కొని, తెల్లకాగితాలు చేర్చి బైండు చేయించి వున్నాను, కాని నేను యీ ప్రతిని నా ప్రాణంకంటే ఎక్కువగా కాపాడుకుంటున్నాను. ఒకప్పు డొక సన్నివేశం తటస్థించింది ఒక సందర్భంలో మరికొన్ని పుస్తకాలతో పాటు ఇది కూడా పట్టుకుని రాజమహేంద్రవరం వెళ్ళాను. అక్కడ డాక్టరు చిలుకూరి నారాయణరావుగారి యింట్లో బస పని పూర్తి అయాక ఇంటికి వచ్చి చూడగా పెట్టెలో శబ్దరత్నాకరం కనపడలేదు ప్రయాణం తొందరలో అది అక్కడే వుండిపోయింది అది లేకపోవడంవల్ల నాకు మతిపోయింది అందుచేత "అది మళ్ళీ నా చేతికి వచ్చేదాకా నేనుభోజనం చెయ్య"నని శపథం తాల్చాను. ఈ సంగతి తెలుపుతూ వెంటనే సీతాపతి నారాయణరావుకి టెలిగ్రామిచ్చాను దానికి నారాయణరావు "అవును. అది యిక్కడ కనపడింది. వెంటనే పార్సలు చేసి పంపేశాను. ఈ పాటికి సగం దారిలో వుంటుంది." అని బదులు తంతి కొట్టాడు.

అప్పుడు మా వాళ్ళు, బోధించి, బతిమాలగా నేను భోజనం చేశాను. అయితే ఈ పుస్తకం అంటే నాకింత శ్రద్ధ ఎందుకో మీకు తెలుసునా?"

ఇలా అడుగుతూ, పంతులుగారు, మరింత దగ్గిరగా వచ్చి తమ రెండు చేతులూ నా భుజాలమీదవేసి వూపుతూ- వొత్తి వొత్తి పలుకుతూ-

"మీరు బాగా వినండి. గట్టిగా నమ్మండి నేనిదివరకి చేసిందలా వుండ నియ్యండి నేనింకోపనిచెయ్యవలసివుంది. అది చెయ్యకుండా నేనీ శరీరం విడిచి పెట్టను ఇది నా ఇచ్చకు వ్యతిరేకంగా జరగదు... ఆంధ్ర సాహిత్య పరిషత్తు యొక్క స్థితిగతులు మీకు బాగా తెలుసు. జయంతి రామయ్యగారు దాని చిగుళ్ళన్నీ చిదిమేశారుఇప్పటికీచిదిమేస్తూనేఉన్నారు. అది పూర్తిగా గిడసబారి పోయింది దానికింక యెదుగు బొదుగులు లేవు. అది యిక చిగిర్చదు పుయ్యదు, కాయదు, ఫలించదు ఇక రామయ్యగారు ఆశపెట్టుకున్నదల్లా సూర్యరాయాంధ్ర నిఘంటువు దేశం కనిపెట్టుకుని వున్నది దానికోసమే అయితే: అది శబ్దరత్నాకరం మీద ఇంప్రువుమెంటుతప్ప స్వతంత్రం కాదు సమగ్రం అంతకంటే కాదు. నిర్దుష్టం కానేకాదు. కావడానికి తగిన సన్నివేశాలక్కడ లేనేలేవు. అది అచ్చులో వుందని తెలుస్తుంది కనక యెప్పటికేనా బయటికి వొస్తుంది. నేను దానికోసం యెదురు చూస్తున్నాను. వచ్చి రావడంతోటే దాన్ని నేను ముక్కచెక్క కింద చితక్కొటేస్తాను. అందుకోసమే యీ శబ్దరత్నాకరం యింత జాగ్రత్తగా వుంచాను. దీన్ని అనుసరించి వెడుతుంది కనుక అది, దాన్ని విమర్శించాలంటే దీనిమీద రాసి వుంచిన నోట్సు చాలా అవసరం. తరవాత దీని పని తీరిపోతుంది. ఇంత పని చేస్తేగాని కృతకాంధ్రం యొక్క దౌర్బల్యమూ దౌర్భాగ్యమూ విదేశీయులకు పూర్తిగా బోధపడవు. నిఘంటువు రాయడాని కెలాంటి వారు పూనుకోవాలో, వారి హృదయం యెంత విశాలమయినది కావాలో, సంకుచిత భావాలతో పూనుకుంటే అది ఎలాగ నిరర్థకం అయిపోతుందో, జీవద్భాషను విడిచిపెట్టి నిఘంటువు రాయడం యెంత శవాలంకరణమో దేశీయులకు బోధపడడం చాలా అవసరం యేది జరిగినా యేది జరగకపోయినా నేనిది మాత్రం చేసి తీరతాను మీరు చూస్తారు"

పంతులుగారీ మాట ఉచ్చరించాటప్పుడు వారి ముఖంమీద దివ్య తేజస్సు మెరిసిపోయింది

తరవాత పంతులుగారు, కుర్చీలో చేరబడి వొక్క క్షణానికి చిత్తాన్ని సమాహితం చేసుకున్నారు ఈ లోపుగా నేను పలక మీద వొక ప్రశ్నరాసి వారి కందించాను

నా రచన లెంతో వుబలాటంతో చదివే ప్రియమిత్రులు, భావరాజు వెంకటకృష్ణారావు పంతులుగారు నాలుగైదు మాట్లు నాకొక సలహా చెప్పి వున్నారు; కాని దాన్ని నేనింతవరకూ అంగీకరించలేకపోతూనే వచ్చాను. అయితే: ఇటీవల రామమూర్తి పంతులుగారికి రాసి యీ విషయం పరిష్కరించు కోవాలను

కుంటూ—దీని సందర్భంలో కూడా శ్రద్ధ చెయ్యలేక పోయాను.

"రాశాను"

"కోసెడు దూరం"

"బాగా వుంది"

"అది చూసి వొకడు"

ఇలా రాయడం మంచిది కాదంటారు కృష్ణారావు పంతులు గారు "వ్రాశాను" "క్రోసెడు దూరం" "బాగా ఉంది" "అది చూసి ఒకడు" అనకూడదా అంటారు వారు "అసలు వ్యావహారిక భాషను ప్రవేశపెట్టిన రామమూర్తి పంతులగారు మీరు రాసినట్టు రాస్తారా?" అనికూడా అడిగారు.

రామమూర్తి పంతులుగారికి నేను రాసి చూపించిన విషయం యిదీ దీని మీద పంతులుగారిలా సెలవిచ్చారు.

సుబ్రహ్మణ్యశాస్త్రి రాసినట్టు రామమూర్తి రాయడు. రామమూర్తి రాసినట్టు సుబ్రహ్మణ్యశాస్త్రి యెందుకు రాయాలి? కృష్ణాగారిని మీరిలా అడగండి. నే నడగమన్నానని మరీ అడగండి. ఇందులో వున్న కిటుకేమిటంటే? నేను రాయమన్నది శిష్ట వ్యావహారికం. శిష్టులందరూ "రాశాను" అంటారు కాన "వ్రాశాను" అనరు. అనకపోతే లోపమున్నూ లేదు. నేను గ్రాంధికంలో పుట్టి పెరిగాను. ఆ వాసన యింకా నన్ను వదలలేదు. పూర్వులు వ్యాఖ్యానాలు వగైరాలలో వాడిన శబ్దాలను వాడడమే నా కలవాట యింది మీరు శిష్ట వ్యావహారికాన్ని స్వీకరిస్తున్నారు. అది చాలా మంచి పని. నేనలా రాయకపోయినా మిమ్మల్ని ఆక్షేపించను. మీ రచనలలో జాతీయత వుంది. మీరు వాడే శబ్దాల వల్ల ఆ జాతీయత కేమీ భంగం కలగడం లేదు. శిష్ట వ్యావహారంలో వున్న భాష వాడాలి" అని మీరు జ్ఞాపకం వుంచుకున్నంత కాలమూ మిమ్మల్ని నేనేమీ ఆక్షేపించను."

ఈ సమాధానం కృష్ణారావు పంతులు గారి కిష్టమవుతుందో కాదో నేను చెప్పలేను, కాని నాకు మాత్రం చాలా పుత్సాహం కలిగించింది.

ఈ సమయంలో "వంట అయిం" దని మాతృశ్రీగారి దగ్గరనుంచి కబురు వచ్చింది. మడికట్టుకుని యిద్దరమూ భోజనాల గదిలోకి వెళ్ళాము.

భోజనానంతరం మళ్ళీ మేడ మీదకి వెళ్ళాము. పంతులుగారు ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మనీ వగైరా పాశ్చాత్య భాషల గ్రంథాలున్న బీరువా తెరిచారు అందులో ఉన్నవన్నీ భాషాతత్వ శాస్త్రానికీ, వ్యాకరణానికీ, ఆయా వాఙ్మయాల చరిత్రలకూ సంబంధించిన గ్రంథాలు. నేను యదాలాభంగా వొక పుస్తకం తీశాను విప్పి చూడగా అది ఫ్రెంచి భాషా తత్వ శాస్త్రానికి సంబంధించిన గ్రంథం. చాలా విలువయింది. ప్రామాణ్యం కలది కూడానూ. అందులో వొక పేజీ అంతటా పెన్సిలుతో పెట్టిన కొంకిర బింకిరి గీతలున్నాయి. ఇదేమని నేనడగడానికి ముందే పంతులుగారు, వాటిని చూపిస్తూ యిలా చెప్పారు.

"మీరు, నా కుమారుడు సూర్యనారాయణ నెరుగుదురు అతని కుమారుడు—ఏడెనిమిదేళ్ళవాడు—మీరెరుగుదురు. రాజమహేంద్రవరంలో జరిగిన ఆంధ్రనికోంత్ర

సభలో అధ్యక్షులవారి టేబిలు మీద కూచుని దీక్షితులు గారి లీలాసుందరి కథ చదివాడు. ఏం? బాగా జ్ఞాపకం .... ....? వాడు గీశాడు ఆ గీతలు, నేనోనాడు దీక్షగా వొక పుస్తకం చదువుతున్నాను. పక్కని కూచుని యెప్పుడు తెరిచాడో యిది చల్లగా గీసేస్తున్నాడు. నేను చూశాటప్పటికొక పేజీ నిండిపోయింది. కాస్త ఆలస్యమయితే: మరో పేజీకూడా అయిపోవును అయితే నన్ను చూసి, వాడు, తెల్లపోయాడు ఏం చెయ్యను? పుస్తకం గొప్పది. చేసిన పని కలిసిరాంది. చేసిన వాడు మనవడు. కోపం వచ్చింది; కాని వాత్సల్యంలో లీనం అయిపోయింది. చెయ్యెత్తాను, కాని వేళ్ళు వాడి ముంగురులు సవరించాయి. ఇంకెందుకూ? కొట్టలేక పోయాను గదుసలేక పోయాను. కళ్ళెర్రజేయడం కూడా పడింది కాదు కాని కొంతసేపటికి గాంభీర్యం తెచ్చిపెట్టుకుని "శ్రద్ధగా చదువుకుంటానంటే- ఈ పుస్తకం చదవ గలిగేటంతవరకూ చదువుకుంటానంటే- అప్పుడీ పుస్తకమే చదువుతా నంటే నిన్నిప్పుడు కొట్టను ఏం? ఏమంటావు? .... ?" అన్నాను దీంతో వాడికి ప్రాణాలు కుదుట బడ్డాయి. వెంటనే వాడు చాలా చురుకైన వాడు లేండి. ఉచితానుచితాలు బాగా తెలిసిన వాడవుతాడు. ఏమీ సందేహంలేదు, వెంటనే రెండు చేతులూ జోడించి "చదువుకుంటా" నన్నాడు. నా గాంభీర్యమంతా యేమయిపోయిందో పోయింది. హృదయం ఆనంద మయమయిపోయింది. వెంటనే వాణ్ణి వొక్కమాటు వొళ్ళోకి తీసుకుని హృదయానికి కదుముకుని "వెళ్ళి ఆడుకో" అన్నాను వాడికి కూడా భయం పోయి ఉత్సాహం కలిగింది. వెంటనే యెగురుతూ దుముకుతూ కిందికి వెళ్ళిపోయాడు. వాడెప్పుడేనా యీ బీరువా దగ్గరకు వచ్చినపుడు ఏమండీ నేను చదువుకునే పుస్తకం యిందులో వుంది కా?" అంటూ వుంటాడు. నాకేమీ సందేహం లేదు వాడు అంతటివాడవుతాడు."

ఈ మాటలు చెప్పేటప్పుడు పంతులు గారి కళ్ళల్లో ఆనందం సుడి తిరిగి పోయింది.

తరవాత వొక్క అరగంటదాకా ఆ మాటా యీ మాటా చెప్పుకున్నాము. ఆ సమయంలో డాక్టరు పోచిరాజు వైకుంఠం పంతులుగారూ, కెంబావి శ్రీనివాసరావు పంతులుగారు వచ్చారు. నలుగురమూ డాబామీద కూర్చున్నాము. పంతులుగారు వారికి నా సంగతి స్వయంగా చెప్పారు. నేను రాసిన ప్రేమపాశం సంగతి యెత్తుకుని దానిని గురించి వారితో చాలా ప్రీతితో మాట్లాడారు. మరికొంతసేపటికి పంతుళ్ళు వారిద్దరూ కచేరీలో పనివుంది వెళ్ళిపోయారు. రామమూర్తి పంతులుగారు చెప్పగా వారి వెనకనే నేను వూళ్ళోకి వెళ్ళాను.

నలుగురు యువకులు కొత్తగా చందాదారులయినారు. డాక్టరు పోనిరాజు వైకుంఠంపంతులుగారు ఐదురూపాయిలు విరాళం యిచ్చారు. జి. భాస్కర రామచంద్రరావు (ఉలవభద్ర) దొరగారూ, కెంబావి శ్రీనివాసరావు పంతులుగారూ విరాళాలు వాగ్దానం చేసి "వారం పది రోజుల్లో పంపుతా"మన్నారు.

పొద్దుగూకింది. చీకటి పడింది. బసకి వచ్చాను పంతులుగారు లఘువుగా ఫలహారమూ, నేను భోజనమూ చేశాము.

మళ్ళీ యథాప్రకారంగా మేడమీదకి వెళ్ళాము

ఎందరో పండితుల ప్రస్తావన వచ్చింది. పంతులుగారు, ఆ పండితుల అపప్రయోగాలు వివరిస్తూ ఎంత విలువయిన పాఠాలో చెప్పారు

మాటలో మాట మన తెనుగువారి దేశసేవ ప్రస్తావన వచ్చింది. ఎన్నో సంగతులు వెళ్ళిపోయాయి ఈ సందర్భంలో పంతులుగారు హృదయవిదారకమైన ఒక సంగతి సెలవిచ్చారు.

అది తలుచుకుంటే యిప్పటికీ ఒళ్ళు జలదరిస్తోంది

ఓఢ్రుల దురాక్రమణ సందర్భంలో మనం చూపిన ఔదాసీన్యంవల్ల — కాంగ్రెస్సుపేర ప్రదర్శించిన చచ్చు ఔదార్యంవల్ల శుద్ధాంధ్ర సోదరీసోదరులు సుమారు మూడు లక్షలమంది ఓఢ్ర రాష్ట్రంలోకి లాగివెయ్యబడ్డారు.

దీనివల్ల వచ్చిన ఆపతేమిటంటే ?

మనతోపాటు మెజారిటీ సౌకర్యాలనుభవించవలసిన మూడు లక్షల తెనుగువారు ఓఢ్రుల పంజాలో చిక్కుకుని మైనారిటీలో పడిపోయారు. తద్వారా — యిక్కడ — మనకి కూడా అరవలయెదట మైనారిటీ వచ్చింది

ఇంతేకాదు.

దీనివల్ల మానధనులైన శ్రీరామమూర్తి పంతులుగారికి, నమ్మి, ప్రాయం అంతా గడిపిన వూళ్ళో — పదివేలుపోసి కట్టుకుని యాభైయేళ్ళనుంచి కాపరం వున్న యింట్లోవుండే యోగం లేకుండా పోతోంది.

సంగతేమింటే ?

1936 వ సంవత్సరం ఏప్రిల్ నెల మొదటి తేదీని పర్లాకిమిడి పట్నం ఓఢ్ర రాష్ట్రంలో చేరిపోతుంది. అయితే పంతులుగారు ఓఢ్ర రాష్ట్రీయ పౌరులనిపించుకోడానికిష్ట పడడంలేదు.

వారు సెలవిచ్చిందిదీ.

కొన్ని గడియలనూ ఓఢ్ర రాష్ట్రీయ చ్ఛాయ అలుముకుంటుందనగా, నేను, పర్లాకిమిడి విడిచిపెట్టి మద్రాసు ప్రెసిడెన్సీలోకి వచ్చేస్తాను. అయితే పర్లాకిమిడి సేషనులో రైలెక్కాను పాతపట్నం వెళ్ళి, ఏటిలో స్నానంచేసి, పర్లాకిమిడి మళ్ళీ మద్రాసు ప్రెసిడెన్సీలో చేరితే తప్ప లేకపోతే ఆ వూళ్ళో — బతికివుండగా నేనా వూళ్ళో అడుగు పెట్టనని కంకణం కట్టుగొని రైలెక్కాను అయితే, రైలెక్కి ఏవూరు వెళ్ళడం ? ఈ వృద్ధాప్యంలో నా కెక్కడ సుఖంగా వుంటుంది ? భాషా పరిశ్రమ చేసుకోడానికి నాకేవూళ్ళో అవకాశాలున్నాయి ?"

పంతులుగారు తలవూపుతూ ప్రశ్నార్థకంగా చూశారు.

వెంటనే నేను, మా రాజమంహేంద్రవరం దయచెయ్యవలసిందని ప్రార్థించాను. "మావూళ్ళో గౌతమి పేరిట పెద్ద పుస్తక భాండాగారం వుంది. మీ కుమారుడు గారు మా వూళ్ళోనే ఉద్యోగంలో వున్నారు తాను గీతలు గీసిన ప్రెంచి పుస్తకం పెద్దపెరిగాక చదువుతానని మాట యిచ్చిన మీ మనుమడు కూడా మావూళ్ళో వున్నాడు మీ శిష్యపరమాణువులం మేము కూడా ఉన్నాము. గోదావరి ఒడ్డు కావాలంటారా, ఇన్నీస్ పేటలో వుండండి. విశాలమైన వీధులతో

జనసమర్థంలేని స్థలం కావాలంటారో దానవాయి [illegible]ంటలో వుండండి, దీక్షితులు గారు షష్ఠి గడియలూ మిమ్మల్ని కని పెట్టుకునే వుంటారు. గౌతమీ భాండాగారం దగ్గిరకూడా చాలా మంచి యిళ్ళున్నాయి. మీ యిష్టం. రాజమహేంద్రవరమే మీరు దయచెయ్యాలి" అని నేను మరీ మరీ కోరాను

పంతులుగారు తలవూపారు బాగుందన్నారు ప్రస్తుతం అంతకంటె మంచిది కనపడ్డంలేదని కూడా అన్నారు.

విశాఖపట్నంలో, కవిగారి షష్టిపూర్తి మహోత్సవ సభలో పుపన్యసిస్తూ సభలో కూచునివున్న డాక్టరు పాలకోడేటి గురుమూర్తి పంతులుగారినీ అగ్రాసనంలో ఉన్న న్యాయపతి సుబ్బారావు పంతులుగారినీ సంబోధించి నేనీ సంగతి చెప్పాను.

పంతులుగారి శపథం విన్నప్పుడు నిజంగా నాకు శరీరం అవశ్యం అయినట్లయి పోయింది.

ఏమనుకుంటే యేముంది ?

తెనుగువాడిప్పుడు భావదాస్యంలో మగ్గిపోయి ఆత్మగౌరవం యెరక్కుండా వున్నాడు. పాము నోట్లో వున్న కప్ప కబళించే దోమగా వున్నాడు.

ఆ రాత్రి నాకు సరిగా నిద్ర పట్టలేదు.

మర్నాడు – యిరవై అయిదో తేదీ వుదయం ఎనిమిది గంటలవేళ పంతులు గారికి పాదాభివందనం చేసి, మాతృశ్రీ గారికి కూడా నమస్కారాలు చెప్పుకుని, ఆ గురు దంపతుల దీవెనలు శిరసావహించి, స్టేషనుకి వచ్చి రైలెక్కాను.

రైలు కూడా నాలాగే మందకొడిగా వుండి ఎనిమిది గంటలకు పర్లాకిమిడిలో బయలుదేరింది పది కొట్టాక నౌపడా స్టేషను చేరింది

ప్రబుద్ధాంధ్ర 10 డిసెంబర్ 1995
(6వ సంపుటం, 12 వ సంచిక)


*With best compliments from :*

Grams · PICASSO

Phones · 4282, 4283, 5679
Telex 0495-252

**COROMANDEL PAINTS & CHEMICALS LTD.**

**10-1-20, Waltair Uplands :: Visakhapatnam-530 003**

*Manufacturers of :*

All Varieties of Paints - Decorative, Industrial, Marine and other Sophisticated coatings.

**Regd. Offi.: 9-30-2, Siripuram, Visakhapatnam-3, Phone:3249**

**Works : Pendurty, Vizag Dist. Phones : 9263 & 9254**

# పరిపాలనా భాష : వాడుక భాష

కళాప్రపూర్ణ వావిలాల గోపాలకృష్ణయ్య
(ఆంధ్రప్రదేశ్ అధికార భాషా కమీషన్ మాజీ అధ్యక్షుడు)

"స్వరాజ్యం కావాలంటున్నాము, ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కోసం చిక్కుపడుతున్నాము. ప్రజాస్వామిక పరిపాలన కోసం కోరుతున్నాము. ఇటువంటి పరిస్థితులలో మన ప్రజలకు-సామాన్యజనులకు ఏ భాష ద్వారా జ్ఞానం కలుగజేయువలసి వుంటుందో, ఏ భాషలో గ్రంథ రచన సాగించవలసివుంటుందో ఆలోచించండి" అంటూ తమ తుది సందేశంలో కళాప్రపూర్ణ గిడుగు వెంకటరామమూర్తిగారు 40 సంవత్సరాల క్రితం 15-1-40లో తెలుగు ప్రజలను హెచ్చరించారు

నేడో 1980వ సంవత్సరం. 1947లో స్వరాజ్యం సాధించాం. 1953లో ఆంధ్ర రాష్ట్రం సాధించాం. 1956లో విశాలాంధ్ర సాధించాం 1955లో తెలుగును అధికార భాషగా అమలుజరపవలెనని ఆంధ్రశాసన సభ ఆదేశించింది. తెలుగును అధికార భాషగా 1966లో శాసనం ద్వారా నిర్ణయించడం జరిగింది. ప్రభుత్వ కార్యాలయాలు తెలుగును అధికార భాషగా అమలు జరపవలెనని, ఇంగ్లీషు అమలు జరపరాదని తాలూకా సాయిలో 1967-74ల్లో, జిల్లా స్థాయిలో 1975లో సచివాలయంలోని అధికార భాషా, విద్యా శాఖ విభాగంలో 1976లో, రాష్ట్రంలోని అన్ని శాఖల డైరెక్టరేటులల్లో 1979 లోను, ప్రభుత్వం ఉత్తర్వులుజారీచేసింది

ఆంధ్ర విశ్వవిద్యా పరిషత్తు,1926లో యేర్పడినపుడే బోధన, పరీక్షలు తెలుగులో జరపవలెనని 1925లో శాసనం ఆదేశించింది. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఉర్దూ భాషను బోధనా పరీక్ష భాషగా అమలుజరిపారు కాని ఆంధ్ర విశ్వవిద్యా పరిషత్తులో తటపటాయింపులు జరిగినవి.

అంతవరకు 10వ తరగతి వరకు బోధనా భాషగా తెలుగువుండగా 1969లో భారతదేశంలో అన్ని రాష్ట్రాలకన్నా, భాషలకన్నా ముందుగా ఇంటర్ తరగతు

లలో, డిగ్రీ తరగతులలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలుగు బోధనా భాషగాసాగిం చింది. తెలుగు బోధనా భాషగా చదివిన వారికి 1976లో నుండి ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీసెస్ కమీషన్ పరీక్షలలో ప్రతి పరీక్ష పత్రానికి అయిదు (5) మార్కులు అదనంగా యివ్వడానికి ఏర్పాటు కూడా చేయబడింది

ఇంతవరకు తెలుగు సాహిత్యభాషగా బోధింపబడుచున్నది. భాషా బోధనలో పాఠ్యం, అపాఠ్యం అని రెండువరాలుగా బోధింపబడుతున్నది. ఇంటర్, డిగ్రీ తరగతులలో తెలుగు బోధనా భాష చేయడంతో ఆ తరగతులలో అన్ని పాఠ్యాంశాలకు వివిధ పాఠ్యగ్రంథాలు అవసరం అయ్యాయి వాటిలో రచన ప్రచురణలు నిర్వహించుటను తెలుగు అకాడమీకి అప్పగించడం జరిగింది. ఆ పై తరగతులలో అంటే పట్టభద్రానంతర తరగతులలో తెలుగు బోధనా భాషగా చేయనందున అంతవరకు చదివిన విద్యార్థులు తెలుగు భాషనుండిపట్టభద్రానంతర తరగతుల చదువులకు ఎగిరి ఇంగ్లీషులో దూకవలసి వచ్చింది. మరల ఇంగ్లీషు ప్రారంభించక తప్పని స్థితి ఏర్పడింది. దాని ఫలితంగా తెలుగు బోధనా భాషగా తీసుకొనుటలో మందకొడి తనం ఏర్పడింది. అందుకుకారణంగా ఆ తరగతులకు తగిన పాఠ్యపుస్తకాలు తెలుగులో లేకపోవడం కారణం అయింది.

దేశభాషలకు ప్రాధాన్యం ఇవ్వవలెననే ఆందోళన ఫలితంగా వివిధ రాష్ట్రాలలో ఆయా భాషలు అధికార భాషలుగా (నామ మాత్రంగానే అయినా) అమలుజరగడం వల్ల కేంద్రప్రభుత్వం కేంద్రఉద్యోగాలకు జరిపే పరీక్షలు కేంద్ర పబ్లిక్ సర్వీసెస్ కమీషన్ వారు రాజ్యాంగంలో ఉదహరించిన వివిధ భాషలలో బోధన- ప్రశ్నాపత్రాలు- జవాబులు వ్రాయటానికిఅంగీకరించడంతో యు. జి. సి. వారు శ్రీసతీష్ చంద్ర అధ్యక్షతన యేర్పాటు చేసిన కమిటీవారి సిఫారసు మేర ఈ 1980వ సంవత్సరం మార్చి 22-25 తేదీలలో శ్రీ వెంకటేశ్వరావిశ్వవిద్యాలయంలో తిరుపతిలో తెలుగు పరిశోధనా విధానాలపై ప్రత్యేక సదస్సు నిర్వహించారు. తెలుగు ప్రజ్ఞావంతులు హాజరయినారు. తెలుగు భాషలో పట్టభద్రానంతర తరగతులకు పరిశోధనకు కావలసిన పాఠ్యగ్రంథాలు ఇతర సారస్వతం సిద్ధం చేయటానికి సూచనలు-ప్రణాళికలు తయారుచేశారు.

తెలుగు బోధనా భాషగా గాని, లేక పరిపాలనా భాషగా గాని అమలుజరపవలెనని కోరితే అందుకు పదజాలం లేదని సాకుచెప్పుతున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో పారసీకులు, డచ్చి, ఫ్రెంచి, ఇంగ్లీషు పోర్చుగీసులు ఆధునిక యుగంలో పరిపాలన సాగించారు. పారశీకుల భాషలలోని పదాలు కొన్ని తెలుగులో కలిసిపోయినవి కొన్ని మిగిలిపోయినవి. వాటినిఆచరణలో గాని, ప్రజాసామాన్యంలోగాని, అన్య భాషా పదాలుగా తలంచడమే లేదు. బాధ లేదు. డచ్చి, ఫ్రెంచి, పోర్చుగీషుపదాలు వాటి ప్రభావాన్ని కోల్పోయినవి ఇక ఇంగ్లీషు పదాలు-తెలుగు వాటి స్థానంలో వచ్చినవి కొన్ని. లేక స్వయంగా అమలులోకి వచ్చినవి కొన్ని, అంటే యంత్రయుగంవల్ల, పరిపాలన ప్రభావం వల్ల

సాంకేతిక పరిజ్ఞాన ప్రభావం వల్ల ప్రత్యామ్నాయాలు సాధించడంలో ఫలితంలేనివి కొన్నిఉన్నవి. వాటినిఅన్నింటిని యధాతధంగా తీసుకోవడంలోప్రమాదం లేదు అయితే మన అజ్ఞానం, తెలియని తనం వల్ల తెలుగులోవున్న పదాలు తెలియకతెలుగులో అసలు పదాలు లేవు గనుక, ప్రత్యామ్నాయ పదాలు లభించవు గనుక ఇంగ్లీషు పదాలు యధాతధంగా వాడుదామంటే మన అజ్ఞానాన్ని బయట పెట్టుకోవడమే గాక, అంతకన్నా భాషకు తీరని అపకారం చేసినవారం అవుతాం. కార్పెంటరు, ఎస్టిమేటు, రైలు, రేడియో వంటివి. కార్పెంటరు–వడ్రంగి–ఎస్టిమేటు అంచనా, అని వున్నవికదా; ఇక రైలు, రేడియో యధాతధంగా వాడడమే శ్రేష్టం. వడ్రంగిని కార్పెంటరుగా, వాడితే రెండు మూడు తరాలలో అసలు తెలుగు పదాలు మరుగుపడి మరచిపోవడమే జరుగుతుంది మరుగుపడితే ఇక భాషకు వ్యక్తిత్వం ఎక్కడి నుండి మిగులుతుంది; ఇక సంస్కృతం. తెలుగులో సంస్కృతం 50 శాతం కలిసి పోయిందని తలుసున్నాం. అయినా మాలపల్లిలాటి రచనలలో గ్రామ జీవితాన్ని ప్రతిబింబించే వృత్తి పదాలు, సాంకేతిక పదాలు, గ్రామ జీవనంలో వాడిన పదాలు సేకరించి వాడుకోవచ్చు. అయితే అసలు సంస్కృత పదాలు తద్భవాలు,తత్సమాలు,దేశ్యాలులేనపుడు వాడుకోక తప్పదు. అప్పటి కవి చెప్పినట్లు–

"కేశవ, యాంధ్రులు నానా దేశం
బుల నుందు నిలిచి తెలుగుత త
ద్దేశ్యంబులంటి బలికిన నా శబము
లన్యదేశ్య జాంధ్రములయ్యేన్"

కావచ్చు. అన్ని భాషలలోని పదాలు తీసుకుందాం. భాష సజీవంగా వుండడానికి ఆదానప్రదానం తప్పదు కాని వాటికి ప్రత్యామ్నాయాలు తెలుగులో లేనపుడే తీసుకోవచ్చు.

అయితే తెలుగు పదాలు ఎక్కడ వున్నవి? అంటారా–ఇంగ్లీషు, సంస్కృతం, హిందీ మున్నగు భాషల ప్రభావం వల్ల తెలుగు తెలియని, తెలిసికొనని వారి నుండి తీసుకోవడం నిష్ప్రయోజనం. ఈ ప్రభావాలల్లో వ్యక్తిత్వం కోల్పోని, కలుషితంగాని, గ్రామ జీవనం వృత్తులలోని నిత్యవ్యవహారాలలో, గృహనిర్వహణలో, గ్రామప్రాంతంలో సాహిత్య భాషకన్నా జీవభాషలో లభిసవి ఆ పదజాలం ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని ప్రాంతాలలోని వివిధ గ్రామాలలో వివిధ వృత్తులవారి నుండి వివిధ పదాల నుండి వారు వాడే పదజాలం సేకరించాలి పదానికి వాడిక తగిలే నిఘంటువుకు చేరుతుంది రోజులు గడిచి, నిఘంటువుకు కూడా అందకుండా మరుగునపడిపోవాలి. మరుగుపడిపోతే భాష కృత్రిమ భాష అవుతుంది ఈ పదసేకరణకు విశ్వవిద్యాలయాలు, అకాడమీలు, విద్యాశాఖవారు, వివిధ వృత్తులవారు, వివిధ ప్రాంతాల నానుడులుగల గ్రంథ సముదాయాలనుండి సేకరించాలి ముఖ్యంగా ఈనాడు వయోజన విద్యా ప్రచారం విరివిగా సాగిస్తున్న ఈ సమయంలో వ్రాతరాదు గాని ఆయా ప్రాంతాలలోని అన్ని పదాలు వయోజనులకు సుపరిచితమే. మనం వారికి అక్షరం నేర్పితే వారినుండి ప్రతి వయోజకవిద్యాబోధకుడు ప్రాంతీయ పదాలు సేకరించ

వచ్చు. అందువల్ల భాషకు వివిధ ప్రాంతాల పదజాలాన్ని సంపాదించడం జరుగుతుంది. వీటిని ఒకచో చేర్చినచో ఒక్కొక్క పదానికి ఏఏ ప్రాంతంలో ఏఏ విధంగావలుకుతారో ఒక్కొక్క వస్తువును, ఒక్కొక్క ప్రక్రియను, ఒక్కొక్క నామవాచకానికి ఎవరెవరు ఏ విధంగా పదాలు వాడతారో తెలియడం వివిధ పదజాల పర్యాయ పదాలు సేకరించి భాషను సంపన్నం చేయడం జరుగుతుంది. మాండలికాలు ప్రాంతీయాలు, అప్పుడప్పుడు ప్రకటింపబడుతున్న వాటిని గ్రంథస్థం చేయడం ప్రయోజనకారి కాగలదు.

గతంలో 1930ల లో శ్రీ దిగవల్లి వెంకట శివరావుగారు ప్రప్రథమంగా 'పారిభాషిక పదకోశం' ప్రకటించారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు వృత్తి పదకోశం మూడు సంపుటాలుగా ప్రకటించారు. ఆంధ్రప్రదేశ్ అధికారభాషా కమీషను 1974 నుండి కొన్ని శాఖల పారిభాషిక పదాల పత్రికలు ప్రకటించారు. 20000పదాల పదకోశం తయారుచేయడం ప్రారంభించారు అది ఏ దశలో వుందో తెలియదు. 1975లో జరిగిన వార్షికోత్సవ సందర్భంగా చేసిన నా అభ్యర్థనను మన్నించి తెలుగు అకాడమీ పరిపాలన పదకోశం మూడుసంపుటాలలో తయారు చేశారు. విజ్ఞుల పరిశీలనలో వుంది. విజ్ఞానశాస్త్ర పద సూచనలు కొన్ని యిది వరలో ప్రకటించారు. ఈ ప్రయత్నం నిరంతరంగా పలుముఖాలుగా సాగుతూండడం ఎంతయినా అవసరం.

*దేశభాష ద్వారా విద్య బోధిస్తేనే గాని ప్రయోజనం లేదు.* శిష్టజన వ్యవహారిక భాష జీవంతో కళకళలాడుతుంటుంది వ్యావహారిక భాష గ్రంథ రచనకు, బోధనకు, పరీక్షలకు, పరిపాలనకు ఉపయోగపడదంటూ అందుకు మాండలికాలను చూపుతారు. శ్రీ పోరంకి దక్షిణమూర్తి - కోస్తా, రాయలసీమ, తెలంగాణా మాండలికాలను వాటి ఒక్కొక్క మాండలికభాషలో ఒక్కొక్క పుస్తకం వ్రాశారు. అవి ఆ ప్రాంతం వారికే సుబోధనం అవుతవి కాని ఇతరులకు కాజాలవు. అన్నింటిని కలిపినపుడు అందరికి కొంతవరకన్నా అర్థమవుతవి ఇతర ప్రాంతాల వారికి ధారాళంగా సాగడం లేదంటారు. నిజం. వాడుకభాష ఒక మండలంలో ఒకటిగనూ, మరొక మండలంలో మరొక విధంగానూ వుంటుంది అందుకు మార్గం ఏమిటి? తమ మండలంలో వున్న మాటలు, లేక ఇతర మండలంలోని మాటలు వాడదామంటారా! ఈ మాటలలో వేటిని వాడమంటారు? రెండూ వాడవద్దు, వివాదం లేకుండా పోతుంది పరభాష వాడుదామంటారా? అందుకు ఎవరు అంగీకరించరు కదా!

వ్యావహారిక భాష అంటే గ్రామ్యమనే అపప్రథ ఒకటి వుంది. గ్రామ్య శబ్దము, పారిభాషిక శబ్దము. పామరుల భాష గ్రామ్యమని, లక్షణ విరుద్ధమయిన భాష గ్రామ్యమని తెలుగు పండితులంటారు. ఏ అర్థంలో చూచినా మనం వాడే వ్యావహారిక శబ్దం గ్రామ్యంకాదు. అని గిడుగు వారు అన్నారు. మన ప్రాచీన కావ్యభాష వైదికభాష వంటిది. వ్యావహారిక భాష లౌకిక భాష వంటిది.

ప్రాంతరిక శబ్దాలు వ్యావహారిక భాష ప్రయోజనానికి ప్రతిబంధకం కాదని కూడా గిడుగు వారంటున్నారు. ఎవరి వాడుకలో వున్న శబ్దాలు వారు ప్రయోగిస్తారు

భాష నాలుగు రకాలు 1) మాట్లాడరు కాని వ్రాస్తారు. అది గ్రాంథికం. 2) మాట్లాడువారు వ్రాస్తారు. అది శిష్ట వ్యవహారికం 3) మాటాడుటకి కాని వ్రాయరు ఇది గ్రామ్యం 4) మాట్లాడరు వ్రాయరు దీన్నిప్రచ్ఛన్న గ్రాంథికం అంటారు మొదటిది మాట్లాడరు కాని వ్రాస్తారు కనుక బోధనలో చాలా కష్టం అవుతుంది సంభాషణలో కూడా ఉపయోగపడదు. ఇది గ్రాంథిక భాష. గ్రంథాలలో వుంటే చదువుకొనుటకు వుపయోగపడవచ్చు. రెండవది, శిష్ట వ్యవహారికం. దీనిలో మాట్లాడువారు వ్రాస్తారు. వ్రాయవచ్చు. దీనినే పాఠ్య పుస్తకాలలోనూ పరిపాలనలో ఉపయోగించవచ్చు. సుబోధకంగా వుంటుంది. పరస్పరం మాట్లాడుకోవటంలో హెచ్చుతగులుగాని స్థాయిలో తేడాగానివుండదు. వ్రాయడం కూడా సులువుగా వుంటుంది. మూడవది గ్రామ్యం ఇది కొన్ని ప్రాంతాలలో అది స్థానికంగా, చిన్న చిన్న సమూహాలలో మాత్రమే ఉపయోగింపబడుతుంది ఉపయోగపడుతుంది. వ్యాప్త పరిమితి తక్కువగా వుంటుంది. దీనికి ఆ చిన్న సమూహిక విలువను మించి సామాజిక విలువగాని, ప్రయోజనంగాని, సామాజిక గౌరవంగాని వుండదు. ఇక నాల్గవది సరళ నామక గ్రాంథికం. వ్రాసేది కాదు మాట్లాడేది కాదు. ఉంటే కొద్దిమంది మధ్యలో వుంటవచ్చు. సామాజిక ప్రయోజనం కాన్పించదు.

వీటిలో సామాజికంగా ఆలోచించినా, ఆదానప్రధానంగా ఆలోచించినా శిష్ట వ్యవహారికమే గణనీయం, దీనిని ఆధునిక ప్రమాణీకరణ భాషగా మన్నించవలసివుంది భాష ఒకే పద్ధతిలో స్థిరంగా వుండడం కష్టం సమాజం ఎంతవేగంగా ప్రగతికిగాని, దశానికిగాని పరువులెత్తుతుందో అంత తీవ్రతతో మనిషి వెంట ఛాయ పరువెత్తినట్లు పరువెత్తుతుంది. 1900 నుండి ప్రతి పది దశాబ్దంలోను భాష పరిణతి చెందుతూవుంది. ఆనాటి పత్రికారచనలు ఆనాటినుండి ఆధునిక రచనలల్లో సాగుతున్న పత్రికలేమి, రచనలేమి, పుస్తకాలేమి తులనాత్మకంగా పరిశీలనచేస్తే, ఎంతో తేడా కన్పిస్తుంది అనుభవం చెప్పాలెనంటె నా రచనలలోనే కనిపిస్తుంది. అవ్యక్తంగా అనుభవిస్తున్నాను. ఈ ఎనుబది సంవత్సరాలలో పత్రికలోనిభాష, సామాన్యజనంలోని యాస, పదజాలం, శబ్ద ఉచ్చారణ, వివిధ ప్రాంతాలనుబట్టి మాత్రమేకాక వివిధ కాలాలనుబట్టి కూడా మారుతూన్నది. వివిధ భాషల పరిచయాలవల్ల వివిధ దేశాల సంస్కృతులు జీవనం మిశ్రమం అవడంవల్ల నూతన వ్యక్తిత్వం ప్రస్ఫుటంగా ప్రతిబింబించుతుంది. ఈ పరిణామాన్ని సామాజిక స్పృహ అనవచ్చు. దీని ఫలితాలు కలిగించే కృషిని సామాజిక చైతన్యం అనవచ్చు. ఈ పరిణామాన్ని పరిశీలించి ఆధునిక ప్రమాణ భాషను శిష్టవ్యవహారికాన్ని నిరూపణ

చేయడమేగాక, రచనలు సాగించవలె ననే కృషిని స్పష్టీకరించుటకు శ్రీగ్విన్ సంఘాన్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నియమించింది వారు ఈ కృషి సాధించుటకు తెలుగు అకాడమీని యేర్పాటు చేయవలెనని సిఫారసు చేశారు కాని తెలుగు బోధనా భాషగా అమలు జరుపుటకు కావలసిన పాఠ్యపుస్తకాల రచన ప్రచురణలో తెలుగు అకాడమీ నిమగ్నమైపోవడంవల్ల ఈ కృషి వెనకబడిపోయింది. దీనిని వెంటనే సాగించడం అత్యవసరం.

ఆంధ్ర విశ్వకళా పరిషత్తు అకడమిక్ కౌన్సిలులో కళాప్రపూర్ణ పురిపండా అప్పలస్వామిగారు "ఆంధ్రవిశ్వవిద్యాలయంలో తెలుగులో పిహెచ్‌డిపై సమర్పించే పరిశోధనా వ్యాసాలు వ్యవహారిక భాషలో కూడా రాయవచ్చునని; ఆంధ్ర విశ్వవిద్యాలయంలో అన్ని స్థాయిలలోను తెలుగు పరీక్షా పత్రాలకు సమాధానాలు వ్యావహారిక భాషలో వ్రాయవచ్చునని; అన్ని తరగతులకు పాఠ్యపుస్తకాలుగా వ్యావహారిక భాషలో వున్న గ్రంథాలు కూడా విరయించవచ్చునని' ప్రతిపాదించిన తీర్మానం దీర్ఘ చర్చానంతరం వైస్‌ఛాన్సలరు శ్రీ యం. ఆర్. అప్పారావు అధ్యక్షతన ఒక కమిటీని నియమించారు. ఈ సంఘం 5-7-73 న తమ నివేదిక సమర్పిస్తూ, శిష్టవ్యవహారిక భాషను అమలు జరపవలసిందిగా సిఫారసు చేశారు. శ్రీ గ్విన్ కమిటీ కళాశాల తరగతులలోని పాఠ్యగ్రంథాలలో ఉపయోగించే భాష ప్రజాస్వామిక పరిపాలనా నిర్వహణలో ఉపయోగించే భాష ఆధునిక ప్రమాణ భాషగా వుండవలెనని చేసిన నిర్ధారణ కలిసి వీరిరువురు సిఫారసులు ఒక ప్రమాణాన్ని అందుకున్నవి. తెలుగు ఆధునికంగా ప్రమాణీకరించవలెనన్నారు. ప్రమాణికభాష శిష్టవ్యవహారికం అన్నారు.

ఇపుడా సంధియుగంలో వున్నాం. ఆధునిక విజ్ఞానంలో, న్యాయశాస్త్రపాలనలో, శాసన నిర్మాణ పరిభాషలో, సాంకేతిక పరిభాషలో, వ్యాపార వాణిజ్యరంగంలో, శాస్త్ర విజ్ఞానంలో, బోధనలో, నిత్యపరిపాలనలో, విధిలేక వాడవలసి వచ్చిన అన్య భాషా పదాలు, వాడకంలో మినహా వాక్యనిర్మాణంలో, విషయ వివరణలో, శిష్టవ్యవహారిక భాషను అమలు జరపడం అవసరం అని తేలుతున్నది. అందుకు విద్యాశాలల్లో చదివే పుస్తకాలు అందులో ఉపయోగించే భాష శబ్దాలు, వాటిని అన్వయించుకొని వ్రాసే ప్రశ్నాపత్రాలు, ఆ ప్రశ్నాపత్రాలకు వ్రాసే జవాబులు, పరిశోధన వ్యాసాలు ఏ భాషలో వుండేవో ఎంత సహజంగా వుంటేనో ఎంత సులభ బోధకంగా వుండేవో ఎంత అర్థవంతంగా వుండేవో ఎంత సృజనాత్మకంగా వుండేవో, అ ప్రతి వదిక విద్యాబోధనలో సాధన మాత్రంగా ప్రాతిపదిక యేర్పడాలి.

అధికార భాష అమలు జరుపుటకు తగిన ప్రాతిపదిక పాఠశాలల్లో కళాశాలల్లో తరిఫీదు యివ్వాలి. అధికారభాషగా అమలు జరుపుటకు తెలుగు బోధింపబడి వుండాలి. కోర్టులలో, సచివాలయాల్లో

వాణిజ్య రంగంలో, సాంకేతికరంగంలో, విజ్ఞానశాస్త్ర రంగాలలో, శాసన రచనా రంగంలో, అధికార భాషగా తెలుగు అమలు జరుపుటకు అనువగు భాషాజ్ఞానం పదజాలం. రచనా సామర్థ్యం, భాషాసంపత్తి, సృజనాత్మక రచనాపాటవం అలవడి వుండాలి.

భాషాభేషజాలకు పోకుండా సామాన్య జనానికి వారి సమస్యలకు, వ్యక్తులను, వారి వారి సాంస్కృతిక స్థాయికి అందుబాటులో వుండగల భాష సంభాషణలో, రచనలో, ఉత్తరాలలో, ఉత్తరువులలో అందించాలి. పరిపాలనా భాష ప్రజల భాషలోనే కాకుండా ప్రజలకు అర్థమయ్యే విధంగా అందుబాటులో వుండాలి. అందుబాటులో వున్నదనే విశ్వాసాన్ని కలిగించాలి. ఈ వాడిన శబ్దాలు మఘలో పుట్టి పుబ్బలో పోయినదన్నట్లుకాకుండా నిరంతరం ధారావాహికంగా ప్రవహించే భాషా ప్రవంతిలో నాలుగు కాలాపాటు నిలువ తొక్కుకొని భాషను, భావాన్ని మరో తరానికి అందివ్వాలి. అందుకు శిష్టవ్యావహారిక భాషా అనుసరణకు శరణం (9-4-80) ●

---


గృహనిర్మాణం మీ సమస్యా? సంప్రదించండి ఉచిత సలహాకై

Phone · 4110

M. S. NARIMANI
L.I.C. AGENT
C/o. M. N. MURTY
**Opp. Vizianagaram Palace, Peda Waltair**
**VISAKHAPATNAM-530 017**

* Insure Today for a Happy Tomorrow

*With compliments from :*

**SRIDEVI REFRIGERATION WORKS**
**Fishing Harbour**
VISAKHAPATNAM

# వాడుక భాష

శ్రీ ఎం. ఆర్. అప్పారావు
(వైస్‌ఛాన్సలర్, ఆంధ్ర విశ్వవిద్యాలయం)

తెలుగుభాష ఎప్పుడు ఏర్పడింది? అనేది ఇప్పుడు తేలే సమస్య కాకపోయినా క్రీస్తుకు పూర్వమే ఏర్పడిందనటంలో సందేహం లేదు హాలుని కాలంనాటి గుణాఢ్యుడు పేర్కొన్న పరిహరించిన దేశభాష తెలుగే అయి వుంటుందనుకోవటంలోనూ ఆశ్చర్యం లేదు. హాల శాలివాహన సప్తశతిలోని 'అత్తా', 'పాడి', పొట్టః, 'పిలుఅ'/పిల్ల/ వంటి మాటలు ఆనాటి తెలుగు అస్తిత్వానికి నిదర్శనాలు. అమరావతిలోని 'నాగబు'లోని 'బు' వర్ణం సంస్కృత శబ్దాలకు తెలుగు విభక్తులు కలిసి తత్సమాలుగా పరిణమించిన క్రమానికి తార్కాణం.

తెలుగుభాష యొక్క పౌరాతన్యం నిరూపించడానికి మాత్రం ఇవన్నీ పనికివస్తాయి. కాని ఆనాటి తెలుగు భాష రూప నిరూపణకు మాత్రం ఇవి చాలవు. క్రీ.శ. 6 వ శతాబ్దికి పూర్వపు తెలుగును గూర్చి మనకు ఏదీ స్పష్టంగా తెలియదు. ఎర్రగుడిపాడు శాసనంతోనే తెలుగు వెలుగులోకి వచ్చింది. అప్పటినుంచీ ఉన్న శాసన భాషను ఒక వైపునా, నన్నయనాటి నుంచీ గ్రంథస్థమైన భాషను ఒకవైపునా పెట్టి చూసినప్పుడు రెండూ రెండు దారులుగా కన్పిస్తాయి.

'ఇచ్చితిమి' అనే గ్రాంథికానికి ఆనాటి శాసనరూపం 'ఇస్తిమి' అని. 'నాలుగగు' 'నాలుగవు' అని గ్రంథస్థం అయితే 'నాలుగో' అని శాసనస్థమై గోచరిస్తుంది.

ఆనాటి శాసనభాష ఈనాటి వ్యావహారికానికి సన్నిహితంగా ఉండటం చూస్తే ఎవరికైనా ఆశ్చర్యం వేస్తుంది. ఆనాడే ఆనాటివ్యవహారికానికి దూరమైన కృత్రిమ గ్రాంథికం, పండిత భాషగా రూపొందిందని అనిపిస్తుంది. అంతేకాదు; ఆ పండితులు సైతం పద్య రచనలో అవలంబించినఅకృత్రిమత్వాన్ని టీకాతాత్పర్యాల్లో వ్యాఖ్యా వివరణాలలో

విసర్జించి వ్యవహారికాన్నే ఆశ్రయించా రనేది ప్రత్యక్ష సత్యం.

సంస్కృతానికి రాచమర్యాదలు లభించి, తెలుగు కావ్యంకూడాసంస్కృత పండితులకోసం వ్రాసిన రోజుల్లో కృత్రిమభాష సాహిత్య సామ్రాజ్యానికి పట్టం కట్టుకున్నది ఎంత కృత్రిమంగా ఉండి, ఎంత ఎక్కువమందికి ఎంత ఎక్కువ అగమ్యగోచరంగా ఉంటే అంత గొప్పతనం సంతరించుకున్నది. అయితే జనవ్యవహారం యొక్క ప్రభావం నుంచి తప్పించుకోలేని కవులు అక్కడక్కడా అగ్రాంథిక రూపాలను వాడుక చేసారు. ఈ పని పెద్దవాళ్ళు చేస్తే నిపాతం చిన్నవాళ్ళు చేస్తే ప్రపాతం. వ్యవహార భాషను మ్యూజియం వసువుగా ప్రదర్శించి పామరుడిమీద పెట్టి పేళాకోళం చెయ్యాలనుకొని, ఆ వ్యవహార బలంతోనే ఈనాటికీ బతికిన కవులూ ఉన్నారు.

ఒక విషయం ఒకరికి తెలివిడి చెయ్యావలసి వచ్చినప్పుడు పూర్వ పండితులు వ్యవహార భాషను ఆశ్రయించారని పైన చెప్పాం.

కాని చిన్నయసూరి గారి బాలవ్యాకరణ ప్రభావంతో ఆ దారి కూడ మూత పడింది. అదేకాదు, బాలవ్యాకరణం ప్రామాణంగా నన్నయాదుల రచనల్లో సైతం మార్పులూ చేర్పులూ చోటుచేసుకున్నాయి. వచన రచనకు సైతం సూరి చేపట్టిన ప్రాబంధిక మార్గమే మార్గదర్శకమైంది. వీరేశలింగం గారు కూడా 'సంధి విగ్రహా'ల్లో సూరిగారి కంటె రెండాకులు ఎక్కువే చదివారు. అయితే ఆయన సంఘ సంస్కరణోద్యమం, ఆ ఉద్యమం యొక్క అవసరాలు ఆయనను భాషా సంస్కరణానికి పురికొల్పాయి. 'మూగ చెవిటివారి ముచ్చట' కాకుండా అందరికీ తెలిసేట్టు సరళంగా వ్రాయవలసి వచ్చింది. అందుకే ఆయనా, ఆయన అనుయాయులు చిలకమర్తి ప్రభృతులూ ఆ తర్వాత నవలలూ నాటకాలూ వ్రాసిన అనేకులూ ఆ సరళ వచన రచనకు ఉపక్రమించారు.

తెలుగు నేర్చుకోటానికి పూనుకొన్న బ్రౌనుదొర 'ఇక్కడి జనం మాట్లాడే భాష మా పండితులు మాకు చెప్పరు. ఈ విడూరం ఏమిటి ?' అని అబ్బురపోయాడు.

1906 లో విద్యాపరీక్షకుడిగా వచ్చిన యేట్సు దొర వ్యాఖ్యానం ఈ సందర్భంలో గమనించ దగింది

ఊరి బయట చిన్నచిన్న గుడిసెలే కడజాతివాళ్ళ బసులు. అక్కడే వాళ్ళు అక్షరాలు నేర్చుకోవాలి. వాళ్ళకు గ్రాంథికరూపాలు నేర్పటంలో ఎంత కాలం వ్యర్థం చేస్తున్నారో నేను గమనించాను. వాళ్ళకు లేని అర్థాలు లెక్కపెట్టటానికి కూడా గ్రాంథికభాషే నేర్పుతున్నారు. గొప్పకులాల్లో సైతం చదువుకోని వాళ్ళుకానీ చదువుకున్న వాళ్ళుగానీ ఎన్నడూ వాడని భాష ఆ కడజాతి వాళ్ళకు ఎందుకు నేర్పుతున్నారో నాకు అర్థం కాదు. వాళ్ళకు చెప్పటానికి ఆధునిక వ్యవహారికం పనికిరాదా ? అని నేనడిగాను'.

మన గ్రాంథిక వ్యామోహం ఎందాకా పోయిందో పై మాటలు స్పష్టం చేస్తాయి.

అప్పట్లో విశాఖపట్నం ఎ. వి. యన్. కాలేజీ ప్రిన్సిపాల్‌గా ఉండిన పి. టి. శ్రీనివాస అయ్యంగారు ఈ విషయంలో గురజాడ అప్పారావు గారితోనూ గిడుగు రామమూర్తి గారితోనూ సంప్రదించ వలసిందిగా యేట్సుదొర గారికి సలహా ఇచ్చారు ఆ నలుగురూ — అందులో ఇద్దరే తెలుగువారు — సాగించిన చర్చల ఫలితంగానే మన శిష్టవ్యవహారికోద్యమం రూపొందింది.

'Telugu Teaching Reform Society' ని శ్రీనివాస అయ్యంగారు ప్రారంభించారు. దానికి యేట్సు దొర గారు అధ్యక్షులు. ఉపాధ్యాయ సభలో భాషా స్వభావాన్ని గూర్చి వరిణామాన్ని గూర్చి శిష్ట వ్యవహారికాన్ని గూర్చి గిడుగు రామమూర్తి గారి ఉపన్యాసాలతో ఈ ఉద్యమం తలెత్తింది. తరువాత విజయనగరం కళాశాల ప్రిన్సిపాల్ ప్రొఫెసర్ కె రామానుజాచార్యులు గారు అధ్యక్షులుగా, గిడుగురామమూర్తిగారు ఉపాధ్యక్షులుగా బుర్రా శేషగిరిరావు కార్యదర్శిగా ఈ ఉద్యమ నిర్వహణకోసం 'ఆంధ్ర సాహిత్య సంఘం' ఏర్పడింది. కొవ్వూరులో ఎలమంచిలిలో మహాసభలు జరిగాయి.

1911 లో శ్రీనివాస అయ్యంగారు 'లాంగ్‌మాన్స్ అరిత్ మెటిక్కులు' అనే పుస్తకం — వ్యావహారికంలో ప్రదర్శించారు. వ్యవహారికాన్ని సమర్థిస్తూ 'Death or Life: a plea for Vernaculars అనే కరపత్రం వెలువరించారు. అదే ఏట చెట్టి లక్ష్మీ నరసింహంగారి 'గ్రీకు మిత్రులు', వేదం వెంకటాచలమయ్య గారి 'విధి లేక వైద్యుడు' అనే పుస్తకాలు ఒకరకం వ్యవహారికంలో బడిపిల్లల ఉపవాచకాలుగా వెలువడ్డాయి.

విద్యార్థుల వ్యాసరచనకు 1912 లో వ్యవహారికాన్ని కూడా ఆమోదించిన ప్రభుత్వం 1915 లో మద్రాసు యూనివర్శిటీ సిండికేటు, ఇంటర్మీడియట్ కాంపోజిషన్ కమిటీ నివేదిక మేరకు, వ్యావహారిక భాషను నిరాకరించటంతో, తన ఆమోదాన్ని ఉపసంహరించుకొంది. అంతటితో అప్పటికు విద్యాలయాల ద్వారా వాడుకభాషను ప్రవేశపెట్టాలనే యేట్సుదొర ప్రయత్నం వమ్మయిపోయింది

అయితే మానవ విజ్ఞానం దినదినాభివృద్ధి చెందుతూ, అచ్చుయంత్రం వచ్చి అందరికీ అందుబాటులోకి వస్తున్న రోజుల్లో కృతక భాషా కవచం తొడిగి దాన్ని మూసిపెట్టటం ఎవరికి సాధ్యం కాదు. సందుగొందుల్లాంటి పాఠశాలల కంటె ప్రపంచం ఎంతో విశాలమైంది.

ఒకవంక వ్యవహారికభాషకోసం గిడుగు రామమూర్తి ప్రభృతులు హోద్యమం సాగిస్తూ వుంటే, అప్పట్లో గొప్ప పేరు ప్రఖ్యాతులు గల ఆంధ్ర సాహిత్య పరిషతు కొక్కొండ వెంకటరత్నం, వేదం వెంకటరాయశాస్త్రి ప్రభృతుల ఆధ్వర్యంలో గ్రాంథికానికి వెన్ను కాస్తూ వచ్చింది. విశ్వ విజ్ఞా

నాన్ని అందరి ప్రజలకు పంచిపెట్టాలని కంకణం కట్టుకొన్న కొమర్రాజు లక్ష్మణ రావు, కట్టమంచి రామలింగారెడ్డిగార్ల వంటి మహా మేధావులు సైతం గ్రాంథి కాన్ని విడనాడి జనవ్యవహారంలోని శిష్టశైలిని అనుసరించలేకపోయినారంటే ఆనాడు గ్రాంథిక వాదులకు ఎంత ప్రాబల్యం ఉండేదో బోధపడుతుంది. సంఘ సంస్కరణాన్ని సాంఘికోద్య మంగానే కాక, సాహిత్యోద్యమంగా కూడా నడిపిన కర్ణధారి వీరేశలింగంగారు సైతం చిట్టచివరకు గాని వ్యవహారిక రీతిని ఆమోదించలేకపోయారు.

వ్యావహారికంలో గురజాడ అప్పారావు గారి కన్యాశుల్కం'వెలువడడంతో సాహితీ ప్రపంచంలో పెద్ద విప్లవం వచ్చింది యువ రచయితలే కాదు, పాత్రోచితభాష పేరిట వేదం వెంకట రాయశాస్త్రిగారు సైతం తమ 'ప్రతాప రుద్రీయం'లో వ్యావహారికాన్ని చేపట్ట వలసి వచ్చింది. క్రమంగా కింకపీంద్ర ఘటా పంచాననులు శ్రీ చెళ్లపిళ్ల వారు కూడ వ్యవహారికంలోనే అనేక వ్యాసాలు వ్రాశారు.

పత్రికలు వచ్చి రచనా వ్యాసంగం నిత్యకృత్యంగా పరిణమించాక, నిత్య వ్యవహారంలోనిశిష్టవ్యవహారికానికి అగ్ర స్థానం లభించింది. మొదట్లో గ్రాంథిక శైలినే పట్టుకొని పాకులాడిన పత్రికలు క్రమంగా వ్యవహారికంలోకి దిగి పోయాయి. బడి పిల్లలకోసం తప్పితే గ్రాంథికంలో వ్రాసే రచయితలే కరువై నారు. కథ, కావ్యం, నవల, నాటకం, వ్యాసం, విమర్శ - ప్రతి సాహిత్య ప్రక్రియా వ్యావహారికరీతిలోనే జీవం పోసుకున్నది.

పత్రికల్లో, రేడియోలో, సినిమాలో ఎక్కడా గ్రాంథికానికి చోటులేకుండా పోయింది. రాకపోక సౌకర్యాలతోపాటు విజ్ఞాన విషయం విస్తరించి, మాండలిక భేదాలను అంతర్లీనం చేసుకొని శిష్టవ్యావ హారికం ఒక సుస్థిర రూపం పొందింది.

'దేశభాష ద్వారా విద్య బోధిస్తేనే కాని ప్రయోజనం లేదు. శిషజన వ్యవ హారికభాష లోకంలో సదా వినపడుతూ ఉంటుంది. అది జీవంతో కలకల లాడుతూ ఉంటుంది గ్రాంథికభాష గ్రంథాలలో కనబడేదే గాని వినబడేది కాదు. ప్రతిమ వంటిది. ప్రసంగాలలో గ్రాంథికభాష ప్రయోగిస్తూ తిట్టుకున్నా సరసాలాడుకున్నా ఎంత హాస్యాస్పదంగా ఉంటుందో చూడాండి' అన్న గిడుగు వారి ప్రబోధం మరువరానిది

ప్రాచీన కావ్యభాష నేడున్న పిల్లల చేత చదివించి అదులోనే వారి చేత వ్రాయించరాదా? అది అందరికి సామాన్య భాష అంటారు కొందరు. అది అందరికి అన్యభాష వంటిదే. అది ఎవరికీ పట్టుపడక పోవడములోని 'సామ్యం' అంటాను నేను. అని గిడుగు వారు నిష్కర్షగా చెప్పింది నిజం.

అందుకే ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఇంతకాలంగా శిష్టవ్యావహారిక శైలిమీద ఉన్న నిషేధాన్ని తొలిగించాము. ఎవరి ఇష్టమైన శైలిలో వారు వ్రాయటానికి విద్యార్థులకు అవకాశం కల్పించాము. అంతేకాదు తెలుగు భాషా సాహిత్యాలే కాక భౌతిక మానవ శాస్త్రాలన్నీ తెలుగు లోనే బోధించే ఏర్పాట్లు చేస్తున్నాము.

సజీవమైన భాష ద్వారా విజ్ఞానం విజ్ఞానంద్వారా భాష పరస్పరాభ్యుదయం సాధిస్తాయని ఆశిస్తున్నాము.

# పాఠ్య గ్రంథాల్లో తెలుగు భాష

తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయం

డాక్టర్ బూదరాజు రాధాకృష్ణ

1.1 ఆధునిక విద్యా విధానం ఆరంభమయినప్పటి నుంచీ తెలుగులో పఠనపాఠనాలు జరుగుతున్న పద్ధతులను పరిశీలించటమే ఈ వ్యాసోద్దేశం. ప్రాచీన కాలంలోనూ మధ్య యుగాల్లోనూ, విద్యాబోధన ఏ విధంగా జరిగేదో, అప్పటి పాఠ్యగ్రంథాలేవో, వాటి మంచి చెడ్డలేమిటో, వాటిలోని భాషా స్వరూపం ఎటువంటిదో ఇక్కడ చర్చించడంలేదు బ్రిటిష్ పరిపాలన వచ్చిన తరువాత పాశ్చాత్య పద్ధతుల్లో పాఠశాలలేర్పడ్డ విద్యా పద్ధతిలో, భాషా స్వరూపంలో వచ్చిన మార్పులనూ, ఫలితంలో వచ్చిన కష్ట నిష్ఠురాలనూ ఈ వ్యాసం స్థూలంగా సంగ్రహంగా పరిశీలిస్తుంది. పాఠ్యగ్రంథాల్లోని భాషాస్వరూప నివేదనకే ఇందులో ప్రాముఖ్యముంది.

1.2 ప్రాగ్దక్షిణాంధ్ర ప్రాంతాల్లో క్రీ.శ. 1600 నాటికే బ్రిటిష్ పరిపాలన స్థిరపడ్డా దేశ భాషా విషయం తొలి రోజుల్లో వారంత పట్టించుకోలేదు. క్రీ.శ. 1720 నాటికే తెలుగులో క్రైస్తవ వాఙ్మయం రావటం మొదలయినా, 1746 కే తెలుగు-అచ్చు మొదలైనా (నిడుదవోలు 1954 ; 68), మద్రాసులో 1816 లో తెలుగు_ముద్రణాలయం వెలిసినా (రమణారెడ్డి 1969 : 28), బ్రిటిష్ పార్లమెంటు 1813 లో ఛార్టర్ ఏక్ట్ చేసి దాన్ని అమలు పరచటానికి చర్చి మిషనరీ సొసైటీ స్థాపించి మద్రాసులోని సెంట్ జార్జికోటలో పాఠశాల స్థాపించినప్పటి నుంచే (రమణారెడ్డి 1969 . 21) ఆధునిక విద్యాబోధన మొదలయిందని చెప్పవచ్చు. అప్పట్లో బ్రిటిష్ ఉద్యోగులకు దేశభాషలు నేర్పటమే ప్రధానాశయంగా ఉండేది. దేశ భాషల్లోకూడా విద్యాబోధన తలపెట్టటానికి ప్రథమ చర్యగా పాఠ్యగ్రంథాలు రాయించాలనే సంకల్పంతో 1820 లో ఉపయుక్త గ్రంథకరణ దేశ భాషా సభను అప్పటి ప్రభుత్వం స్థాపించింది. [నిడుదవోలు 1954 ; 86]. 1839 లో మద్రాసు మచిలీపట్టణాల్లో ఇంగ్లీష్ మీడియం పాఠశాలలు, 1841 లో మద్రాసులో ఉన్నత పాఠశాల, 1855లో అక్కడే ప్రెసిడెన్సీ కళాశాల స్థాపించి చివరి మెట్టుగా 1857 లో మద్రాసు విశ్వవిద్యాలయం నెలకొల్పారు. (రమణారెడ్డి 1969 : 22).

13 పాఠశాలలు స్థాపించిన తొలి రోజుల్లో పఠన పాఠనాలు ఏ విధంగా జరిగాయో పూర్తి వివరాలు తెలియటం

లేదు. కాని 1816-1818 మధ్యకాలంలో వ్యావహారికాంధ్ర రచనలూ, వ్యాకరణాలూ పాఠ్యగ్రంథాలుగా ఉండేవని, అంతకు ముందే కనీసం మూడు శతాబ్దాలుగా సరళవాగవ్యవహారికవచనసాహిత్యం తెలుగులో సంప్రదాయ సిద్ధంగా ఉందనీ నిరూపించటానికి కావలసినన్ని నిదర్శనలు లభిస్తున్నాయి. 1816లో తొలిసారి వెలుగు చూసిన కాంబెల్ తెలుగు వ్యాకరణం 1820 లో మలి ముద్రణకు నోచుకుంది. 1849కి తృతీయ ముద్రణకు వచ్చింది [కొత్తపల్లి 1960 181] పాఠ్య గ్రంథాలకు ఈనాటికీ వస్తున్న ప్రచారాదరాలకు ఇది ప్రథమ నిదర్శనం కావచ్చు 1817 లో విలియం బ్రౌన్ వ్యాకరణం, 1834లో పుదూరి సీతారామశాస్త్రి వ్యాకరణం, 1836 లో రావిపాటి గురుమూర్తి శాస్త్రి వ్యాకరణం, 1840 లో ఛార్లెస్ ఫిలిం బ్రౌన్ తెలుగు వచనంలో రాసిన తెలుగు వ్యాకరణం వెలిశాయి. ఇవన్నీ వ్యావహారిక రూపాలను 'సాధించినవే' [బూదరాజు 1972 78]. రావిపాటి గురుమూర్తి శాస్త్రి విక్రమార్కుని కథలు (1819), పంచతంత్ర కథలు (1834) పాఠ్య గ్రంథాలుగా ఉండేవి. అలాగే ఏనుగుల వీరాస్వామయ్య కాశీయాత్రా చరిత్ర [1838] తో పాటు గణితశాస్త్రం (1848) భూగోళ పరిచయం (1849). ప్రపంచ భూగోళం(1852జంతుస్వభావదీపిక (1855) వంటి అనేక రచనలు వ్యావహారిక గ్రంథాలయినా అప్పట్లో పాఠ్యగ్రంథాలుగా ఉండేవి ఆధునిక విద్యా సంస్థల తొలి రోజులనాటి పరిస్థితి ఇది. ఇదే సంప్రదాయబద్ధత(బూదరాజు1972:78)

1.4 పరవస్తుచిన్నయసూరి 1848లో గ్రంథకరణ సభకు అధ్యక్షులు కావటం, 1855లో ప్రెసిడెన్సీ కళాశాల తెలుగు శాఖకు అధిపతి కావటం కాలగతివిమార్చివేశాయి అయన 1853లో రాసిన నీతి చంద్రిక, 1855లో ప్రచురించిన బాల వ్యాకరణం శాఖాధిపతుల స్వప్రయోజనాభిమానాలకు నిరూపణగా పాఠ్య గ్రంథాలై అంతవరకున్న సాంప్రదాయ మార్గాన్ని తప్పుదోవలు పట్టించింది. ముద్రణావకాశాలు వారికి తోడ్పడ్డాయి. అప్పటి నుంచి ప్రాచీన గ్రంథ ప్రచురణలో గూడా 'సంస్కరణ పద్ధతులు' ప్రవేశించి, బాలవ్యాకరణ విరుద్ధ ప్రయోగాలను దిద్దటం మొదలయింది. ఈ దౌర్న్యానికి గురైనవారిలో పాపం చిన్నయసూరి కూడా ఒకరు కావటం దురదృష్టమయినా తెలుగు పండితుల పూర్వపూర్వ భాషారూప గౌరవానికి వారే ఆది కారకులు. చివరకు 1910 నాటికి సంప్రదాయ పరిరక్షణ కోసం వ్యావహారికోద్యమం బయలుదేరడానికి ఈప్రాచీనతాభిమానమే దారితీసింది. ఆ తరువాత జరిగిన పోరాటం మొదట ఉమ్మడి మద్రాసు ప్రభుత్వ విద్యాశాఖలో మొదలై, తరవాతమద్రాసు విశ్వవిద్యాలయానికి వ్యాపించి, దరిమిలా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖలో ప్రజ్వలించి, విశ్వవిద్యాలయాల దగ్గర జ్వాలాతోరణాలు కడుతున్నది. చివరికిది ఏదీ పోరాట మవుతుందేమో తెలియదు.

1.5 ఒకటి రెండు అర్ధ వ్యవహారిక గ్రంథాలను ఉపవాచకాలుగా నయినా సహించలేని కొందరు పండితులు వ్యవ

హారికోద్యమానికి ప్రేరకులయినారు ఫలితంగా వచ్చినవాదోపవాదాలు మద్రాసు ప్రభుత్వంలోని విద్యాశాఖ కార్యదర్శి 1912 సెప్టెంబరులో స్కూల్ ఫైనల్ విద్యార్థులు ప్రాచీనార్వాచీన భాషాశైలుల్లో ఏదయినా పాటించవచ్చుననే ఉత్తరువు జారీ చేయటానికి కారణమైనాయి (G.O. 3098) దానిమీద జరిగిన కోలాహలం అదే నెలలో మరో ఉత్తరువువేసి (G.O 3478) శైలి ఎన్నుకొనే హక్కు వ్యక్తికి కాక మెజారిటీ సూత్రం మీద పాఠశాలలకూ ప్రధానోపాధ్యాయులకూ సంక్రమింపజేశారు 1913లో మరో ఉత్తరువు ద్వారా (G O, 20). వ్యావహారిక రచనలు అంగీకరించారు పాఠ్య గ్రంథాలుగా. న్యాయవాదులు ఇందుకు అంగీకరించక బహిరంగ సభలుజరిపారు ప్రభుత్వోద్యోగులువారికి వత్తాసు పలికారు. దానితో రంగస్థలం మారింది. ప్రభుత్వం ఈ తలనొప్పిని మద్రాసు విశ్వవిద్యాలయానికి మార్చింది. 1913 ఏప్రిల్ నెలలో మద్రాసు విశ్వవిద్యాలయం వారు 'కాంపొజిషన్ కమిటీ' అనే సంఘం వేసి తలలు బద్దలుకొట్టుకొమ్మన్నారు, సంఘ సభ్యత్వం విషయంలో రాజకీయాలు నడిచాయి ఆ సంఘం 1913 ఆగస్టు 2వ తేదీన ప్రథమ సమావేశం జరిపింది 1914 ఏప్రిల్ 20వ తేదీన గురజాడ అప్పారావు 'Minute of dissent' ప్రచురించారు. ఆ సంవత్సరం ఆగస్టు 11వ తేదీన మద్రాసు విశ్వవిద్యాలయం సిండికేట్ వారుఆధునికాంధ్రమనేదేలేదని తీర్మానించారు. వారి మాటమీద ఢమ్మ కంతో మద్రాసు ప్రభుత్వంవారు 1915 ఫిబ్రవరిలో ఆధునిక శైలిలోరాయబడినదని రాసిన పుస్తకాలు పాఠ్య గ్రంథాలుగా చదవకూడదని నిర్ణయించారు. (G. O. 196). ఈ విధంగా ప్రాచీన సంప్రదాయం స్థానంలో పరవస్తు సాంప్రదాయం నిలదొక్కుకొని పాఠ్యగ్రంథాల్లో గ్రాంథిక భాషకు పట్టాభిషేకం చేసింది (బూదరాజు 1972, అప్పారావు కమిటీ నివేదిక 1973)

16. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు వ్యావహారికోద్యమానికి వ్యతిరేకంగా ఎన్నో చేతలు చేసి ఎన్నో కూతలు కూసినా చివరికి 1924 అక్టోబర్‌లో తమ వ్యతిరేకతను వదులుకోవలసి వచ్చింది (బూదరాజు 1972: 97) తెలుగు సాహిత్యంలో కాలక్రమాన వ్యావహారికమే ప్రథమ స్థానం సంపాదించింది. ఇక్కడొకరు అక్కడొకరు కవివరేణ్యులు తమ గతానుగతిక, అప్రతిభ పద్య సాహిత్యం ప్రచురిస్తున్నా అనేక సాహితీ ప్రక్రియల్లో వ్యావహారికం అద్వితీయ గౌరవం సంపాదించింది. బహుశా ఈ ఆనందోద్రేకంలోనేమో 1968 దాకా పాఠ్యగ్రంథాల్లోని ప్రాచీన భాషా విషయం ఎవరూ పట్టించుకోలేదు. ఈలోగా గ్రాంథిక వాదులు కావలసినంత చేసుకుంటున్నారు రెండు చేతులా 1968లో అప్పటి ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖ డైరక్టర్ ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి అధ్యక్షతన ఆరేడు తరగతులకు ప్రథమ ద్వితీయ భాషాబోధనకు తెలుగులో పాఠ్యగ్రంథాలు సిద్ధంచేయటానికి ఒక సంఘం నియమించారు. సంఘసభ్యులు ద్వితీయ భాషగా తెలుగును బోధించే

పాఠ్యపుస్తకాల తయారీ విషయమే తాము స్వీకరిస్తామన్నారు. వ్యావహారికంలో రాయించారు కాని అప్పటి స్పెషల్ ఆఫీసరు అభ్యంతరాలు లేవదీశారు, రూల్సు ఒప్పవని తర్జనభర్జనలు జరిగాయి. ఫలితం కలగలేదు. అప్పటి విద్యామంత్రి ఆ పుస్తకాల ముద్రణ ఆపివేశారు. చివరికి భిన్న రంగాల్లో ప్రముఖులైన తెలుగువారి నాహ్వానించి 1965 ఏప్రిల్‌లో తిరుపతిలో ఒక మహాసభ జరిపింది ప్రభుత్వం. దానికి పింగళి లక్ష్మీకాంతం అధ్యక్షులు. చర్చోపచర్చల పర్యవసానంగా తెలుగును ద్వితీయ భాషగా బోధించే పాఠ్యగ్రంథాల్లోనూ, శాస్త్రవిషయక గ్రంథాల్లోనూ శిష్ట వ్యావహారికమే ఉపయోగించాలని ప్రథమ భాషగా బోధించే పాఠ్య గ్రంథాల్లోను తెలుగునే శాస్త్ర విషయంగా అభిమాన విద్యగా బోధించే పాఠ్యగ్రంథాల్లోను సరళగ్రాంథికం వాడాలనీ ఒక అంగీకారం కుదిరింది (అప్పారావు 1973 : 21). ప్రభుత్వం వెంటనే ఈ సిఫారసు ఆమోదిస్తూ వ్యావహారిక స్వరూప నిర్ణయం చేయటానికి పింగళి లక్ష్మీకాంతం అధ్యక్షతన త్రయోదశ సభ్య సంఘాన్ని 1965 సెప్టెంబరులో నియమించి సంవత్సరం లోగా విద్యాశాఖ డైరక్టరుకు తమ నివేదిక సమర్పించాలన్నది. నివేదిక సకాలంలోనే అందినా అరణ్యవాస, అజ్ఞాతవాసాలు కూడా అధిగమించి పద్నాలుగేళ్లు గడిచినా ప్రభుత్వం ఆ నివేదికనైనా ప్రచురించలేదు; నివేదిక సిద్ధంగా లేదని తీర్మానాలు అమలుపరచటంలేదు;. ఇందుకు కారకులెవరో తెలియదు. వారి పాండిత్య విశేషాలేమిటో పరమాత్ముడికే ఎరుక.

17 ఈ కథ ఇలా నడుస్తుండగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1966 లో చట్టరీత్యా తెలుగును అధికార భాషగా నిర్ణయించింది. ముందు నిర్ణయంచేసి, తరవాత అమలు పరిచేదెట్లా అనే విచికిత్సలో పడి అప్పటి విద్యాశాఖ కార్యదర్శి జె. పి. ఎల్. గ్విన్ అధ్యక్షతన 1966 డిసెంబరు 28 వ తేదీన (G O. 3051) మరో సంఘం నియమించింది. వారు పునఃపరిశీలించి 1967 లో లక్ష్మీకాంతం సంఘంవారి నివేదికను అమలు జరపటానికి తక్షణ చర్యలు తీసుకొమ్మని ప్రభుత్వానికి సిఫారసు చేశారు (అఅప్పారావు 1973 22) అంతేకాదు. అమలు పరచటానికి ఒక సంస్థను స్థాపించాలన్నారు. ప్రభుత్వంవారు అటు ఉన్నతోద్యోగులతో ఇటు రాజకీయ నాయకులతో చర్చలమీద చర్చలు జరిపి చివరికి 'తెలుగు అకాడమి' అనే సంస్థను 1967 లో స్థాపించి. బడ్జెట్‌లో కేటాయింపు జరగలేదని వెంటనే మూసివేసి తరవాత 1968 లో పునస్స్థాపించారు. (ఆ సంస్థ ఇంకా నడుస్తున్నది). 1968 లోనే విశ్వవిద్యాలయాల పర్యవేక్షణనుంచి ఇంటర్మీడియట్ స్థాయి విద్యా విషయాలను తప్పించి ప్రత్యేక సంస్థకు సమర్పించటం జరిగింది. ఆ సంస్థవారు నిర్ణయించిన పాఠ్య ప్రణాళికల మేరకు తెలుగు అకాడమి పాఠ్య గ్రంథాలు ప్రచురించాలని ప్రభుత్వం నిర్ణయించింది. అప్పుడు కథ మళ్ళీ మొదటికి

వచ్చింది. విద్యామంత్రి అధ్యక్షతన తెలుగు విద్వాంసులు అనేక పర్యాయాలు సమావేశమైన తర్వాత లక్ష్మీకాంతం సంఘం, గ్విన్ సంఘంవారు చేసిన సిఫారసుల ప్రకారం పాఠ్య గ్రంథ రచనా ప్రచురణాలు జరగాలంటూనే గ్రాంథికానికి సన్నిహితంగా ఉండే వ్యావహారిక రూపాలే వాడాలని, ప్రాంతీయ / మాండలిక లక్షణాలు కొన్ని నిలుపుతూ కొన్ని నిర్బంధాలు పాటిస్తూ ఈషత్ కృత్రిమ వ్యావహారికం వాడాలనీ నిర్ణయించారు. డిగ్రీ స్థాయి పాఠ్య గ్రంథ ప్రచురణ 1970 లో మొదలైనప్పుడు కొత్తగొడవలేమీ జరగలేదు. అక్కడక్కడ కొద్దిపాటి మార్పులతో ఇదే పరిస్థితి కొనసాగుతున్నది.

1.8 శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయం తెలుగుశాఖ వారు 1969 లో తెలుగు భాషా సాహిత్యాల మీద పరిశోధన చేసే విద్యార్థులు తమ సిద్ధాంత వ్యాసాలను 'ఇష్టమైతే' వ్యావహారికంలో రాయవచ్చునన్నారు. 'ఇష్టం' విద్యార్థిదే కాక పర్యవేక్షకుడిది కూడా కావచ్చు. ఉస్మానియావారు ఈ విషయం పట్టించుకోలేదు.

1 9 ఆంధ్ర విశ్వవిద్యాలయం అకడమిక్ కౌన్సిల్ సమావేశంలో పురిపండా అప్పలస్వామిగారు 11-1-1971 న రెండు తీర్మానాలు ప్రవేశపెట్టారు. అవి ఇవి : "1. ఆంధ్ర విశ్వ విద్యాలయంలో తెలుగులో పి. హెచ్. డి.కై సమర్పించే పరిశోధన వ్యాసాలు వ్యావహారికభాషలో కూడా రాయవచ్చును. 2. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో అన్ని స్థాయిలలోనూ తెలుగు పరీక్ష పత్రాలకు సమాధానాలు వ్యావహారిక భాషలో రాయవచ్చును. అన్ని తరగతులకు పాఠ్య పుస్తకాలుగా వ్యావహారిక భాషలో వున్న గ్రంథాలు కూడా నిర్ణయించవచ్చును" (అప్పారావు 1973:1) ఈ తీర్మానాలు చర్చించి నివేదించటానికి ఒక నిపుణుల సంఘాన్ని ఎం. ఆర్. అప్పారావుగారి అధ్యక్షతన నియమించగా వారు 1973 జులై 5 వ తేదీన తమ చివరి నివేదికను సమర్పించారు తుది నివేదికలోని 'alone' [మాత్రమే] అనే పదాన్ని 1974 మార్చి 29 వ తేదీన గుంటూరులో జరిగిన అకడమిక్ కమిటీ సమావేశంలో తొలగించారు అప్పారావుసంఘం వారి నివేదిక ప్రకారం 1973-1977 మధ్యకాలంలో గ్రాంథిక వ్యావహారికాలు రెండూ ఉంటాయి. 1977 విద్యా సంవత్సరం పూర్తి అయ్యేలోగా బి. ఏ., ఎం. ఏ. లలో కూడా వ్యావహారికమే అమలుకు రావాలి [అప్పారావు 1973:6]. ఈ సిఫారసులు అమలుజరవటానికి విశ్వ విద్యాలయం ఉపాధ్యక్షుల అధ్యక్షతనే ఒక స్థాయీసంఘాన్ని నియమిస్తూ 1974 నవంబరు 22 వ తేదీన సిండికేట్ తీర్మానించింది. ఆ స్థాయీ సంఘం ప్రథమ సమావేశం 1975 ఫిబ్రవరి 2 వ తేదీన జరిగినప్పుడు తొమ్మిదిమంది సభ్యుల్లో మూ ఆరుగురు హాజరైనారు తరవాత మరి సమావేశమంటూ జరగలేదు. ఏం జరిగిందో, ఎందుకా సంఘం బుట్టదాఖలయిందో తెలియదు. ఎక్కడ వేసిన గొంగడి అక్కడే ఉంది.

1.10 ఈ పరిస్థితి ఇలా ఉండగా,

శాస్త్రి ప్రభుత్వంవారు తెలుగును ద్వితీయ భాషగా బోధించే పాఠ్య గ్రంథాల విషయం గుర్తుకు తెచ్చుకున్నారు. అంత వరకూ సరైన పుస్తకాలు లేవని 3 వ తరగతి ప్రథమ భాషా వాచకాన్ని 4 వ తరగతికి ద్వితీయ భాషా వాచకంగా వాడుతుండేవారు. అదో సర్దుబాటు. 1973 ఏప్రిల్ 27 వ తేదీ నాటి ఉత్తరువుతో (G O 384) ఒక సంఘాన్ని నియమించి మొదటి సమావేశం జరిగిన ఆరు నెలల్లోగా (i) 3 వ తరగతికి ద్వితీయ భాషా వాచకాన్ని వ్యావహారికంలో రాయాలని, (ii) 4, 5, 6 తరగతుల ద్వితీయ భాషా పాఠ్య ప్రణాళికను సవరించాలని, (iii) అప్పటికే సిద్ధంగా ఉన్న 7,10 తరగతుల ద్వితీయ భాషా వాచకాల రాతప్రతులను సరిదిద్దాలని ఆజ్ఞాపించారు దేవులపల్లి రామానుజరావుగారి (అప్పుడాయన ఉస్మానియా విశ్వవిద్యాలయానికి తాత్కాలికోపాధ్యక్షులు) అధ్యక్షతన 10-9-1973 నుంచి 12-9-973 వరకు మూడు రోజులపాటు సమావేశం జరగవలసి వుండగా కావలసిన వివరాలన్నీ లేవని తొలిరోజుతోనే సమావేశం ముగించారు. వివరాలు SCERT వారు అప్పటికీ ఇప్పటికీ ఇవ్వనేలేదు. ఆ సంఘం ఉందో పోయిందో, అసలిప్పుడేమి జరుగుతున్నదో అగమ్యగోచరం. అదే విధంగా బోర్డ్ ఆఫ్ సెకండరీ ఎడ్యుకేషన్ వారు కూడా విద్యా ప్రణాళికను, పరీక్షా పద్ధతిని సరిదిద్దటానికి సంస్కరించటానికి 1976 జనవరి 27 వ తేదీన మరో సంఘం నియమించారు. (Rc. No. 99-D1 – 1 / 75 dated 27-1-76 of the Commissioner for Government Examinations). స్థానిక సభ్యుల సమావేశం 1976 ఫిబ్రవరి 27 వ తేదీన జరిగింది. 1976 జూన్ 8, 9 తేదీల్లో ద్వితీయ సమావేశం జరగాలని నిర్ణయించే టప్పటికే మొదటి ఉత్తరువులోని 'విద్యా ప్రణాళికా' విషయాన్ని సమావేశ పరిశీలన నుంచి తొలగించి వేశారు। ఇది ఎవరు ఎప్పుడు ఎందుకు మార్చవలసి వచ్చిందో తెలియదుగాని అసలీ విషయమే అంతటితో సద్దుమణిగింది ఈ విధంగా ప్రభుత్వం తలపెట్టిన పనులేవీ నెరవేరలేదు. నెరవేరుతాయన్న నమ్మకంకూడా పోతున్నది.

1.11 ఇన్నిటిలోనూ కొట్టవచ్చినట్లు కనపడే శుభ లక్షణాలు కొన్ని లేక పోలేదు సంఘాల ఉపసంఘాల నియామకం, అవి సమర్పించిన నివేదికలను అవతల పారవెయ్యటం, నివేదిక ఇవ్వక పోతే మరో సంఘం వేయటం, సమావేశాలు అనుకున్న పద్ధతిలో జరక్క పోతే అసలు జరవకనే పోవటం, ఒక వేళ నివేదికలను ఆమోదిస్తే అమలు జరపక పోవటం ఈ లక్షణాల్లో కొన్ని. ప్రభుత్వమైనా, విశ్వ విద్యాలయమైనా యిదే తంతు. ఇందులోనూ మరో చమత్కారముంది. ఎక్కడైనా వ్యావహారిక ప్రయోగం అమలు జరిగితే అది ఉన్నత స్థాయిలోనే గాని ప్రాథమిక స్థాయిలో కాదు. పునాది లోప్రభూయిష్ఠం. పై అంతస్తులు గట్టిగా ఉండేదెలా? విశ్వ విద్యాలయాల్లోని తెలుగు శాఖల పెద్దలు రాసేది వ్యావహారికంలో, రాయించేది అర్ధగ్రాంధికంలోనో అర్ధవ్యావహారికంలో

నో చూసిచూడనట్లు ఊరుకుంటున్నాం గదా, రూల్సు మార్చటమెందుకని వారి ప్రశ్న. దొంగబతుకెందుకని నా ప్రశ్న. ఈ పరిస్థితికి 1979 మే నెలలో తెలుగు అకాడమితో కలిసి ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖ వారు జరిపిన వజ్రోత్సవ ప్రత్యేక సదస్సు ప్రత్యక్ష నిదర్శనం. అప్పుడు పాఠ్యగ్రంథాలలో ప్రభుత్వ వ్యవహారంలో, న్యాయపరిపాలనలో అన్ని స్థాయిలోనూ, ఒకేసారి వ్యావహారికం ప్రవేశపెట్టాలని తీర్మానాలు రాపి ఇచ్చినవారే విస్తృత సమావేశంలో నోరు విప్పక, తీర్మానం ఉపసంహరించుకోటానికి తోడ్పడ్డారు. పరిస్థితులూ పద్ధతులూ స్వభావాలూ ఇదే విధంగా కొనసాగితే ఈసారి వచ్చే ఉద్యమం ప్రాణాంతకంగా పరిణమిసుందని గుర్తించాలి. తాము ఆచరణలో పెట్టని, పెట్టలేని నియమ నిబంధనలెందుకు? వాటిని మార్చలేనంత అశక్తతకు కారణమేమిటి? ఒక్క తమిళదేశంలో తప్ప మరెక్కడా ఈ దుస్థితి, వంచన లేవు. వాళ్ళనయం. పట్టుబట్టి సర్వశక్తులూ ఒడ్డి భాషను వేల సంవత్సరాలు వెనక్కు నడుపుతున్నారు. అందులో దాపరికం లేదు. మన నేతలు కనీసం అలాగైనా చేయరాదా?

## ఉపయుక్త ప్రధాన గ్రంథాలు


1954 – – నిడదవోలు వెంకటరావు ఆంధ్రవచన వాఙ్మయ చరిత్ర

1960 – – కొత్తపల్లి వీరభద్రరావు తెలుగుసాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం.

1969 – – రమణారెడ్డి, కె. వి. మహోదయం

1972 – – బూదరాజు రాధాకృష్ణ వ్యావహారిక భాషా వికాసం

1973 – – అప్పారావు. ఎం. ఆర్. A Report submitted to the Andhra University by the Telugu Language Committee.




# ప్రామాణిక తెలుగు

## 1. తెలుగు భాష :

తెలుగు ద్రావిడ భాషల్లో ఒకటి. ఈ కుటుంబంలో ఇప్పటివరకు 22 భాష లున్నట్లు కనుగొన్నారు. తెలుగు ముఖ్యంగా ఆంధ్ర రాష్ట్రంలో మాట్లాడే భాష. 1971 జనాభా లెక్కల ప్రకారం మన దేశంలో తెలుగు మాట్లాడే వారి సంఖ్య 4,47,54,850. ఇందులో ఆంధ్ర రాష్ట్రంలో 3,71,37,282. తెలుగు మాట్లాడే వాళ్ళ మొత్తం సంఖ్యలో యిది 85.5 శాతం. ఇతర రాష్ట్రాలలో (76,17,568) ఇతర దేశాల్లోను తెలుగు మాట్లాడేవారు 80 లక్షలకు పైగా ఉంటారు. 'తెలుగు భాష' అనే పదం చాలా విస్తృతమైన పదం. ప్రపంచంలో ఏ ప్రాంతంలో మాట్లాడే తెలుగైనా యీ తెలుగు భాష అనే వ్యవహరిస్తారు. తెలుగు ప్రాంతానికి మనదేశంలో మరే ప్రాంతానికి లేని మరో విశిష్టత కూడా ఉంది. తెలుగు మాట్లాడే ప్రాంతం చుట్టూరా 5 భాషలు మాట్లాడే ప్రాంతాలతో సంబంధాలు కలిగి ఉంది. ఒక వంక తమిళనాడు, మరో వంక కర్నాటక, ఒక ప్రక్క ఒరిస్సా, మరో ప్రక్క మహారాష్ట్ర, మరోమూలలో హిందీ భాషీయులతో సరిహద్దు సంబంధాన్ని కలిగి ఉన్నాయి. అందువల్ల యీ అయిదు ప్రాంతాల్లో 5 రకాల ద్విభాషీయుల్ని మనం చూడవచ్చును. ఇవి కాకుండా రాష్ట్రంలో 4, 5 ముఖ్యమైన ప్రాంతీయ మాండలిక వ్యత్యాసాలున్నాయి. అలాగే ప్రతి ప్రాంతీయ మాండలికంలోనూ సామాజిక మాండలిక వ్యత్యాసాలున్నాయి. ఇవి కాక తమిళనాడు, కర్నాటక, ఒరిస్సా, కేరళ మొదలైన రాష్ట్రాలలో ద్విభాషీయులుగా వ్యవహరించే తెలుగులో కూడా వ్యత్యాసాలున్నాయి. మారిషస్, మలేషియా, దక్షిణాఫ్రికా, ఫిజి, శ్రీలంక, బర్మా, మొదలైన విదేశాలలో మాట్లాడే తెలుగులో కూడా వ్యత్యాసాలున్నాయి సమాజం మారుతూ ఉంటుంది. సమాజంలోని ప్రజలు భిన్న భిన్న రీతుల్లో వ్యవహరిస్తారు. అందువల్ల వారు మాట్లాడే భాషలో కూడా మార్పులు జరుగుతూనే ఉంటాయి. మానవ సమాజంతోనే - దీన్ని అనుసరించుకొని ఉన్న భాష కూడా మారుతుంది. భాషలోని మార్పుకి కారణం - సమాజంలోని మార్పే.

## 2. ప్రామాణికత :

ప్రమాణం, ప్రామాణికత అనే మాటలు మనం నిత్య జీవితంలో

డా॥ యస్. శివరామమూర్తి

వింటుంటాం. ప్రమాణం అంటే ఒక కొలబద్ద వంటిదని అర్థం. ప్రతి పదార్థం యొక్క విలువ దాని అవసరాన్ని బట్టి, అందులోని గొప్పతనాన్ని బట్టి దాన్ని వాడుకొనే సమాజమే నిర్ణయిస్తుంది. లోకంలో ప్రతి వస్తువు విలువ దాన్ని వాడుకొనే వారిమీద ఆధారపడిఉంటుంది. అలాగే ఒక భాషా రూపం విలువ దాన్ని వాడుకొనే వాళ్ళమీదఆధారపడి ఉంటుంది కాని మిగతా పదార్థాల లాగా, వస్తువుల లాగా భాషా రూపాల విలువని నిర్ణయించడం కష్టం. ఎందుకంటే భాషారూపాన్ని త్రాసులో పెట్టి తుయ్యలేంకదా. ఈ రూపాలు ఎవరయినా అమ్ముతామన్నా వెలకట్టి మనం కొనలేము. ఈ సామాన్య సత్యం అందరికి తెలిసిందే. అందువల్ల భాషా రూపాల విలువ వాటిని వాడే ప్రజల విలువను బట్టి ఉంటుంది. అందు వల్ల భాషా రూపాలు అంటూరు.

బంగారం, వెండి మొదలయినవి ఇండిపెండెంట్ (స్వతంత్ర) వేరియబుల్స్ అంటారు. అలాగే మన అల వాట్లలో కొన్ని మంచివి, కొన్ని చెడ్డవిగా సమాజం పరిగణిస్తుంది. ఇందులో కొన్ని ఆర్థికంగాను, ఆరోగ్యపరంగాను, విలువయినవిగా చెప్పవచ్చును. అందువల్ల వీటి విలువ సమాజంలోని ప్రతి మనిషి గుర్తించగలడు. కానిభాషారూపాల విలువ మనం తూక ప్రమాణానికి గాని, కొల ప్రమాణానికి అనువుగా లేనివి.

కొన్నిటి విలువ వాటిని వాడే మనుషుల మీద ఆధారపడి ఉంటుంది. భాషా రూపాలు కూడా అటువంటివాటిలో ఒక తరగతికి చెందినవి. భాష, విద్య మన పురాతన కాలంతో ఒక దానితో ఒకటి సంబంధం వున్నట్లు చెప్పుకోవడం కద్దు.

### 3. తెలుగు మాండలికాలు :

ఈ సువిశాల ప్రపంచంలో ఎక్కడ మాట్లాడే తెలుగయినా యీ తెలుగు భాషలో భాగమేనని ముందే చెప్పుకొన్నాం. ఆంధ్ర రాష్ట్రంలో అన్ని రకాల వారు మాట్లాడే తెలుగు, మలేషియా, ఫిజీ శ్రీలంక మొదలయిన దేశాల్లో మాట్లాడే అతి భిన్నమయిన తెలుగు భాష యిందులో భాగమే. అన్ని భాషల్లో లాగానే తెలుగు భాషలో కూడా సహజంగా మాండలికా లేర్పడ్డాయి. పూర్వకాలంలో రవాణా సౌకర్యాలకొరత వల్ల ఒక ప్రాంతం వాళ్ళు మరొక ప్రాంతానికి సులువుగా ప్రయాణం చేయలేక పోయేవాళ్ళు. ఏదో కొద్దిమంది తప్ప ఎక్కడి వారక్కడే ఉండిపోవలసి వచ్చేది అందువల్ల ఒకచోటి వాళ్ళు మాట్లాడే తెలుగు అక్కడి ప్రజలు వాడుతున్నట్లేఉండిపోయేది.దీనివల్ల నేటితెలుగు 3 ముఖ్యమయిన మాండలికాలేర్పడ్డాయి. ఇవి కళింగ (శ్రీకాకుళం, విశాఖపట్టణం), కోస్తా (నెల్లూరు తప్ప అన్ని కోస్తా జిల్లాలు), రాయలసీమ, తెలంగాణా అనేవి. ఇక్కడి భాషా స్వరూపాలు అక్కడి పరిపాలకులు, అభ్యసించే విద్యను బట్టి కూడా మారుతూ ఉంటాయి. ఉదాహరణకి కోస్తా ప్రాంతంలో వాడిన్ని గౌరవ వాచక సర్వనామాలను తెలంగాణా ప్రాంత భాషలో వాడరు. కోస్తా ప్రాంతంలో వాడు, అతను,

ఆయన, వారు, తమరు మొదలయిన గౌరవ వాచక సర్వనామాలు ఉపయోగిస్తూ రకరకాల జాతుల, అధికారుల మధ్య గౌరవాన్ని సూచించడానికి ఉపయోగిస్తారు. దానికి ముఖ్యమయిన కారణం ఆ భాషలో జరిగిన సంస్కృతీకరణ. తెలంగాణాలో సామాన్యుడు మాట్లాడే భాషను మనం చూస్తే-ఎక్కువగా అడు (వాడు) అనే మాట కనపడుతుంది ఈ సర్వనామాల్ని బట్టి క్రియా రూపాలు కూడా మారుతాయి. ఇక్కడి నైజాం పరిపాలనలో వివిధ జాతుల మధ్య మనం కోస్తాలో పాటించినంత గౌరవ వ్యత్యాసాలు లేనట్టే కన్పిస్తుంది. అలాగే రాయలసీమలో కూడా కోస్తాలో వాడినంత విస్తృత సర్వనామ ప్రణాళిక లేదు. (ఈ విషయాల మీద యింకా పరిశోధన జరగాల్సి ఉంది.) ఇటువంటివి సాంస్కృతికంగా వివిధ ప్రాంతాల్లో కలిగిన వ్యత్యాసం వల్ల భాషలో కలిగే మార్పులు అలా గాకుండా కేవలం భాషలో కలిగిన ధ్వని మార్పుల వల్ల కూడా వివిధ ప్రాంతాల్లోను,వివిధజాతులు మాట్లాడే భాషలో వ్యత్యాసం కనబడుతుంది. కొన్ని ఉదాహరణలు గమనించండి.

వచ్చాడు
ఒచ్చాడు
ఒచ్చినాడు
వచ్చినాడు
ఒచ్చిండు
అచ్చిండు

ఆంధ్రరాష్ట్రంలో మాట్లాడేతెలుగులో ఈ రూపాలున్నాయి. ఇంకా మరికొన్ని రూపాలు కూడా ఉండవచ్చును. ప్రామాణిక భాషలో యీ రూపాలన్నీ చోటు చేసుకొనడానికి అవకాశం ఉండదు. ఇటువంటి అన్ని రూపాలు ప్రామాణిక భాషలో చోటు చేసుకోగలిగితే ప్రామాణిక రూపం, అప్రమాణిక రూపం అనే ప్రశ్నే ఉండదు. అందువల్ల ఈ రూపాల్లో ఏ కొన్నింటికో ప్రామాణిక భాషలో చోటు లభిస్తుంది. ప్రామాణిక భాషలో చోటు లభించడానికి కొన్ని ముఖ్యమైన కారణాలున్నాయి ముఖ్యంగా ఆయా రూపాలు ప్రతి భాషలోనూ, సాహిత్యంలోను పచురంగా చోటు చేసుకోవాలి. నవలల్లో పాత్రలను బట్టి మాండలికాలు మారుస్తూ రాసిన కొద్ది రచనల లోని రూపాలు ప్రామాణికమయినవిగా మారే అవకాశం లేదు. ఎందుకంటే యివి ఏ కొద్ది నవలల్లోనో ఏ కొద్ది మంది

## 4. బాల-ప్రౌఢ వ్యాకరణాలు : వీటి ప్రభావం :

1858లో శ్రీ పరవస్తు చిన్నయసూరి బాల వ్యాకరణం, ఆ తర్వాత 885లో ప్రౌఢ వ్యాకరణం బహుజనపల్లి సీతారామాచార్యుల వారిచె వెలువడ్డాయి. బాల వ్యాకరణంకవిత్రయాన్ని ప్రామాణికంగా తీసుకుంది అంటే నన్నయ్య, తిక్కన, ఎఱ్ఱన కవుల్ని ప్రామాణిక కవులుగా తీసుకొంది. వారు 11, 12, 14 శతాబ్దాలకు చెందినవారు. ఈ రెండు వ్యాకరణాల్లో బాల వ్యాకరణం చాలా ఖ్యాతి గడిచింది. గ్రాంథిక వాదులు దీన్ని రమారమి వేదంగా పరిగణించి 14 వ శతాబ్దం తర్వాత రాసిన పుస్తకాల పరిష్కారంలో

కొన్నిటిని దిద్దడం కూడా మొదలు పెట్టారు దీన్ని శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు తీవ్రంగా ఖండించారు. అక్కణ్ణించి శ్రీ రామమూర్తి పంతులు గారు ఉపన్యాసాలిచ్చి, వ్యాసాలు ప్రచురించి తెలుగు వ్యావహారిక భాషోద్యమం ప్రారంభించారు. వ్యావహారిక భాషోద్యమంలో ఆ రోజులలో పాల్గొన్న ప్రముఖులు రామమూర్తి పంతులుగారు, శ్రీనివాస అయ్యంగార్, శేషగిరిరావు, గురజాడ అప్పారావు ప్రభృతులు.

బాల వ్యాకరణం కళాశాల విద్యార్థులకు పాఠ్య గ్రంథంగా నిర్ణయించి అందులో కొన్ని పరిచ్ఛేదాలు బి.ఏ., బి.యస్.సి. క్లాసుల్లో ప్రవేశపెట్టారు. స్కూలు విద్యార్థులకు కూడా ఇందులోని కొన్ని అంశాలను బోధిస్తూ ఉండేవారు.

వ్యాకరణం అనే సరికి తెలుగు విద్యార్థులకు చెప్పలేనంత భయం కలిగేది. ఈ వ్యాకరణం వల్లనే తెలుగునేర్చుకోవడం చాల కష్టమని కూడా అనిపించేది కొందరు ఉపాధ్యాయులు బోధించే వ్యాకరణం తరగతులలో నూటికి పది మంది కూడా హాజరయ్యేవారు కాదు. దీనికి మరొక కారణం కూడా ఉంది. వ్యాకరణం బోధించే ఉపాధ్యాయుడికే సరిగ్గా తెలుగు వ్యాకరణ తత్త్వం అర్థమయ్యేది కాదు. ఇక ఆయన విద్యార్థులకు ఎలా చెప్పగలడు. కొద్ది కాలం క్రిందట వ్యాకరణమంటూ ప్రత్యేకంగా నేర్పే అలవాటు లేకపోయింది. ప్రస్తుతం మనం చదువుకొనే భాషాశాస్త్రంలాగా. అందరిలాగే ఆ ఉపాధ్యాయుడు కష్టపడి మార్కుల కోసం వ్యాకరణం చదువుకొనేవాడు. కళాశాలలలో సాధారణంగా పని నర్దుబాట్లు ఆ ఉపాధ్యాయునికి వ్యాకరణం మీద ప్రత్యేక అభిలాష ఉన్నా లేకపోయినా వ్యాకరణం బోధించే బాధ్యత ఆయనది అయ్యేది. ఇక తప్పనిసరి అయి బోధిస్తూండేవారు. అందువల్ల వ్యాకరణమంటే యిటు బోధించే ఉపాధ్యాయుడికి, అటు నేర్చుకునే విద్యార్థికి కూడా కొరకరాని కొయ్యగా పరిణమించి తెలుగు మాతృభాషీయులకు తెలుగంటే ఒక రకమయిన ఏవగింపు కలిగింది. ఇందులో ఎక్కువ భాగానికి కారణం యీ వ్యాకరణాలే. ముఖ్యంగా యీ వ్యాకరణాలు గ్రాంధికంలో సూత్ర పక్కిలో రాయబడి యిది తప్పు యిది ఒప్పు అని చెప్పేవిగా ఉండేవి. కాబట్టి యీ తప్పొప్పులు విద్యార్థులు నేర్చుకోనడానికి అనువుగా లేకపోవడంవల్ల తెలుగు భాషా బోధనలో కొన్ని చిక్కులేర్పడ్డాయనడంలో సందేహంలేదు. ఇదిలా ఉండగా వ్యాకరణం మీద మోజున్న పండితులు తెలుగునకున్న వ్యాకరణ దీపం చిన్నది అని అందునే ఉన్నారు. ఇక్కడ చెప్పుకోవలసిందేమిటంటే తెలుగుకు ఉన్న వ్యాకరణ దీపం అందరికి వెలుగు నివ్వలేదన్నది సత్యమే.

## 5. వ్యవహారిక భాషోద్యమానికి కారణం :

వ్యావహారిక భాషోద్యమానికి ముఖ్యంగా పరోక్షమైన ఆ నాటి సామాజిక పరిస్థితులు. 1850 తర్వాత భారత దేశంలో ముఖ్యంగా సమాజంలో చైతన్యం కలగడం ప్రారంభించింది.

సాంప్రదాయకంగా వచ్చిన కొన్ని దురాచారాల్ని ఖండించడం, సామాజిక సమానత కోసం నినాదాలు చెయ్యడం, స్వాతంత్ర్యం కోసం తపించడం మొదలైనవి యీ కాలంలో కలిగిన సామాజిక చైతన్యంలో మార్పులు. సామాజిక చైతన్యం కలిగిన కొద్ది కాలానికే భాషలో కూడా చైతన్యం కలిగింది. 1897 ఆ ప్రాంతంలో రాయబడ్డ గురజాడ అప్పారావు గారి రచనలు సమాజంలో దురాచారాల్ని ఎత్తి పొడవడమే కాకుండా అప్పటివరకు పాతుకుపోయిన గ్రాంథిక వాదాన్ని కాదని ఆయన కన్యాశుల్కం, ముత్యాల సరాలు మొదలైనవి వ్యావహారికంలో రాశారు. అందువల్ల ఆయన ప్రారంభించిన వ్యావహారిక ఉద్యమం చాలా ఒడిదుడుకులు కలిగినా చివరికి వ్యావహారిక ఉద్యమం విజయం పొందింది. దీనికి కారణం సమాజంలో కలిగిన మార్పే. ప్రస్తుత నవ సమాజ సమ సమాజ నిర్మాణాన్ని గురించి ఆలోచించే ఈసమాజంలో భవిష్యత్తులో వ్యవహారికం నిలవడం, గ్రాంధికం రెండో స్థానాన్ని చేరుకోవడం తప్పదు. ఏదో కొద్దిమంది గ్రాంధికాన్ని కాపాడాలని ప్రయత్నించినా అంత విజయవంతం కాదు. ఎందుకంటే, యిది కేవలం భాషా వాదమ్మాత్రమే కాదు. ఇది సామాజిక భాషా వాదం. అందుకే భాష విలువ, అభివృద్ధి కేవలం తనను వాడే ప్రజల మీద ఆధారపడి ఉంటుందని చెప్పకొన్నాం.

ఆనాడు వచ్చిన సామాజిక చైతన్యం ఈనాటి నవ సమాజానికి పునాది. ఆనాడు గురజాడ, గిడుగు రామమూర్తి పంతులు గారు జరిపిన వ్యావహారిక భాషోద్యమం యీనాటి లెక్కలేనన్ని రచనలకీ, పత్రికలకి పునాది. చాలా మంది కవులు, రచయితలు వెలిశారు. నేతెలుగులోనూ రాయగలను అనే మనస్సంకల్పం, మనశ్శక్తి ప్రసాదించింది యీ వాదం. వ్యావహారికంలో రచనలు చెయ్యకూడదను కొంటే మన సాహిత్యంలోనూ ఏవో కొద్ది రచనలు మాత్రమే వెలువడేవి ఇంత విస్తృత పరిధిలో రచనలు జరిగేవి కావు. రచయితలు ఉద్భవించే వారు కారని చెప్పడంలో ఎటువంటి అతిశయోక్తి లేదు. అందువల్ల పరోక్షంగా యిటువంటి పరిణామానికి శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు కారణం

## 6. ప్రామాణిక రూపం - - అవశ్యకత :

వివిధ మాండలికాలు కలిగిన ఏ భాషకైనా ఒక ప్రామాణిక రూపం అవసరం. వివిధ రకాలుగా వ్యవహరించే మానవ సమాజానికి, సామాజికంగా కొన్ని కట్టుబాట్లుండడం అవసరం. ఎవరి యిష్టం వచ్చినట్లు వారు చెయ్యగలిగితే సమాజంలో నానా చిక్కులు ఏర్పడతాయి. అందువల్ల ప్రతి సమాజానికి, ప్రతి సంస్థకి, ప్రతి ప్రభుత్వానికి కొన్ని నిర్ణీత సూత్రాలున్నాయి. ఈ సూత్రాల ననుసరించి మాత్రమే పనిచేస్తుంటాయి యీ సమాజమూ, సంస్థలూ, ప్రభుత్వమూ అందువల్ల సామాజికంగా ఏటిలో ఉండే సూత్రాలు చాల వరకు స్థిరమైనవి. కాని అందులోని సభ్యులు మారుతూనే ఉంటారు. సమాజ అవసరాన్ని బట్టి

మార్పులు జరుగుతుంటాయి. వీటిని కొత్తగా చేర్చుకొన వలసి ఉంటుంది. అందువల్ల సమాజ నిర్మాణ సూత్రాలు అందులోని సభ్యుల కంటే స్థిరత్వం కలిగి ఉంటాయి భాష కూడా ఒక సంస్థ లాంటిదే. ఇందులోని సభ్యులు చావు పుట్టుకల వల్ల మారుతున్నా దాన్ని ఉపయోగించే సూత్రాలు కొద్ది మార్పులతో అలాగే ఉంటాయి. ఈ కొద్ది మార్పులకు భౌతికంగాను, సామాజికంగాను కారణాల వల్లనే సమాజంలో ఈ సూత్రాలే ఆ సమాజాన్ని ఒకటిగా బంధిస్తాయి.

ఈ సూత్రాలే ఆ సమాజానికి కొలబద్దగా వ్యవహరిస్తాయి.

ఆ ప్రామాణిక రూపం మాట్లాడే వారికి గౌరవాన్ని ఆపాదిస్తుంది

అందువల్ల తెలుగువారి నందరిని ఒకటిగా ఉంచడానికి కొన్ని ప్రమాణాలు అవసరం. అందులో భాష ఒకటి ఎన్నో మాండలికాలున్నాయి కదా, ఇవన్నీ తెలుగువారి నందరిని ఒకటిగా ఉంచవా? అనే ప్రశ్నకు ఉంచవనే చెప్పాలి. ప్రామాణిక రూపం లేకుండా ప్రతి మాండలికంలోనూ పాఠ్య పుస్తకాలు, మిగతా పుస్తకాలు, ప్రభుత్వ నిబంధనలు, ఉత్తర్వులు ప్రచురించడం నష్టం. ఒకటికి నాలుగింతలు పనిగా మారుతుంది ఇది పనిలో నాలుగింతలు కావడమే కాకుండా నాలుగు రకాల ఆలోచనలకు దారి తీసుంది. అయితే మాండలికాలు వ్రాతల్లో ఉపయోగించ కూడదా అంటే కొన్ని పరిస్థితుల్లో ఉపయోగించవచ్చును. ప్రాథమికంగా వయోజనుల విద్యకోసం, స్కూళ్ళలో ప్రాథమిక తరగతుల్లోను, ఆయా మాండలికాలను ఉపయోగించడంలో కొంత అర్థం వుంది. కాని కొంత కాలం తర్వాత ప్రామాణిక తెలుగుకి మారవలసి ఉంటుంది. దీనికి ముఖ్యమైన కారణమేమంటే90శాతంరచనలుఎప్పుడూ ప్రామాణిక తెలుగులోనే వస్తున్నాయి. అందువల్ల మిగతా రచనలు చదవాలంటే ప్రామాణిక తెలుగుతో పరిచయం కలగాలి.

| | కళాశాల స్థాయి – బి. ఏ | | | విశ్వవిద్యాలయంస్థాయి – ఎం. ఏ. | |
|---|---|---|---|---|---|
| | మొదటి సం॥ | రెండవ సం॥ | మూడవ సం॥ | నాలుగో సం॥ | అయిదో సం॥ |
| 1973 | ఆధునిక తెలుగు | ఆధునిక/సాంప్రదాయ | ఆధునిక/సాంప్రదాయ | ఆధునిక/సాంప్రదాయ | ఆధునిక/సాంప్రదాయ |
| 1974 | ఆ | ఆ | ఆ/సా | ఆ/సా | ఆ/సా |
| 1975 | ఆ | ఆ | ఆ/సా | ఆ/సా | ఆ/సా |
| 1976 | ఆ | ఆ | ఆ | ఆ | ఆ/సా |
| 1977 | ఆ | ఆ | ఆ | ఆ | ఆ |

(తెలుగు రిపోర్ట్ 1973 పే. [illegible])

## 7 ప్రామాణికరూపం : ఉత్పత్తి :

పత్రికల్లోను, పాఠశాలల్లోను, సామాన్య జనులు చదివే సాహిత్యంలోను వాడే భాష సాధారణంగా ప్రామాణిక భాషగా చలామణి అవుతుంది అంటే, ఇది ఏ ప్రభుత్వంగాని. సంసగాని యిది ప్రామాణికం– మీరు దీన్ని అనుసరించండి అని ప్రత్యక్షంగా చెప్పక పోయినా, పరోక్షంగా పాఠ్యగ్రంథాల ద్వారాను, ఇతర సాహిత్య వ్యాసంగం వల్లను ఒక ప్రామాణిక భాషను కొన్ని సంస్థలు సమాజానికి అందిస్తూ ఉంటాయి అంతేకాకుండా, రచయితలు ఆ జాతి మొత్తం జనాభాలో చాలా కొద్ది శాతం అయినా వారు రాసేది ప్రామాణికం అని మొత్తం జనాభాచేత పరిగణించేటట్లుచేసే శక్తి వారికుంది

మొదట తెలుగులో ఎక్కువ సాహిత్యము, పత్రికా సాహిత్యము– నేటి ఉభయ గోదావరులు, కృష్ణా, గుంటూరుల నుంచి వచ్చిందని చెప్పడంలో అతిశయోక్తి లేదు. అలాగని మిగతా ప్రాంతాల నుంచి సాహిత్య సృష్టి జరగలేదని కాదు అంతా కాకుండా మొత్తం ఆంధ్రరాష్ట్రంలో ఈ ప్రాంతంలో భూములు సారవంతమైనవి, వ్యవసాయానికి నీటి సరఫరా సమృద్ధిగా జరిగేది ప్రజల్లో ధనవంతులు ఉండడంవల్ల, తద్వారా నాగరికత, ఆ తర్వాత కళల గురించి ఆలోచించే అవకాశం, స్థోమత ఉండడంవల్ల ఈ ప్రాంతం నుండిఎక్కువగాసాహిత్యసేవజరిగిందనిచెప్పుకోవాలి ఇంకాముఖ్యంగా తొలుతొల రాజమండ్రి విజయవాడ, మొదలయిన ప్రాంతాల్లో ముద్రణా యంత్రాలు స్థాపించి సాహిత్యాన్ని వెలుగులోకి తేవడానికి కారకులయినారు ఇక్కడివారు. అందువల్ల ఈ ప్రాంతంలో శిష్టులు వాడే తెలుగు శిష్ట వ్యావహారికంగా చలామణి అయింది, ఇప్పుడు యీ శిష్ట వ్యావహారికం చదువుకున్న వారందరికీ పరిచయమే ఎందుకంటే స్కూలు పుస్తకాల్లో ఈ వ్యావహారిక రూపాన్ని వాడడం వల్లనే. అంటే ఒక రూపం ప్రామాణిక రూపం కావడానికి అక్కడి సామాజిక స్థితిగతులు కూడా ముఖ్యమైన కారణం.

## 8· శిష్ట వ్యావహారికం ఉపయోగం ప్రభుత్వం తీసుకొన్న చర్యలు :

సెప్టెంబరు 21న 1912లో మద్రాసు స్కూల్ ఫైనల్ బోర్డు సెక్రటరీ మొట్టమొదటి (సర్క్యులర్ నెం 3098–12–9 1912) వ్యావహారిక తెలుగును పరీక్షా పత్రాల్లో రాయొచ్చునని ఆదేశించారు ప్రతి స్కూల్లోను ఏదో ఒక వ్యావహారిక రూపం గాని ప్రాచీన తెలుగురూపాన్ని కూడాలని ఆదేశించారు. తర్వాత యీ ఉత్తర్వులను మారుస్తూ జనవరి 10, 1913న ప్రతి వ్యక్తి తను ఏ భాషా రూపంలో రాయాలంటే దాంట్లోరాయొచ్చునని ఉత్తరువులు జారీ చేశారు (సర్క్యులర్ నం. 20–10.1.1913) కాని ఆ తర్వాత గ్రాంధిక వాదులు తమ వాదాన్ని బలంగా ప్రతిపాదించడంవల్ల గవర్నమెంటు 12 2.1915న) 3098, 20 నవంబరు గల G. O. ను ప్రతిహరించుకొంటూ ఉత్తర్వులు జారీ చేసింది. కాని నవలల్లోను, పత్రికల్లోను వ్యావహా

రికం వి స్తృతంగా వాడటం జరిగింది. దానివల్ల శ్రీ రామమూర్తి పంతులుగారు ఏమీ నిరాశపడకుండా ఆయన వ్యావహారిక వాదమ్మీద 1919లో 'తెలుగు' అనే పత్రిక ప్రారంభించి అందులో వ్యావహారికం గురించి అనేక వ్యాసాలు ప్రచురించారు. 1924లో ఆంధ్రసాహిత్య పరిషత్తు వ్యవహారికంమ్మీద వారికున్న పాత అభిప్రాయాన్ని మార్చుకున్నారు. 1936లో సాహిత్య పరిషత్తు 'ప్రతిభ' అనే పత్రికలోనూ, 1937లో తాపీ ధర్మారావుగారి సంపాదకత్వంలో వెలువడిన 'జనవాణి' అనే పత్రికలో వ్యావహారిక తెలుగులో వ్యాసాలు ప్రచురిస్తూ ఈ ఉద్యమాన్ని బలపర్చారు. శ్రీ జి వి రామ్మూర్తి పంతులుగారు ఆయన చివరి దశలో పత్రికా ప్రతినిధులతో మాట్లాడుతూ ఆయన ఎంతో సంతృప్తిని ప్రకటించారు. కాని విద్యాశాఖ మూర్ఖత్వానికి చాలా బాధపడ్డారు.

ఆ తర్వాత ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత అధికార భాషగా తెలుగును ప్రవేశపెట్టారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు తెలుగు భాషాకమిటీని నియమించారు. ఈ కమిటీ యీ క్రింది సూచనలు చేసింది.

రాష్ట్రంలో తెలుగు బోధన సంతృప్తికరంగా లేదని వ్యక్తంచేస్తూ కళాశాలల్లోను, విశ్వ విద్యాలయాల్లోనూ శిష్ట వ్యావహారికమే బోధించాలని సిఫార్సు చేసింది. సాంప్రదాయ భాషా శైలి విశ్వవిద్యాలయాల్లో అధ్యయనం చెయ్యాలని శిష్ట వ్యావహారికంలో రాసిన సాహిత్యం ఆధునిక సాహిత్యం అన్న శీర్షిక క్రింద ఉండాలని, శిష్ట వ్యావహారికంలో ఆవి పరీక్షలు జరగాలని సూచించారు. క్రమేపి 1973 నుండి శిష్ట వ్యావహారికం క్రింది విధంగా అమలుజరపమని సూచించారు.

## 9. తెలుగులో వ్యావహారికం ప్రవేశ పెట్టడం వల్ల లాభాలు :

శ్రీ యం డబ్ల్యు. యస్. డి. సిల్వాగారు 1976 లో చేసిన పరిశోధనల వల్ల కొన్ని విషయాలు వెలుగులోకి వచ్చాయి. ఆయన యీ పరిశోధనలో తెలుగు, కన్నడ, తమిళాలలో నేటి భాషా బోధనలో ఉన్న తారతమ్యాల పరిశీలన చేశారు తెలుగులో లాగానే తమిళంలో కూడా పాఠశాలల్లో రెండు శైలులు వాడే పరిస్థితి ఉంది. చెంతమిళ్ అని ప్రాచీన తమిళానికి చెందినరూప ఒకటి తమిళం. కాని తమిళ స్కూళ్ళలో యింకా పాఠ్య పుస్తకాలు ఎక్కువగా ప్రాచీన తమిళం లోనే ఉన్నాయట. తెలుగులో యీ పరిస్థితి కొంత మెరుగైంది. వ్యావహారికం స్కూళ్ళలోనూ, కళాశాలల్లోను, విశ్వవిద్యాలయాలలోను ఉపయోగించవచ్చునని కమిటీ రిపోర్టు ప్రకారం వ్యావహారిక భాష ఉపయోగించడం ప్రారంభించారు. అందువల్ల కొన్ని మంచి ఫలితాలు లభించాయని డి సిల్వాగారి వాదం.

ఇప్పటికీ మన విద్యా సంస్థల్లో బోధనలో పాఠ్య గ్రంథాలు చాలా ముఖ్యమైన పాత్ర వహిస్తాయి. పాఠ్య గ్రంథాల్లోనే పాఠాలు ఎలాగో ఒకలాగు కంఠస్థం చేసి కావలసిన మార్కులు సంపాదించడం ఆనవాయితీ. కాని విద్యార్థి సృజనాత్మకంగా ఆలోచించే అవకాశమే ఉండదు. తమిళనాడు, కర్ణాటక విశ్వ

లోనూ, పాఠ్య గ్రంథాలు యింకా ప్రాచీన తమిళ, కన్నడలలోనే ఉన్నాయి. కానీ క్రిందటి 13 సంవత్సరాల్లో మన స్కూళ్ళలో వ్యావహారికం బాగా ప్రవేశ పెట్టబడింది. దీనివల్ల యీ ఫలితాలు కలిగాయి. డి. సిల్వాగారు తనిఖీ చేసిన స్కూళ్ళలో భాషలో లోపాలు ఈవిధంగా ఉన్నాయి. 10 పేజీల స్వేచ్ఛగా రాసిన వ్యాసాలు యిందుకు ఆధారంగా తీసుకున్నారు

*తమిళం :*

- 79 తప్పులు (మొత్తం)
- 40 స్పెల్లింగు తప్పులు
- 6 ప్రత్యయాలలో తప్పులు
- 6 మాటలలో తప్పులు
- 6 మరికొన్ని వ్యాకరణ దోషాలు
- 12 వ్యావహారిక ప్రయోగాలు

*కన్నడ :*

- 156 తప్పులు (మొత్తం)
- 85 స్పెల్లింగులు
- 15 ప్రత్యయాలు
- 23 మాటలు
- 24 వ్యాకరణ
- 6 వ్యావహారిక ప్రయోగాలు

*హసింళం :*

- 197 తప్పులు (మొత్తం)
- 92 స్పెల్లింగులు
- 26 ప్రత్యయాలు
- 2 మాటలు
- 49 వ్యాకరణ దోషాలు
- 28 వ్యావహారిక ప్రయోగాలు

*తెలుగు :*

- 5 తప్పులు
- 1 స్పెల్లింగు
- 4 ప్రత్యయాలు
- — —
- — —
- — —


ఏప్రిల్ 26, 27 విశాఖలో జరిగే వాడుక భాషాసదస్సుకు

శు భా కాం క్ష ల తో

బుక్ సెంటర్

మెయిన్‌రోడ్డు :: విశాఖపట్నం

# "ముందు వెనుకల ఇరుప్రక్కల"

వాకాటి పాండురంగారావ్

వాడుక భాష అవసరమా అని అడిగే వాడీనాడు వుండ కూడని వాడు

వాడుక భాష 'ఈ లోపలికి రాకూడదు.' అని గిరులుగీచే లక్ష్మణ కుమారులు-'సముద్రపు అలలను ఆపుట', "సూర్యుని వెలుతురుకు ఆటంకములు ఏర్పాటు చేయుట' వంటి హాబీల నెన్నుకుంటే ఉభయ పక్షాలకూ బాగుంటుంది.

అయితే-

ఎలాటి వాడుక భాష వాడాలి?

దానికొక ప్రామాణికత నెలా సాధించటం?

'ఆ మురీల సంచీనిలా ఒగ్గేసి పోలేగుంటా..!'ని చిత్తూరు వారి కర్థమయ్యేలా చేయడం ఎలా?

'బాసన్లు తో ముదవంటేనల్లా బంద యిందగద—'ను విశాఖ గృహిణి కెలా చెప్పటం?

—ఇది ఒక స్థాయి సమస్య.

లోకులు అనగా పలుగాకులూ, పలు కోకిలలూ కూడాను. కోకిల పలుకుల నాదరించేలా కాకుల కూతల నాదరించగలమా? చిన్ననాటి ముద్దు మొద్దు మాటలు పెద్ద వాడయ్యాక బాగుంటాయా? భాష అనేది కాదు మనం మాట్లాడు కోవడానికి" రాసు కోవడానికి కూస కోవడానికి. మనకో 'ప్రజాస్వామ్యం' ఏడుసూంది కదా—అంచేత ఏ రాముడే సీత కోసం ఏ పార్టీ గుడిసె పీకాడో, ఏ రాజు ఏ రొయ్య కోసం ఏ గంపలోకిదూకాడో—(పరిపాలన అంటే ఇదే కదండీ—) 'పెజ' లు తెలుసుకోవాలంటే— 'పెజాబాస' అవసరమే కాని ఒక కొత్త విషయం చెప్పడానికి, ఒక కొత్త శాస్త్రాన్ని చెప్పడానికి, ఒక యుగపు సంస్కారానికి అద్దం పట్టి తర్వాతి తరాలకు అందించడానికి—వరి పోయేలా, ఎదిగేలా, చేయాలంటే నేటి సామాన్యుడి వాడుక భాషకు ఏ వ్యాకరణం టా ని క్కు లి వ్వాలి? ఏ 'ఇదిత'ల పట్టాల మీద ఈ వాడుక భాషా రైలు బండిని నడపాలి? లేక ఎన్నటికీ ఇది 'అబద్దం'గానే వుండి, పోతోందా?—ఇదొక, ఇంకొక స్థాయి సమస్య.

ప్రజలు నేలయితే భాష చెట్టు
నేల బలం కొద్దీ చెట్టుకు చేవ
చెట్టు విస్తరించిన కొద్దీ నేలకు నీడా,
నీరూను.

అయితే నూటికి నూరు మందీ ఒక విద్యా స్థాయి నందుకునేదాక, అక్షరాస్యుల లోని సాహిత్యకారులు, సంపాదకులు, భాషని పని ముట్టుగా నిరంతరం వాడే ఇతరులందరూ___ఈ 'నేటి నోటిమాటల' బండిని నడుపుకుంటూ వెళతారు వీళ్ళు క్రమంగా తమను, తమ భాషనూ, తమ స్థాయికి ఎదిగే వారిని పెంచుకుంటూ వెళ్ళాలి. ఒక క్రమ పద్ధతిలో వెళ్ళాలి. లేకపోతే ఈ బండి నడక కుంటు పడుతోంది. ఒక మంచి ఉద్దేశం అప్రయోజకత్వం సమాధిలో నిద్ర పోతోంది.

మరయితే _ ఈ వ్యవహారం మొత్తంలో గ్రాంథిక భాష(పుస్తకాలలో భాష)ను లేదా పాత భాషని ఏం చేయాలి? పూర్తిగా పాతేయాలా? తగలెట్టేయాలా? విడాకులిచ్చేయాలా?

అంత సులువుగా తేలే వ్యవహారం
కాదిది.

అన్ని కదలికలూ నాట్యం కాదు.
అన్ని కూజితాలూ రాగాలు కావు.
అన్నిచెక్కడాలూ శిల్పాలు కావు
అన్ని రంగుల గీతలూ చిత్రాలు
కావు.

కాస్త ఆలోచిస్తే
ఈ 'క్లాసిసిజం' అనేది ఆయా రంగాలలో ఏర్చి, ఒక పద్ధతిలో కూర్చిన, మేలి పోకడలు_అనిఅర్థం అవుతోంది. వాటిలో, వాటి కూర్పులో ఒక నియమం వుంది. ఒక క్లుప్తతవుంది. ఒక గాంభీర్యంవుంది. అలా నికరంగా కుదించినవే దేశాన్ని, కాలాన్ని కాదని నిలబడుతాయని చరిత్ర చెబుతూవుంది.ఆబద్ధతలో, ఆ'బుతం'లో నిలవ వుంచవలసినది వుంది; నేర్చుకో వలసినది వుంది; గర్వించ దగినది వుంది; గానం చేయ తగినది వుంది. ఆ గ్రాంధిక మైక్రోఫిల్మ్ మీది జ్ఞానాన్ని వాడుక మాటల పుటల మీదికి అనంతంగా విసరించుతూ కూచుందామా లేక అందులోకి వెళ్ళేందుకు ఆ దారి నలాగే వుంచి ఇటు ఈనాటి బాటలు కొత్తవి, మంచివి, అన్ని అయిడియాల బండ్లూ పరుగెత్తగలవి వేసుకుందామా?

___అని అడిగితే 'గోడ మీది పిల్లి' అన్న నింద రావడానికి ఎంతయినా అవకాశం వున్నది.

జర్మనీలో రష్యా, అమెరికాలున్నట్టే_
కమ్యూనిజంలో చైనా, రష్యాలున్నట్లే_
అమెరికాలో తెల్ల, నల్ల వారున్నట్లే_
ఇండియాలో ఇంగ్లీషు తెలుగు వున్నట్లే_

మన తెలుగులోనూ'అన్నిటికీ' Rule కింద వాడుక భాషా___

కొందొకచో, అవసరమయిన చోట్ల Exception క్రింద, పుస్తక భాషా___

ఉండాలి మరి.

మరొక డెబ్బయేళ్ళకు పరిస్థితి మారితే ఏదోఒక దాన్ని వదిలి వేయవచ్చునేమో. ఇవాళ్టి వాడుక భాషే రేపటి వారికి వచ్చి గ్రాంథికం అవుతోందేమో..., ఏమోమరి?

★

# మాతృభాషలో విద్యాబోధన

## అట్లూరు పురుషోత్తం





తెలుగును గ్రాంథిక భాషావాదం నుండి రక్షించటానికి ఎప్పుడో గిడుగు వారు వ్యావహారిక భాషోద్యమాన్ని ప్రారంభించారు. కాని ఈనాడు అసలు తెలుగులో మాట్లాడటమే న్యూనత అనీ, తెలుగు మీడియం పాఠశాలలలో తమపిల్లలను చదివించటమే తమ హోదాకు భంగమనీ చాలామంది తల్లిదండ్రులు భావిస్తున్నారు (ఈ పరిస్థితులలో, మాతృభాషలో విద్యాబోధనే శాస్త్రీయం, ప్రయోజనకరం, అని ఇంతమంది విజ్ఞుల, విద్యావేత్తల సమక్షంలో చెప్పే అవకాశం నాకు యిచ్చిన యీ వ్యావహారిక భాషాసదస్సు నిర్వాహకులకు నా కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.)

పిల్లలు పాఠశాలలకు వెళ్ళకముందే తమ తల్లిదండ్రులనుండి నేర్చుకొనే భాష ఆయా పిల్లల మాతృభాష. సాధారణంగా ప్రాంతీయ భాషలు ఆయా ప్రాంతపు ప్రజల మాతృభాషలు అయి వుంటాయి. ఉదాహరణకు, తెలుగు ఆంధ్రప్రదేశ్ యొక్క ప్రాంతీయ భాషయేగాక, యీ రాష్ట్ర పౌరులలో అత్యధిక సంఖ్యాకుల మాతృభాష. కాగా యీ చర్చకు సంబంధించినంతవరకు, మాతృభాషలో విద్యాబోధన అంటే ప్రాంతీయ భాషలో విద్యాబోధన అనుకోవాలి. ఇదే సందర్భంలో అల్పసంఖ్యాక భాషావర్గాల విద్యను గురించి చెప్పవలసివచ్చినప్పుడు, వారి పాఠశాల విద్య, వారి మాతృభాషలలో వుండాలని, వారి కళాశాల, స్నాతకోన్నత విద్య, ప్రాంతీయ భాషలో వుండాలని చెప్పక తప్పదు.

మాతృభాషలో విద్యాబోధన అనగా శిశు విద్యనుండి స్నాతకోత్తర విద్య వరకు మాతృభాషద్వారా లభించే విద్య. ఇది శాస్త్రీయమేగాక, మన అందరి బిడ్డలకు లాభదాయకమని చెప్పటమే యీ వ్యాస లక్ష్యం. ఇంతేకాని యీ చర్చలో ఆదేశాలకు, భాషా దురభిమానానికి, తావులేదు. ఏదో ఆదర్శంకొరకు ఎవరినీ ఏమీ త్యాగం చేయమని నేను కోరబోవటంలేదు.

విద్యకు పునాది ప్రాథమిక విద్య. ఈ పునాదిని మాతృభాష ద్వారా నిర్మించినప్పుడే ఇది బలంగా వుంటుంది. ఇందువలనగాని, పరిస్థితుల ప్రాబల్యం వలనగాని, మన పాఠశాలలలో ఇప్పుడు

ఎక్కువగా మాతృభాషలలోనే విద్యా బోధన జరుగుతూంది.

అంతే కాకుండా, ఇప్పుడు చాలాచోట్ల మొదటి డిగ్రీ చదువు, కొన్ని చోట్ల స్నాతకోత్తర విద్య కూడ మాతృభాషలలోనే సాగుతూంది శిశు విద్యనుండి స్నాతకోత్తర విద్యవరకు అన్నిచోట్ల మాతృభాషల ద్వారా విద్యా బోధన జరగాలనే నినాదం వినిపిస్తూంది. ఈ నినాదం మన విద్యా విధానాన్ని రూపొందించితే, ఇంగ్లీషు ఇండియా నుండి పోతుందని కొందరి భయం. ఇది నిరాధారమైన భయమని నా మనసు.

## సైన్సుద్వారా భాషలను నేర్పటం అశాస్త్రీయం

నిజం చెప్పాలంటే, నేటి ఇంగ్లీషు మీడియం విద్యాలయాలలో జరిగే బోధనా విధానం, మన దేశంలో ఇంగ్లీషును ఎక్కువ కాలం బ్రతకనిస్తుందని అనుకోవటమే, ఒక భ్రమ.

ఇంగ్లీషును గాని మరొక అదనపు భాషనుగాని మన పిల్లలకు భాషలను నేర్పే పద్ధతులలో నేర్పాలిగాని, గణితము చరిత్ర శాస్త్రాదుల ద్వారా నేర్పబూనటం అశాస్త్రీయం, నిష్ప్రయోజనకరం ఒక భాషద్వారా ఒక సబ్జెక్టును బోధించటం సహజం. ఒక సబ్జెక్టుద్వారా ఒక భాషను బోధించటం అసహజం ఈ సత్యాన్ని కాదన్న వారికొక నమస్కారం.

మరొక బాధాకరమైన వాస్తవం ఉంది. అదేమనగా ఇంగ్లీషును స్పెషల్ పాఠాలద్వారా నేర్చుకున్నవారు, నేర్చుకుంటున్న వారు, నేర్పుతున్నామను కుంటున్నవారు దిగ్విజయంగా ఇంగ్లీషును ఇండియానుండి తరిమివేస్తున్నారు. వీరి దేశభక్తికి ఇంగ్లీషు స్థానంలో హిందీని ప్రవేశపెట్టజూస్తున్నవారు సంతోషిస్తారు. ఈ వాదన సరికాదని చెప్పటానికి, ఇంగ్లీషు ఉపాధ్యాయులకంటె, గణితము వగైరాలను బోధించే ఉపాధ్యాయులే తమ బోధనా చాతుర్యం ద్వారా ఎక్కువ ప్రామాణికమైన ఇంగ్లీషును బోధించ గలరని ఋజువు చేస్తామని ఎవరైనా ముందుకు వస్తే, వారి వాదనను మనం శ్రద్ధగా విందాం.

## ఉస్మానియా ప్రయోగం

మాతృభాషలో కళాశాల విద్యను ఏర్పాటు చేసిన ఉస్మానియా విశ్వవిద్యాలయం ఓడిపోయిందని యీసందర్భంలో కొందరు చెప్పవచ్చు. ఉస్మానియా ప్రయోగాన్ని ప్రోత్సహించిన కట్టమంచి వారు ఈ ఓటమికి కారణాన్ని సూచించారు అదేమనగా ఉర్దూ నిజాం ప్రభుత్వపు భాష. ఇది ఆ ప్రాంతపు ప్రజలలో అత్యధిక సంఖ్యాకుల భాషకాదు. (Essays And Address : C.R. Reddy)

## పాఠశాల, కళాశాల విద్యలకు ఒకే బోధనా భాష అవసరం

ఇప్పుడు మన పాఠశాలలలో సాధారణంగా మాతృ భాషలలోనే విద్యా బోధన జరుగుతూంది. కళాశాలలో మరొక భాషలో అధ్యయనం చేయాలంటే విద్యార్థులకు ఇబ్బంది. కాబట్టి దశలవారీగా కళాశాల, స్నాతకోత్తర విద్యలను మాతృ

భాషలలోనే బోధించాలి. ఇందుకు ఉద్దు వస్తున్న ఇంగ్లీషును కళాశాలలోను, ఇంగ్లీషు మీడియం పాఠశాలలలోను, బోధనా భాషా స్థానంనుండి తొలగించాలి. ఇది ఏవిధంగా సాధ్యమో తరువాత వివరిస్తాను.

పాఠశాల విద్య, కళాశాల విద్య ఒకే మీడియంలో వుండాలని ఎడ్యుకేషన్ కమిషన్ (1964-66) సూచించింది. కాబట్టి అక్షరాభ్యాసం నుండి స్నాతకోత్తర విద్య వరకు ఇంగ్లీషే బోధనా భాషగా వుండటం మంచిదని ఇంగ్లీషు మీడియం స్కూళ్ళపైన మోజుకలవారు వాదించవచ్చు. వీరు పలుకుబడి గల వ్యక్తులే గాని విద్యావేత్తలు గారని నా మనవి.

## పర భాషలో విద్యాబోధన యొక్క అనర్థకాలు

పరభాషలో విద్యాబోధన విద్యార్థుల ప్రశ్నించే శక్తిని చంపివేస్తుంది. వారి స్వతంత్ర ఆలోచనా శక్తిని పెంపొందనివ్వదు. ఇది తెలిసిన విషయం ద్వారా తెలియని విషయాన్ని తెలుసుకోవాలనే సహజ సూత్రానికి విరుద్ధం. తెలుగు పిల్లల ఇంగ్లీషు మీడియం విద్య ఒక అంధునికి లభించిన మరొక అంధుని చెయ్యివంటిది ఇది విద్యార్థులకు వారు సంపాదించవలసిన విజ్ఞానానికి మధ్య ఒక అగడ్త. వారి ఆలోచనా వేగానికి ఇదొక కళ్ళెం. ముఖ్యంగా ఇదే ఉపాధ్యాయులను, నిర్జీవమైన భావాలను నోట్సు రూపంలో డిక్టేట్ చేసే యంత్రాలుగా తయారు జేసింది. తత్ఫలితంగా మన ఉపాధ్యాయులు శాస్త్రీయంగా బోధించటమే దాదాపుగా మానివేశారు.

పరభాషలో విద్యాబోధన మన మాతృభాషలను, గణితమును, చివరకు ఇంగ్లీషును కూడ బలికోరింది. ఎనభై సంవత్సరాల నుండి శాస్త్రములలో మనకు లభించిన నోబెల్ బహుమతుల సంఖ్య హరగోవింద్ ఖొరానా మనవాడే ననుకుంటే 1½. గిరీశం మన ఇంగ్లీషు మాస్టారు. మరొకరు వ్రాసిన నోట్సును బట్టీవేయటం మన అధ్యయన విధానం. విషయం బోధపడనప్పుడు ప్రశ్నించడం మన ఆదర్శ క్రమశిక్షణా విధానానికి విరుద్ధం ఇవీ ఇంగ్లీషు మీడియం విద్య మనకు ప్రసాదించిన మార్గ దర్శక సూత్రాలు.

## పరీక్షా ఫలితాలు

ఇంగ్లీషు మీడియం పాఠశాలల పరీక్షా ఫలితాలు గొప్పగా వుంటాయని ఒక ప్రవాదం. ఇతర హంగులన్నీ గల, ఆంధ్ర ప్రభుత్వపు తెలుగు మీడియం రెసిడెన్షియల్ పాఠశాలల పరీక్షా ఫలితాలు ఇంకా గొప్పగానే వున్నాయ్. ఈ విషయం ఇంగ్లీషు మీడియం పాఠశాలల యాజమానులకు తెలిసినదే. వీరికి మరొక విషయాన్ని గుర్తు చేయాలని నా కోర్కె. అదేమనగా మనకు ఇంగ్లీషును నేర్పిన, నేర్పుచున్న మిషనరీలు, వారి మతాన్ని మన ప్రజలలో మన ప్రజల మాతృ భాషల ద్వారానే, ప్రచారము చేస్తున్నారనే చారిత్రిక సత్యం.

## దొరల ఇంగ్లీషు

ఇంగ్లీషు మీడియం పాఠశాలల విద్యార్థులు ఇంగ్లీషులో బ్రహ్మాండంగా మాట్లాడతారని ఒక వదంతి. ఇంగ్లీషు దొరల సరసన పనిచేసిన నావికులూ, సేవకులూ దొరల ఇంగ్లీషులో బ్రహ్మాండంగానే, మాట్లాడతారు. కాని యీ ఇంగ్లీషు ఇండియాను ఐక్యంగా వుంచలేదు. కాగా మన పిల్లలకు ప్రామాణికమైన ఇంగ్లీషును బోధించే ఏర్పాట్లు అవసరం. ఇందుకు ఇంగ్లీషు బోధనాభాష కావలసిన అవసరం లేనే లేదు

## ఇంగ్లీషు - ఆధునిక విజ్ఞానం

ఇంగ్లీషు బోధనాభాష కాన ప్పుడు ఇంగ్లీషులో వున్న ఆధునిక విజ్ఞానం మనకు దూరమౌతుందని ఒక వాదం. ఈ వాదనను చేసేవారు ఒకసారి పశ్చిమ యూరప్‌కు, రష్యాకు, జపాన్‌కు, వెళ్ళి రావటం అవసరం

పరిశోధనా దశలో పర భాషలు అవసరమని మరొక వాదం. నిజమే. అవసరమైన వారు ఏ పర భాషనైనా ఒక సంవత్సరంలో నేర్చుకోవచ్చు ఇట్టివారు విద్యార్థులలో నూటికి ఏ ఒకరో కాగా, నూటికి నూరుమందిని పరభాష ద్వారా చదివించి, వారిని వైజ్ఞానికంగా రెండవ తరగతి పౌరులుగా తయారు జేయటం అన్యాయం, అనర్థ దాయకం.

## సాంకేతిక పదజాలం

మన మాతృభాషల సాంకేతిక పదజాలం పరిమితమైనదనీ, మన ప్రాంతీయ భాషలలో శాస్త్ర గ్రంథాలను వ్రాయటం కష్టతరమైన పని అనీ, తెలుగు అకాడమీ అనువాదాలు వాటి మాతృకలకంటె జటిలంగా వున్నాయని ఒక విమర్శ. ఈ విమర్శలో కొంత నిజం వున్నది. కాని అంతర్జాతీయ సాంకేతిక పదాలను యథాతథంగా ఆమోదించితే సాంకేతిక పదజాలం ఒక సమస్యగా మిగలదు. అనువాద కృషికి మెరుగు దిద్దటం అసాధ్యం కాదు. పట్టుదలవుంటే మాతృభాషలలో శాస్త్ర గ్రంథ రచన అసాధ్యంకాదు. 1979 లో ఒక తమిళ విద్యార్థి మద్రాస్ విశ్వ విద్యాలయపు పి. హెచ్. డి. డిగ్రీ కొరకు [రసాయన శాస్త్రంలో] ఇంగ్లీషు, తమిళ భాషలలో ఒక అంశమును గురించి రెండు పరిశోధనా వ్యాసాలను సమర్పించినట్లు వార్త. మాతృభాషలో శాస్త్ర పరనం సాధ్యమని ఎప్పుడో కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు ఉద్ఘాటించారు. ఐతే మనభాషలలో సాంకేతిక పదాలను సృష్టించాలనే తహతహ మనకు వుండ కూడదు. తెలుగు అకాడమీ పాఠ్య గ్రంథాలలో దొర్లుతున్న కొరుకుడు పడని సాంకేతిక పదజాలం ఢిల్లీ నుండి దిగుమతి అయినదనే వదంతి ఒకటి వున్నది. ఈ పదజాలానికి, ఢిల్లీ నుండి వచ్చే ఆర్థిక సహాయానికి సంబంధం వున్నదని మరొక వదంతి. ఈ రెండూ పూర్తిగా వదంతులే, ప్రాంతీయ భాషలలో పాఠ్య గ్రంథ రచన సులభమౌతుంది. అప్పుడు విద్యార్థులు కళాశాల దశలో బోధనా భాషను మార్చవలెననే ఊహకూడ కల్గవలసిన అవసరం వుండదు.

అసలు మన మాతృభాషలు కళాశాల స్థాయిలో బోధనా భాషలుగా పనికిరావనే వాదం ఒకటుంది. ఈ వాదనను చేసే వారు ఇంగ్లీషు కూడ ఒకప్పుడు నీచమైన భాషగా పరిగణించబడినదనీ, దీనిని నమ్మ లేకనే ఫ్రాన్సిస్ బేకన్, హర్వే, న్యూటన్ మొదలగువారు తమ ఉద్గ్రంథాలను లాటిన్‌లో వ్రాశారని తెలుసుకోవాలి.

మాతృభాషలో పాఠశాల విద్య మన విద్యా ప్రమాణాలను దెబ్బ తీసిందని కొందరి వాదం. ఈ వాదం నిరాధార మైనది వాస్తవం ఏమంటే, ఇంగ్లీషు మీడియం విద్య శాస్త్రీయమైన విద్యా బోధనా పద్ధతులను నాశనం చేసింది. ఇంకా కొన్ని కారణాలు తోడు కాగా, బోధనా భాషతో నిమిత్తం లేకుండా, భారతదేశమంతటా విద్యా ప్రమాణాలు దెబ్బతిన్నాయి.

## సైనిక్ స్కూళ్ళు, పబ్లిక్ స్కూళ్ళు

కేంద్ర ప్రభుత్వపు ఉద్యోగుల పిల్లల కొరకు ఇంగ్లీషు, హిందీ మీడియంల విద్యాలయాలు, సైనిక్ స్కూళ్ల పేరున ఏర్పడ్డాయి. ఇంగ్లీషు మీడియం పబ్లిక్ స్కూళ్ళు ఎప్పటి నుండో వున్నాయ్. వీటి ఉనికిని ఊతగా దీసుకొని మన దేశంలో వేలాది డాడీ, మమ్మీ స్కూళ్లు, కుక్కగొడుగుల్లా అవతరించాయ్. తత్ఫలితంగా మనదేశంలో బాలబాలికలు రెండు వర్గాలుగా చీలిపోతున్నారు. ఒక వర్గం పరభాషలో విద్యాబోధనవలన కల్గు అనర్థాలకు గురి అవుతూంది. మరొక వర్గం ఇంగ్లీషు మీడియం విద్యను చాటుగా ప్రేమించే వారిచే నడపబడుచూ, అన్ని విధాలా నిర్లక్ష్యం చేయబడిన విద్యాలయాలు కాని విద్యాలయాలలో చదువుతూ, వైజ్ఞానికంగా కుంటుతూంది. ఈ దుస్థితి నుండి మన బాలలను రక్షించాలంటే, ఇంగ్లీషు మాతృభాషగా కలవారి కొరకు తప్ప మిగతావారి కొరకు ఇంగ్లీషు మీడియం విద్యపైన ప్రభుత్వం పైసా కూడ ఖర్చు చేయకూడదు. ప్రభుత్వ సహాయమును పొందుచున్న ఇంగ్లీషు మీడియం స్కూళ్ళ స్థానే మాతృభాషలో బోధనచేయు పాఠశాలలు ఏర్పడాలి. తమ ఉద్యోగుల కొరకు రాష్ట్ర ప్రభుత్వాలే, ఇండియాలో వున్న పెద్ద పట్టణాలలోను, సైనిక కేంద్రాలలోను తమ ప్రాంతీయ భాషలే బోధనా భాషలుగాగల విద్యాలయాలను స్థాపించి, నిర్వహించాలి. విద్యార్థుల సంఖ్య ననుసరించి, చిన్న పట్టణాలలో ప్రతి భారతీయ జాతీయ భాషకు చెందిన పిల్లలకు తమ భాషలో బోధించే సెక్షన్ కనీసం ఒకటైనా వున్న విద్యాలయాలను, కేంద్ర ప్రభుత్వం స్థాపించి, నిర్వహించాలి. అప్పుడే మన పిల్లలందరికీ ఒకేవిధమైన విద్య లభిస్తుంది.

ఈ సందర్భంలో ఒక హెచ్చరిక. గత శతాబ్దపు పూర్వార్ధంలో ఇంగ్లీషు విద్యా విధానమునకు వ్యతిరేకంగా ఒక పోరాటం జరిగింది. మన పండితులు సంస్కృతం, అరబిక్, పర్షియన్ భాషా సాహిత్యములను ఆ భాషలలో వున్న విజ్ఞానమును ప్రచారముచేయు సంస్థలను రక్షించటానికి పోరాడారు. ఇంగ్లీషు విద్యా విధానమును సమర్థించిన వారు మన ఛాందస ధర్మాలను ప్రచారం చేసే

విద్యాలయాలను విమర్శిస్తూ, నూతన శాస్త్ర విజ్ఞానాన్ని అందించే ఇంగ్లీషు విద్యా విధానం కావాలని పోరాడారు కాని భారత ప్రజల భాషా సాహిత్యాలను గురించి ఏ వర్గమూ పట్టించుకోలేదు. అప్పుడు ఇంగ్లీషు విద్యా విధానం గెలిచింది

ఇప్పుడు మన మాతృ భాషలకు అను కూలంగా ఒక పోరాటం జరుగుతూంది దీనిని ఇంగ్లీషు, హిందీల మధ్య పోరా టంగా గాని, ఇంగ్లీషు భాషకు వ్యతిరేక ఉద్యమంగాగాని మారనివ్వకూడదు. మన ఆశయాన్ని గురించి మనకు స్పష్టమైన అవగాహన ఉండాలి శిశు విద్య నుండి స్నాతకోత్తర విద్యవరకు మన మాతృ భాషలను బోధనా భాషలుగా చేయటమే మన ఆశయం. అంతేగాని మన ఆశయం ఇంగ్లీషును యీ దేశం నుండి తరిమి వేయటంకాదు. హిందీకి మన దేశంలో విద్యాలయాలన్నింటిలోను, నిన్నటి వరకు ఇంగ్లీషుకువున్న స్థానాన్ని కట్టబెట్టటమూ కాదు.

## మన తక్షణ కర్తవ్యం

మాతృభాషలో విద్యాబోధన ప్రయో జనకరము, శాస్త్రీయము అయినది ఈ ఆశయాన్ని సాధించటానికి మన విద్యా రంగాన్ని తక్షణం సంస్కరించాలి. కాని యీ సంస్కరణను కప్పునుండి గాక పునాదినుండి చేయాలి. కాబట్టి, ప్రభుత్వపు గ్రాంటులు ఏ రూపంలోను పొందని పాఠశాలలలో తప్ప, మరే పాఠశాల లోను పరభాషలో విద్యాబోధనను జరగ నివ్వకూడదు. ఇందుకు అవసరమైతే ఒక మహోద్యమాన్ని నడిపించాలి. మన రాష్ట్ర పరిపాలనలో అన్ని స్థాయిలలోను తెలుగు పరిపాలనా భాషగా వుండా లనటం, కనీసం జిల్లా కోర్టు స్థాయి వర కైనా రాష్ట్రమంతటా తెలుగు కోర్టు భాష కావాలనటం, యీ ఉద్యమానికి తోడ్పడటానికే. ఈ పరిమిత సంస్క రణలను పూర్తిచేసిన తరువాత,కళాశాల, స్నాతకోత్తర విద్యలను పూర్తిగా, దశలవారీగా, ఒక నిర్ణీతమైన గడువు లోపల మాతృ భాషలలో బోధించే ఏర్పాటుకొరకు పోరాడాలి.

ఈ కర్తవ్యాలను నెరవేర్చటం, ఉపాధ్యాయుల, తల్లిదండ్రుల, రాజకీయ వేత్తల కర్తవ్యం. చర్విత చర్వణం అయినప్పటికి,ఔరంగజేబు తనగురువుకు వ్రాసిన ఒక చారిత్రక ప్రసిద్ధమైన లేఖను గురించి ఒక్కముక్కను చెప్పి యీ వ్యాసాన్ని ముగిస్తా. పరభాషలో బోధిం చిన ఆ గురువు తన కొక ఉద్యోగం కావాలని ఔరంగజేబుకు ఒక దరఖాస్తును పంపి, ఆహ్వానము కొరకు బయట వేచి యున్న గురువును ఆహ్వానించలేదు సరి గదా, వచ్చిన త్రోవనే వెళ్ళమని ఆయనను ఒక లేఖ ద్వారా ఔరంగజేబు ఆదేశించాడు. ఈ లేఖను తెలుగువారికి అందించిన ఘనత కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారిది ఔరంగజేబు గురువుకు పట్టిన దుర్గతి మన ఉపాధ్యాయులకు పట్ట కుండుగాక!



# వాడుక భాషా ఉద్యమం

## డాక్టరు పురిపండా అప్పలస్వామి

పాఠ్యపుస్తకం గ్రాంథికం, పాఠం చెపుతున్నది వ్యావహారికం ఇది ఎవరికైనా చిత్రమే అనిపిస్తుంది అదే జరిగింది జె. ఏ. ఏట్సు తెలుగు పాఠశాలల్లో చదువు చూసినప్పుడు 1906 ప్రాంతంలో యేట్సు గంజాం, విశాఖ, గోదావరి జిల్లాల పాఠశాలాధికారి. "ఇదేమిటి?" అని విశాఖపట్నం ఏ.వి.యన్ కాలేజీ ప్రిన్సిపాల్ పి. టి. శ్రీనివాసయ్యంగారిని అడిగాడాయన. విజయనగరంలో గురజాడ వెంకట అప్పారావుగారినీ, పర్లాకిమిడిలో గిడుగు వెంకట రామూర్తి గారినీ అడగమన్నారు అయ్యంగారు. అదిగో అలాగ యేట్సుగారికి కలిగిన సందేహం మన వాడుకభాషా ఉద్యమానికి నాందీ అయింది.

అప్పటికే కొందరు వాడుకభాష ఆవశ్యకత గుర్తించారు. స్వామినేని ముద్దు నరసింహంగారు రాసిన "హితసూచని" 1862 లోనూ గురజాడ అప్పారావుగారి "కన్యాశుల్కం" లోనూ వెలువడ్డాయి.

అయితే 1910 లో గిడుగు రామమూర్తిగారు రంగంలో అడుగు పెట్టాకనే వాడుకభాషా ఉద్యమం ఆరంభమయింది.

గిడుగు, గురజాడ, ఏట్సు, శ్రీనివాస అయ్యంగారు – ఈ నలుగురూ ఉద్యమానికి మూలపురుషులు.

గిడుగు, గురజాడలు మద్రాసు విశ్వవిద్యాలయం సెనెటు సభ్యులుగావుండి, వాడుకభాషలో పాఠ్య గ్రంథాలు వుండాలనీ, విద్యార్థుల సమాధానాలు వాడుక భాషలో రాయాలనీ తీర్మానం పెట్టారు.

విజయనగరంలో "ఆంధ్ర సారస్వత సంఘం" వాడుక భాషలోనే పాఠ్య గ్రంథాలు వుండాలనీ, వాడుక భాషలోనే పఠన పాఠనాలు జరగాలనీ తీర్మానించింది.

వాడుక భాషలో పాఠ్య పుస్తకాలు రాయడంకోసం ప్రయత్నాలు జరిగాయి. సెట్టి లక్ష్మీనరసింహంగారు సగం సగం వాడుక భాషలో "గ్రీష్మరాట కథలు" రాశారు అది స్కూలుఫైనల్ పరీక్షకి ఉపవాచకమయింది. దాని పీఠికలో శ్రీనివాస అయ్యంగారు గ్రాంథికభాష మృతభాష అనీ, వాడుకభాష జీవద్భాష అనీ నిరూపించారు. బుర్రా శేషగిరిరావు

గారు వాడుక భాషని సమర్థించి ఉపన్యాసాలు చేశారు ఇవన్నీ ఒక ఎత్తుగానూ, గిడుగు రామమూర్తిగారు ఉపాధ్యాయుల వార్షిక సభల్లో కృతకమైన గ్రాంథికభాష నిరుపయోగం నిరూపిస్తూ చేసిన మహోపన్యాసాలు ఒక ఎత్తుగానూ వాడుక భాషా ఉద్యమానికి బలం చేకూర్చాయి.

ఇదంతా గ్రాంథిక వాదులైన ఛాందస పండితులకు గంగవెర్రులెత్తించింది. వాడుకభాషమీద తిరుగుబాటు లేవదీశారు వారు వాడుకభాష గ్రామ్యమన్నారు. రామమూర్తిగారిని గ్రామ్యాచార్యులన్నారు గురజాడ గిడుగు, ఏట్సు, అయ్యంగారు – ఈ నలుగురినీ "దుష్టచతుష్టయం" అని దుయ్యబట్టారు.

ఈ తగువు తేల్చడంకోసం 1911 లో మద్రాసు విశ్వవిద్యాలయం ఒక సంఘం నియమించింది. అందులో తొమ్మండుగురు సభ్యులు నలుగురు వాడుకభాషా వాదులు, నలుగురు గ్రాంథిక వాదులు. ఒకరు తటస్థులు, ఆయనే అధ్యక్షులు. ఈ సంఘం వాడుకభాషకి అనుకూలంగా తీర్పు చెప్పింది.

"విద్యార్థులు వాడుకభాష గ్రాంథికం– ఈ రెంటిలో ఏదైనా తీసికోవచ్చు" అని విద్యాశాఖ ఆర్డరు వేసింది.

"కొంప మునిగింది" అనుకున్నారు గ్రాంథిక భక్తులు. "గ్రామపిశాచం" వొదిలించుకోవాలని వూరూరా సభలు చేశారు. వేలు వేలు సంతకాలు సేకరించారు. పలుకుబడి గల జమీందారులా, ధనవంతులా అండదండలు సంపాదించారు. భాషా తత్వజ్ఞులు కొక్కపోయినా, వారంతా మాతృభాష అయిన వాడుక భాషను నీచగ్రామ్యం అని విశ్వసించారు.

గ్రాంథిక భాషకి కంచుకోటగా "ఆంధ్రసాహిత్య పరిషత్తు" ఏర్పడింది. పిఠాపురం మహారాజా రావు సూర్యారావు గారు పరిషత్తుకి పరిఖగా నిలబడ్డారు. అన్నిటా సంస్కార ప్రియులైన ఆయన తెలుగుభాష విషయంలో పరమ ఛాందసులుగా ప్రత్యక్ష మయారు జీవద్భాష అయిన వాడుక భాషను రూపుమాపడానికే సాహసించారు. పరిషత్తు పదకుండో ఏటి సభలో ఆయన చెప్పిన ఈ కింది మాటలు వాడుక భాష అంటే ఆయనకున్న అక్కసుకి తార్కాణం.

"మన భాష యొక్క దురదృష్టవశమున గ్రామ్యవాామింకను బూరిగ నశించినదని నమ్ముటకు వీలులేదు కావున బరిషత్తు మిక్కిలి జాగరూకతతో నావిషయమై పరిశీలించుచు నాంధ్రభాష దగ్ధము కాకుండ గాపాడుచుండ వలయునని ప్రార్థించుచున్నాను"

గిడుగు వారి మాటల్లో చెప్పాలంటే– "గ్రాంథిక వాదులు అర్థంలేనిఆక్షేపణలూ కుట్రలూ, కుత్సితాలూ, అశక్తి దుర్జనత్వాలూ, అపప్రయోగాలూ" – ఎన్ని చెయ్యాలో అన్నీ చేశారు. దాని ఫలితంగా విశ్వవిద్యాలయంవారు వాడుక భాషకు అనుకూలంగా 1911 లో చేసిన నిర్ణయం 1914 లో రద్దు చేశారు అది మొదలు గ్రాంథికం విశ్వవిద్యాలయాల్లో తెలి ముసుగుతో తలదాచుకుంటూ వచ్చింది.

వాడుక భాష వ్యాపించకుండా చేయడం కోసం పరిషత్తు వారు సమగ్రమైన

నిఘంటువూ, వ్యాకరణమూ, బాలశిక్ష ప్రకటించాలని కంకణం కట్టుకుంది. వ్యాకరణమూ, బాలశిక్ష ఉత్తు త్తివే అయినా నిఘంటువు మాత్రం పిఠాపురం మహారాజాగారి సొమ్ముతో తయారయింది కనుకనే దానిపేరు శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు. గిడుగువారన్నట్టు ఈ నిఘంటువు "శబ్దరత్నాకరంమీద ఇంప్రూవుమెంటు తప్ప స్వతంత్రంకాదు సమగ్రం అంతకంటె కాదు. నిర్దుష్టం కానే కాదు "*

నిఘంటువు తొలి సంపుటం 1936లో బయటపడింది. దానిలోని అవకతవకలూ లెక్కా జమాలేని తప్పులూ ఎత్తి చూపుతూ 'ప్రతిభ' పత్రికలో 117 పుటల సుదీర్ఘమైన విమర్శ ప్రకటించారు గిడుగువారు "నిఘంటువు రాయడాని కెలాంటివారు పూనుకోవాలో వారి హృదయం ఎంత విశాలం కావాలో, సంకుచిత భావంతో పూనుకుంటే అది ఎలాగ నిరర్థకం అయిపోతుందో, జీవద్భాషను విడిచిపెట్టని ఎంత శవాలంకరణమో"* రుజావు చేశారు.

ఏమయితేనేం (సూ.ని.) 1944 నాటికి నాలుగు సంపుటాలు మహరాజా ధనంతోనూ, మిగిలినవి క్రమంగా 1974 నరికి ప్రభుత్వం సహాయంతోనూ బయటికి వచ్చాయి. చివరి సంపుటాలు వచ్చేసరికి మొదటి సంపుటాలు అందకుండా అయిపోయాయి.

డా. బెజవాడ గోపాలరెడ్డి గారి ప్రయత్నంతో రెండో ముద్రణ మొదటి నాలుగు సంపుటాలూ గతఏడు 'ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ పక్షాన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణగా వెలువడ్డాయి.

తొలి ముద్రణ మొదటి సంపుటానికి గిడుగు రామమూర్తి గారు 'ప్రతిభ'లో చేసిన అమూల్యమైన విమర్శగాని, ఆయన చూపిన తప్పులుగాని ఈ పునర్ముద్రణ పట్టించుకోలేదు రెండో కూర్పులో దోషాలూ, లోపాలూ లేకుండా గ్రంథము సవరించి పరిషత్తు వారు నిఘంటువు అచ్చువేయిస్తారని ఆశంసిస్తున్నాను "* అన్న ఆయన ఆశంసగాని తీర్చలేదు, సరికదా దారుణమైన మరికొన్ని దోషాలూ, లోపాలూ అలంకరించుకుంది.

విద్యార్థుల ప్రయోజనమే లక్ష్యంగా విశ్వవిద్యాలయాల్లో వాడుక భాషకు ప్రయోజనం కల్పించడం కోసం గిడుగు వారూ, వారి అనుయాయులు చేసిన ప్రయత్నాలు సాగనీయకుండా గ్రాంథిక వాదులు ఎప్పటికప్పుడు అడ్డు పెడుతూనే వచ్చారు. అంత మాత్రాన వాడుక భాషా వాదులు నిరుత్సాహ పడలేదు వారి సంఖ్య పెరుగుతూనే వచ్చింది మొదట విముఖులైన ప్రముఖులు క్రమక్రమంగా వాడుక భాషనే సమర్థిస్తూ వచ్చారు కందుకూరి వీరేశలింగం గారు రామమూర్తిగారితో చేతులుకలపడానికి అంగీకరించారు వాడుక భాష ప్రచారం కోసం 1919లో 'వర్తమాన భాషా ప్రవర్తక సమాజం' స్థాపించారు దానికి వీరేశలింగంగారే అధ్యక్షులు, గిడుగు రామ

* 'ప్రబుద్ధాంధ్ర' 10-12-1937. పు 344.

* 'ప్రబుద్ధాంధ్ర' 10.12,35

*శ్రీ సూ.ని. విమర్శ - 'ప్రతిభ'పు. 76

మూర్తి, జయంతి గంగన్నగార్లు కార్య దర్శులు. అయితేమరి మూడు నెలలలోనే వీరేశలింగంగారు కాలం చేయడంతో ఆ సమాజం ఆగిపోయింది.

1916 లో గురజాడ అస్తమించారు 1919 లో గిడుగు 'తెలుగు' పత్రిక స్థాపించారు. "ఆంధ్ర పండితభిషక్కుల భాషా భేషజము'. 'గద్య చింతామణి 'బాలకవి శరణ్యము' వంటి గొప్పగొప్ప రచనలు 'తెలుగు'లోనే ప్రకటించారు. ఆయన ప్రచారంవల్ల గొప్పగొప్ప రచయితలూ, గొప్పగొప్ప గ్రంథాలూ వాడుక భాషలో వచ్చాయి. దేశం నలుమూలలా వాడుక భాష రచయితలు అవతరించారు 1925 నాటికి వాడుక భాషలో రాస్తున్న వారి పేర్లు గిడుగు వారు రాయించారు

పర్లాకిమిడి ఒడిశాలో కలిపిన కారణంగా గిడుగువారు ఆ వూరు విడిచి తెలుగు గడ్డ మీదికి వచ్చేశారు. కొన్నాళ్ళకి ఆయన కాలేయంలో గుల్మ పుట్టింది. కాలం చేయడానికి ముందు 1940 లో ఇలా తమ 'కట్టకడపటి విన్నపం' మద్రాసులో వినిపించారు.

"వాడుక భాషా ప్రయోజనం ఆంధ్ర విశ్వవిద్యాలయము వారు అంగీకరించి ఆచరణలో పెట్టిన దాకా నేను పూర్తిగా కృతకృత్యుణ్ణయినానని సంతోషించలేను "

ఆదరిమిలా ఆం. ప్ర ప్రభుత్వం పాఠ్య పుస్తకాలు జాతీయం. చేసింది. అవి గ్రాంధికంలోనో, సరళ గ్రాంథికంలోనో, అర్థ గ్రాంథికంలోనో వుండాలన్నారు కొందరు. కాదు వాడుక భాషలోనే వుండాలని డా॥ భద్రిరాజు కృష్ణమూర్తి ప్రభృతులు పట్టుపట్టారు ఇది తేల్చడం కోసం ప్రభుత్వం 1965 లో తిరపతిలో ఒక పండితసభ జరిపింది. తీవ్రమైన చర్చల అనంతరం, విషయ ప్రధానమైన పాఠ్య పుస్తకాలూ, రెండో భాష పుస్తకాలూ వాడుక భాషలోనే వుండాలనీ, మొదటి భాష వాచకాలు సరళ గ్రాంధికంలో వుండాలనీ ఆ సభ (సూత్రప్రాయంగా) తీర్మానించింది

దానిని ఆచరణలో పెట్టడం కోసం ప్రభుత్వం శైలీ సంఘం నియమించింది.

1966 లో ప్రభుత్వం తెలుగు అధికార భాషగా గుర్తించి, చట్టం చేసింది. విద్యాశాఖ కార్యదర్శి గ్విన్‌గారి అధ్యక్షతను మరో సంఘమూ నియమించింది. ఆ సంఘం సూచించిన ప్రకారం మరో సంఘం ఏర్పడి, పాఠ్య గ్రంథాలు మొదలైన వాటిలో వాడుక భాషే వాడాలని తీర్మానించింది. అది అమలు జరపడం కోసం 1969 లో ప్రభుత్వం 'తెలుగు అకాడమి' స్థాపించింది

ఈ అకాడమి తెలుగు పాఠ్య గ్రంథాలు రాయిస్తున్నప్పుడు కూడా అడుగడుగునా గ్రాంథికవాదులు అడ్డంకులు వేస్తూనే వచ్చారు. అయినా చిన్న చిన్న మార్పులతో అకాడమి వాడుక భాషలోనే పాఠ్య పుస్తకాలు రాయిస్తున్నది

1969 లో తిరపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం పరిశోధన వ్యాసాలు వాడుక భాషలో రాయడానికి అంగీకరించింది.

11-1-1971 తేదీని ఆంధ్ర విశ్వ విద్యాలయం అకడమిక్ కౌన్సిల్‌లో పురిపండా అప్పలస్వామి ఈ కింది తీర్మానాలు ప్రవేశపెట్టారు.

తీర్మానం. ఆంధ్ర విశ్వ విద్యాలయంలో తెలుగులో పి. హెచ్. డి. కి సమర్పించే పరిశోధన వ్యాసాలు వ్యావహారిక భాషలో కూడా రాయవచ్చును

కారణాలు : వ్యావహారిక భాషలో శాస్త్ర విషయాలపై ప్రామాణిక రచనలు విరివిగా జరుగుతున్నాయి. శాస్త్రీయ భావ ప్రకటనకి వ్యావహారిక భాష సర్వ సమర్థమని రుజువయింది

తీర్మానం ఆంధ్ర విశ్వ విద్యాలయంలో అన్ని స్థాయిలలోనూ తెలుగు పరీక్ష పత్రాలకు సమాధానాలు వ్యావహారిక భాషలో రాయవచ్చును. అన్ని తరగతులకు పాఠ్య పుస్తకాలుగా వ్యావహారిక భాషలో వున్న గ్రంథాలు కూడా నిర్ణయించవచ్చును.

కారణాలు : నేడు వ్యావహారిక భాష దేశమంతటా ప్రచారములో వున్నది. పత్రికలు, రేడియోలు, సినిమాలు వ్యావహారికమే వాడుతున్నాయి. పండితులు సహా అందరూ వ్యావహారికంలో రాస్తున్నారు. ఉత్తమ సృజనాత్మక రచనలూ, సాహిత్య విమర్శలూ, ప్రామాణిక శాస్త్రగ్రంథాలూ వ్యావహారికంలో వస్తున్నాయి. ప్రభుత్వ వ్యవహారాలన్నీ వ్యావహారికంలో జరుగుతున్నాయి."

ప్రొ. తూమాటి దోణప్పగారు తీర్మానాలు బలపరిచారు. గ్రాంథిక వాదులు తీవ్రంగా వ్యతిరేకించారు. వాడుకభాషలో రాస్తున్నవారు కూడా వ్యతిరేకించడం చిత్రమనిపించింది. తగినంత చర్చ జరిగిన తరవాత అప్పటి ఉపాధ్యక్షులు శ్రీ ఎల్. బుల్లయ్యగారు ఈ తీర్మానాలు కూలంకషంగా విచారించి నివేదిక సమర్పించవలసిందని రెండు పక్షాల పండితులతో ఒక 'భాషాసంఘం' నియమించారు. ఈ సంఘానికి శ్రీ ఎం. ఆర్. అప్పారావు అధ్యక్షులు. శ్రీ తూమాటి దోణప్ప కార్యదర్శి. శ్రీయుతులు అబ్బూరి రామకృష్ణరావు, ఖండవిల్లి లక్ష్మీరంజనం, భద్రిరాజు కృష్ణమూర్తి, జి. ఎన్. రెడ్డి, కె వి ఆర్. నరసింహం, పురిపండా అప్పలస్వామి, ఎన్. వి ఆర్ కృష్ణమాచార్యులు, పి ఎస్. ఆర్. అప్పారావు, చేకూరి రామారావు సభ్యులు.

ఈ సంఘం వాల్తేరు, హైదరాబాద్, తిరుపతి మొదలైనచోట్ల సమావేశాలు జరిపింది. ఆయా విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షులతో సంప్రదించింది దేశం నలుమూలలా ప్రముఖులతోనూ, కవులతోనూ, పండితులతోనూ చర్చించి అభిప్రాయాలు సేకరించింది పరీక్షలలో బి. ఏ, ఎం ఏ. విద్యార్థులు రాసిన మూడేళ్ళ జవాబులు పరిశీలించింది. 1973 నాటికి 186 పుటల సమగ్రమైన నివేదిక సమర్పించింది.

"విద్యార్థులు పరీక్షా పత్రాల సమాధానాలు వాడుక భాషలో మాత్రమే రాయవలెను" అని ఏకగ్రీవంగా సూచించింది.

28 మార్చి 1974న గుంటూరులో జరిగిన ఆంధ్రవిశ్వవిద్యాలయంఅకడమిక్ కౌన్సిల్ సభలో పై నివేదిక చర్చకి వచ్చింది. గ్రాంథిక భాషా వాదులకూ, వాడుక భాషా వాదులకూ మధ్య దాదాపు మూడు గంటల సేపు వాద వివాదాలు జరిగాయి. గ్రాంధిక వాదుల ఆగ్రహావేశాలకు అంతం లేకపోయింది. "వ్యావహారిక భాష మాత్రమే ఉపయోగించాలి" అన్న తీర్మానంలో "మాత్రమే" అన్న మాట విడిచి నివేదిక ఏకగ్రీవంగా ఆమోదించడం జరిగింది. రిపోర్టులోని సూచనలు అమలు జరపడానికి స్థాయి సంఘం నియమించడానికి నిశ్చయమైంది.

వాడుకభాషకి లభించిన చారిత్రాత్మకమైన ఈ విజయంతో గ్రాంధిక వాదులకు తేళ్ళు జెర్రులూ పాకాయి అడ్డంకులకు పెరటిదారులు వెదికారువారు

29-3-1975న వాల్తేరులో జరిగిన అకడమిక్ కౌన్సిల్ సభలో ఒకరు ఈ కింది తీర్మానం పెట్టి వాదన తిరగదోడారు:

తీర్మానం : బి. ఏ., బి. యస్ సి. బి. కామ్ తెనుగు ప్రశ్న పత్రములలోని ప్రశ్నలు సలక్షణమైన భాషలోనే నిబంధింపబడవలయును.

కారణాలు: విశ్వపరిషత్పండిత సభలో వ్యావహారికము గూడ నుపయోగించ వచ్చునను తీర్మానము అంగీకరింపఁబడినది. అనగా నైచ్ఛికముగా విద్యార్థులు వ్యావహారికమునుగాని సలక్షణ భాషను గాని వాడవచ్చును అందుచే ప్రశ్నలే వ్యావహారికాంధ్రమున నిబంధింపఁబడినచో, విద్యార్థులు తద్భాషనే వ్రాయవలయునని అపోహపడ టకు వీలున్నది. ఇది వాంఛనీయము కాదు.

ఈ తీర్మానమూ, దాని కారణాలూ తమ స్వభావం తాము చెప్పకండానే చెపుతున్నాయి. "వాడుక భాషలో కాని గ్రాంథికంలో కాని, జవాబులు రాయవచ్చును" అని ప్రశ్న పత్రాల్లో నోటు చేర్చాలి" అన్న సవరణతో విచిత్రమైన ఈ తీర్మానం నెగ్గించుకున్నారు వారు.

---


*With best compliments*



**SWAGAT TRADERS**

**VISAKHAPATNAM**

# ఆంధ్ర కళాపరిషత్తు కర్తవ్యం

## గిడుగువారికి గురుస్థానం ఇవ్వాలి

ఏ దేశానికైనా ఏ భాషకైనా వర్తిస్తుంది "నరుత్నమన్విష్యతి గృహ్యతే హితత్" అన్న కాళిదాసు వాక్యం రత్నం ఉందంటే వెతుక్కుంటూ వస్తారు ఆక్స్ఫర్డ్ వాళ్ళు రాధాకృష్ణగారినివెతుక్కుంటూ వచ్చారు. కలకత్తా విశ్వవిద్యాలయం వాళ్లు రవీంద్రనాధ్ ఠాగూర్‌గారిని, బెంగుళూరు వారు రామన్‌గారిని వెతుక్కుంటూ వెళ్ళారు. ఎందుకు?దేశంలోవ్యక్తిగతంగా ఉన్న మహా జ్ఞానాన్ని ప్రజా గతంగా చేయడానికి ఎవరైనా సంవత్సరాల తరబడిని ఒకమహా కృషిని చేశారంటే, ఆ కృషి ఫలితాన్ని కళా పరిషత్తుల వాళ్ళు సంగ్రహించాలి. వాళ్ళకా విషయంతో ప్రసక్తి ఏమాత్రం ఉన్నాను. దాన్ని విద్యార్థుల ద్వారా దేశానికీ లోకానికీ ఇవ్వాలి కదా।

ఆంధ్ర కళాపరిషత్తు వారికి తెలుగు భాషతో ప్రసక్తి ఉంది.ఆ తెలుగు భాషలో గిడుగు రామమూర్తి పంతులుగారు చేసిన కృషి ఎంత గొప్పదో లోకానికేతెలుసును దగ్గిర దగ్గిర ఇరవై అయిదు సంవత్సరాలు వారు ఏక దీక్షతో ఈ కృషి సాగించారు (సామాన్య మేధావంతులు ఒక నెల రోజులలో చేసే కృషిని వీరు ఒక్క రోజులో చేస్తారు అదీ వారి గుణవిశేషం.)అపూర్వమైనటువంటిన్నీ, అమోఘమైనటువంటిన్నీ అనేక సంగతులను వారు సంగ్రహించారు ఆరితేరిన ఉపాధ్యాయులు, సునిశిత బుద్ధులు. సంగ్రహించిన విషయాన్ని చక్కగా నేర్పడానికి ఏర్పాటు చేయగలవారు అట్టి మహాకృషి ఫలితాన్ని కలా పరిషత్తువారు ఇంతవరకూ ఉపయోగించుకోకుండా ఉండడం చాలా దుఃఖకారణం.ఇప్పుడు సంపూర్ణాంధ్రత్వం కల రామలింగారెడ్డిగారి ఆధిపత్యంలోనయినా ఈలాటి కొరతలు తీరుతాయని పుష్కలమైన ఆసతో నున్నాము వీరి యాజమాన్యములో ఆంధ్రభాషకి తగిన ప్రాపు దొరుకుతుందని ఉబలాటం. కలకత్తా వాళ్ళలాగే వీళ్ళున్నూ రామమూర్తిగారిని కళాపరిషత్తులోకి తీసుకోడానికి ప్రయత్నిస్తారని మా నమ్మకం. వారి వయసుని తెలిసినవాళ్ళకి ఈ పని చేయడంలో ఆలస్యానికి అవకాశం లేదని వేరే చెప్పనక్కరలేదు. ఈ జూలయిలో పరిషత్తుని తెరుస్తారు. ఆలోగా రామమూర్తిగారు తెలుగు పీఠాన్ని అధిష్ఠిస్తారు అన్న సంతోషవార్త ఆంధ్రులకు వినబడునని

మా విశ్వాసము. ఆంధ్ర కళాపరిషత్తు తన కర్తవ్యాన్ని చేసి ధన్యంకావాలి.

తాపీ ధర్మారావ్ బి. ఏ.
....న్షి నారాయణరావ్
యమ్. ఏ. ఎల్. ఎల్. బి.
... యన్. చౌదరి యమ్. ఏ,
శ్రీనివాస శిరోమణి.

10-5-1935 ఆదివారం
ప్రజామిత్ర

సంపాదకీయం

## గిడుగువారికి తెలుగు పీఠం

ఆంధ్రకళాపరిషత్తునందును, తెలుగు విద్యాపీఠమునందును, ఎక్కువ అభిమానముగల కొందరు ప్రముఖులు పంపిన "కళాపరిషత్తు కర్తవ్యం" అను లేఖను ఆంధ్రమహాజనులు ఆదరింతురని నమ్ముచున్నాము. పై సుభాన్పులరుగారును సినెటు, సిండికేటు సంస్థలును జనాభిప్రాయము నంగీకరింతురనియు, శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు త్వరలో విద్యాపీఠము నలంకరించి తమ భాషా సేవకు తగిన వినియోగలాభము నందగలుగుదురనియు విశ్వసించుచున్నాము.


Phone · 5073

**KALPANA NURSING HOME**

Dr. G. RAMAIAH CHETTY, B.A., M.S., D.O.
Professor of Ophthalmology (Rtd.)
Dr G. PREMA SAGAR, M.B., B.S., D.O.
Regd. No 9899

**14-1-44, Nowroji Road, Near Hotel Apsara, Visakhapatnam-2.**

*With best compliments*



**V. DHANA REDDY & CO.**

VISAKHAPATNAM

# కళారంగంలో వ్యావహారిక భాష

అబ్బూరి గోపాలకృష్ణ

వ్యావహారిక భాషకూ, లలిత కళలకూ చాలాకాలం నుంచే దగ్గిరి చుట్టరికం వుంది. లలిత కళగా కవిత్వాన్ని పరిగణించవచ్చునో లేదో తెలియదు గాని – మనకు – ముఖ్యంగా తెలుగువాళ్ళకు – వ్యావహారిక భాషను గురించిన వివాదం కవులూ పండితులూ ఇచ్చిన కానుకే

సంగీతం తీసుకుంటే వ్యావహారిక భాష వాడని వాగ్గేయకారుడే కనిపించడు గ్రాంధిక భాషలో కీర్తనలు రాసిన వాళ్ళెవరైనా వున్నారేమో కూడా నాకు తెలియదు – ఇంకొకరి కెవరికైనా తెలుసునని కూడా నాకు ఆశలేదు అన్నమయ్య దగ్గర్నుంచి త్యాగయ్య దాకా చక్కని నుడికారం, జీవం వున్న వ్యావహారిక భాషనే వినియోగించారు. బైరాగులు పాడే తత్వాల సంగతీ, జానపదగేయాల సంగతీ సరేసరి.

ఈనాడు ప్రచారంలోకి వచ్చిన లలిత సంగీతం కూడా వ్యావహారికభాషనే ఆశ్రయించి సాగుతోంది. సినిమాసంగీతం అంటే పాటల గురించి చెప్పనే అక్కర్లేదు. (అసలు సినిమా (ముఖ్యంగా మన రాష్ట్రంలో) ఒక కళగా గుర్తింపు పొందడం ఇంకా జరగలేదు కాబట్టి ఆ విషయంలో మనం అట్టే శ్రద్ధ కనపరచవలసిన అవసరంలేదు)

ఇంక మిగిలింది నాటకరంగం. మనకు నాటకరంగం మూడు శాఖలుగా విస్తరించి వుంది. ఒకటి. యక్షగానం లేదా వీధి నాటకం, తదితర జానపద కళారూపాలు. రెండు పౌరాణిక నాటకాలు, మూడు: సాంఘిక నాటకాలు.

ఇందులో యక్షగానాల(వీధినాటకాలలో) భాష చక్కని శైలీ, విన్యాసం వున్న వ్యావహారిక భాషే. కాకపోతే దరువులు వగైరాల్లో కొంచెం సంస్కృత సమాసాలతో నిండివుండడం వొకచో కనిపిస్తుంది, అయితే సన్నివేశాన్నిబట్టీ, పాత్రలను బట్టీ ఈ రచన కొనసాగడం వలనా, నాట్యానికి అనుకూలంగా ఉండడం కోసమూ ఈ పద్ధతి అనివార్యం. ఇక్కడ ఎవరికీ ఏ పేచీ వుండనవసరం లేదు.

అయితే రెండోశాఖ పౌరాణిక నాటకాలకు వచ్చేసరికి నానా ఖంగాళీగానూ కనిపిస్తుంది భాష దీనికి చారిత్రక కారణం లేకపోలేదు.

మనకు పౌరాణిక నాటకం మహారాష్ట్ర నాటక కంపెనీలనుంచి దిగుమతైన సరుకు. అసలు మహారాష్ట్రలో ప్రత్యేకమైన నాటక ప్రక్రియ మొదట్లో లేదు. సాంగ్లీసంస్థానానికి ఉత్తర కర్నాటక ప్రాంతాలనుంచి వొక యక్షగాన బృందం వొకసారి వెళ్ళి అక్కడ 'సీతా స్వయం

వరం'అనే యక్షగానాన్ని ప్రదర్శించింది. దాన్ని చూసి సమ్మోహితుడైన సాంగ్లీ సంస్థానాధిపతి తన దగ్గర పని చేస్తున్న విష్ణుపంత్ భావే అనే కీర్తనకారుణ్ణి అలాంటి రూపకాన్ని మరాఠీలో రాసి ప్రదర్శించమని కోరాడు. అనతి కాలంలోనే విష్ణుపంత్ భావే తన పోషకుడి ఆజ్ఞను శిరసావహించి ఒక్కొకిమక్కిగా రూపకాన్ని మరాఠీలోకి దించాడు. ఆ ప్రదర్శన సఫలం కావడంతో సాంగ్లీ రాజు సహాయంతో మరికొన్ని రూపకాలను తయారు చేసి దేశయాత్ర సాగించారు. విష్ణుపంత్ భావే మరణానంతరం అతని నాటక బృందం వ్యక్తిగత కలహాల వల్ల చీలిపోయి అనేక బృందాలైనాయి. వాటిలో ఒక బృందం 'అల్టేకర్ హిందూ డ్రమెటిక్ కంపెనీ' పేరుతో 1880 లో ఆంధ్రదేశాన్ని పర్యటించింది ఆ కంపెనీ బొంబాయి మొదలైన ప్రాంతాల్లోని క్షీణ దశలో వున్న ఆంగ్లేయ నాటక బృందాలను అనుకరించి భవనాలూ, ఉద్యానవనాలూ చిత్రించిన తెరలూ, గాస్‌లైట్లూ, హార్మోనియం మొదలైన పరికరాలను సమకూర్చుకుంది. ఒకవిధంగా చూస్తే ఇది యక్షగానానికి భ్రష్టరూపం. అయితే ఈ ప్రదర్శనలలో మరాఠీ జానపద సంగీతం ఒక స్థానాన్ని యేర్పరచుకునే వుంది.

తెలుగు నగరాలలో ఈ బృందం పర్యటనలో తెలుగు ప్రజలు తమకు భాష అర్థం కాకపోయినా కనక వర్షం కురిపించారు. చమ్కీకోట్లూ, సీన్లు మారడమూ, సంగీతమూ ఇవి వాళ్ళకి వింతగా కనిపించాయి. అయితే ఆనాటి పోషకులు తెలుగులో కూడా ఇలాంటి నాటకాలు కావాలని కోరి అలాంటి నాటకాలను రాయడానికి విద్యాసంస్థల్లోని తెలుగు పండితులను రంగంలోకి దింపారు. ఈ పండితులు కీర్తలను గాని, గీతాలనుగాని రాయగల సమర్థత లేని వాళ్ళు కావడంచేత నన్నయాదుల కావ్య భాషను సంభాషణలకూ, పాటలకు బదులు వృత్తాలనూ, సీస పద్యాలనూ రాశారు. పద్యాలను కొద్దో గొప్పో రాగ వరసన చదవడం ఆనాటికే వుంది కాబట్టి దానికి మరింతగా మెరుగులు దిద్ది జిలేబీ చుట్లుగా రాగాలాపాలను పెట్టి కొత్త రకంగా కృతకమైన కళారూపాన్ని అమల్లోకి తీసుకొచ్చారు ఇది పౌరాణిక నాటకంగా నేటికీ చలామణీ అవుతోంది. ఇందులో వ్యావహారిక భాషకు నిలువ నీడలేకుండా పోయింది. యక్షగానానికి సహజమైన చక్కని సంభాషణా శైలి సైతం ఈ పౌరాణిక నాటకంలో మృగ్యమైంది. ఇక్కడ మనం గమనించవలసిన విషయం మరొకటి కూడా వుంది. ఇతి వృత్తాలు అలౌకికమైనవి కావటంచేత శైలీకరణం (స్టైలైజేషన్) అవసరం అవుతుంది. ఐతే వీధి నాటకాల్లోనూ, హరికథల్లోనూ ఈ శైలీకరణం వ్యవహారికాన్ని విడవకుండానే సాగుతోందన్న విషయం ఆనాటి నాటక రచయితలు గుర్తించలేదు.

'కన్యాశుల్కాన్ని' రాసి గురజాడ వ్యావహారికాన్ని సుప్రతిష్ఠితం చేశాడు. అయిన ఈ శైలీకరణం వ్యావహారికంలో సాధించవచ్చునే విషయాన్ని నిరూపించ

దానికే బిల్హణీయం రచనను తలపెట్టడం మనకు తెలిసిన విషయమే. అయితే వ్యావహారిక భాషలో రాసినంత మాత్రాన నాటకం విజయవంతం కాదు అన్న సంగతిని తరవాతి తరం రచయితలు చేసిన రచనలే నిరూపించాయి. అందువల్లనే ఈనాటికీ పౌరాణిక నాటకాలకి టిక్కెట్లు కొనివచ్చే ప్రేక్షకులు సాంఘిక నాటకాలకు ఉచితంగా రమ్మన్నా రావటం లేదు. అయితే యిది రచయితల, నటుల లోపంగానే వ్యావహారిక భాషవల్ల కలిగిన నష్టం కాదు.

అయినా ఈ విషయాలన్నీ చెప్పి ఇంకా వ్యావహారిక భాషా వాదాన్ని సమర్థించుకోవలసిన దౌర్భాగ్యపు స్థితిలో మనం వున్నాం అంటే అది మన తప్పు కాదు. మరెవరిది అన్న విషయం పాఠకుల ఊహకే వదిలేస్తున్నాను. చిత్రలేఖనం గురించి మనకి విమర్శా రూపకమయిన సాహిత్యం ఇటీవలే వస్తోంది. కీ॥శే॥ షుకు తలిశెట్టి రామారావు గారు రాసిన 'భారతీయ చిత్రలేఖనం' అన్న ఒక్క గ్రంథమే గ్రాంధిక భాషలో వెలువడింది. ఇటీవలి కాలంలో భారత కళా పరిషత్ పక్షాన, శ్రీ చలసాని ప్రసాదరావు సంపాదకత్వాన వెలువడుతున్న 'కళ' పత్రిక వ్యావహారిక భాషలో చిత్ర శిల్పకళలను గురించి చక్కని సమీక్షా సంప్రదాయాన్ని నెలకొల్పింది. సంగీతం, నృత్యం విషయాల్లో ఇంకా ఇంతటి ఉన్నత ప్రమాణాల్లో కృషి జరగక పోవడం ఆశ్చర్యకరమే.

లోపభూయిష్టమైన మన విద్యా విధానం మారనంత కాలం, ప్రాథమిక పాఠశాలల నుంచి యూనివర్సిటీ కళాశాలల వరకు వ్యావహారిక భాషకు ప్రముఖ స్థానం లభించనంత కాలం మనం ఈ దుస్థితిలో వుండవలసిందే.

ఇంకెంత కాలం మనం ఈ పరిస్థితిని సహిస్తూ వుండాలి అన్న విషయం అందరూ ఆలోచించాలని ప్రార్థన.

మన విద్యాలయాల్లో, లలిత కళల కళాశాలల్లో ఉన్న వివిధ రకాల కోర్సుల్లో వ్యావహారిక భాషలో రాసిన సృజనాత్మక సాహిత్యాన్ని విధిగా పఠించాలనే నియమం యేర్పడితే — ఆయా రంగాల్లోని విజ్ఞాన విశేషాలను వ్యావహారికాంధ్రంలో అందించే విద్యావంతులైన యువకులు మనకు సమకూరడం జరుగుతుంది. అంత వరకూ మోక్షం లేదనే నా అభిప్రాయం.



# తెలుగులో విజ్ఞానశాస్త్ర రచనలు

జమ్మి కోనేటిరావు

భాష సజీవమయినది ఏ భాష అభివృద్ధి చెందాలన్నా సమానాంతరంగా శాస్త్ర విజ్ఞానమూ అభివృద్ధికావాలి. ఆ అభివృద్ధి ప్రభావం దానిమీద పడి భాష కూడా కొత్త అందాలతో, భావాలతో పరిపుష్ఠమవుతుంది. అదేవిధంగా శాస్త్ర విజ్ఞాన అభివృద్ధికి భాష అభివృద్ధి కావాలి భావప్రవాహానికి భాష ఉపయోగపడి క్రమపద్ధతిలో ఏ శాస్త్ర విజ్ఞానమయినా విస్తృతమవుతుంది నూతన విషయాన్ని దేన్నయినా వలుగురికీ విశదపరచాలంటే భాషా సౌకర్యం కావాలి ఈ విధంగా భాష విజ్ఞానం చేదోడు వాదోడుగా అభివృద్ధి చెందాలికాని ఏఒకటి ఒంటరిగా అభివృద్ధి సాధించలేదు.

భారతీయ భాషల్లోనూ, భారత దేశంలో శాస్త్రీయ విజ్ఞాన అభివృద్ధిలోనూ ఇటీవలివరకు – కొంతవరకూ ఇప్పటికీ కూడా – ఈ రెండు లోపాలూ ఉన్నాయి. భాషలు శాస్త్రపరంగా అభివృద్ధిని తగినంతగా సాధించడంలేదు. అభివృద్ధి చెందిన దేశాలతో పోల్చి చూస్తే, శాస్త్ర పరిశోధనలు మన దేశంలో తగినంతగా ముందుకు పోవడంలేదు ఏ మాత్రం అభివృద్ధి చెందినా అవి మన భాషలమీద ప్రభావం చూపడంలేదు. కారణం ఆంగ్లభాషా సౌకర్యం అందుబాటులో ఉండడం, ఆ ప్రభావం ఆంగ్ల భాషకే పరిమితం కావడం. మహా వృక్షం నీడలో ఉన్న అల్ప వృక్షాల పరిస్థితి.

ఒక విధంగా చెప్పాలంటే భారతీయ భాషలు ఈ అవకాశాన్ని ఎప్పుడో కోల్పోయాయి. ఇంగ్లీషు సామెత Missing the bus వీటికి బాగా అన్వయిస్తుంది కనీసం 50,60 ఏళ్ళనుంచి అయినా బోధనాభాషగా తెలుగు ఉండి ఉంటే, పరిస్థితి ఇంత అధ్వాన్న స్థితిలో ఉండేదికాదు ఇప్పుడు ఇంత ఆలస్యంగా మనం మొదలుపెట్టాం.

అయినా పరిస్థితి చెయ్యి దాటిపోలేదు ఇప్పటికయినా ప్రజలూ (చదువరులూ), పత్రికలూ (ప్రచురణ కర్తలూ) రచయితలూ (శాస్త్రజ్ఞులూ) తోడ్పాటుతో ఇది అధిగమించ వచ్చు. ఇందులో ఏ ఒక్కరి సహకారం లేకపోయినా కార్య సాధన లోపిస్తుంది. చదువరులు కేవలం ఉబుసుపోకకి కథానికలు, నవలలు మీద మాత్రమే దృష్టిని కేంద్రీకరించకుండా, విజ్ఞాన శాస్త్రవిషయాలు తెలుసుకోవడంలో ఉత్సుకత చూపించాలి. ఇక శాస్త్రజ్ఞులు, తత్సంబంధ రచయితలు కుతూహలాన్ని రేకెత్తించే

విధంగా అన్ని శాస్త్ర రంగాలమీదా విరి విగా రచనలు సాగించాలి. అయితే ఇందు లో ఒక ప్రమాదం నివారించుకోవాలి. తెలిసీ తెలియని అంటే మిడిమిడి జ్ఞానం తో (Half knowledge is dangerous!) రాయగలమూ అనే ధీమాతో, శాస్త్రీయ రచనలు రాయడం సమంజసం, సబబూ కాదు. ఇటీవలి రచనల్లో ఇలాటి పొరపాట్లు అనేకం జరుగుతున్నాయి. విషయపరిజ్ఞానం మీద తగినంత అధికారం సంపాదించాకనే రచనలు జరపాలి. అది కనీసధర్మం ఇక మూడవది ప్రచురణలు. దీనికి ప్రచురణ కర్తలు, పత్రికా సంపాదకులు తగినంత ప్రోత్సాహం ఇవ్వాలి. ఇది ఇప్పుడు ముఖ్యంగా మన తెలుగు భాషలో జరగడంలేదు. మొత్తం మీద మన వెనుకంజకి పై ముగ్గురిలోనూ, ఏ ఒక్కరి మీద నింద వేయరాదనే నా అభిప్రాయం. రచయితలు మెదడు అయితే, ప్రచురణ కర్తలు గుండెవంటి వారు. (వారికే గుండెధైర్యం కావాలి కూడా!) వీరిద్దరూ అందించే విజ్ఞానాన్ని రక్త ప్రసరణద్వారా మాదిరిగా అన్నట్లు శరీరంలోని అన్ని కణాలూ (పాఠకులు) దీనిని స్వీకరించాలి.

భారతీయ భాషలు అన్నీ అంతో ఇంతో ఈ ఇబ్బందికి గురి అయినా దురదృష్ట విషయం ఏమంటే మన తెలుగు భాషకి మరింతగా వర్తిస్తుంది. మళయాళం, కన్నడం, తమిళం వంటి భాషలు కొంతవరకు ముందంజగానే ఉన్నాయి. పాఠ్యగ్రంథాల విషయంగా డిగ్రీస్థాయి వరకు తెలుగు అకాడమీవారు పుస్తకాలు ప్రచురించారు. ఇది పోస్ట్ గ్రాడ్యుయేట్ స్థాయి వరకు ప్రచురించాలని ప్రయత్నాలు జరుపుతున్నారు. కాని ఈ ప్రయోగం కూడా పూర్తిగా నిలద్రొక్కుకోలేదు. కొంత వరకు విద్యార్థుల్లో ఆదరణ లభించినా, ఏ పరిస్థితుల్లో మళ్ళీ వెనకంజ పడిపోతుందో అనే భయం ఉండనే ఉంది. కారణం ఏమంటే ఆంగ్ల మాధ్యమ విద్యార్థులకు, పై చదువుల్లో అయితేనేమి, ఉద్యోగాల్లో అయితేనేమి అధిక అవకాశాలు ఉండడమే. ఈ పరిస్థితిని నివారించుకో గలాలి.

తెలుగులో జనప్రియ విజ్ఞానసాహిత్యం 1915లోనే ఆరంభమయింది కీ.శే కొమర్రాజు లక్ష్మణరావుగారు "ఆంధ్ర విజ్ఞాన సర్వస్వా"న్ని ఆరంభించారు ఆనాటి భారతీయ భాషల్లో ఇంత పెద్దయెత్తు ప్రయత్నం ఇదే మొదటేమో 1917లో వారి మరణంతో ఆగిపోయిన ఈ కార్యక్రమం, కీ శే. కాశీనాధుని నాగేశ్వర రావుగారు పునఃప్రారంభించారు. 1938 లో వారి మరణంతో ఈ ప్రయత్నం అక్కడితో ఆగిపోయింది.

సుమారు అదే కాలంలో శ్రీ కాశీపట్నం కొండయ్యగారు "విశ్వరూపం" అనే గ్రంథం రచించారు ఆ తరువాత సర్వశ్రీ గొబ్బూరు వెంకటానందరాఘవ రావుగారు, వసంతరావు వెంకటరావుగారు, విస్సా అప్పారావుగారు, వేమరాజు భాను మూర్తి గారు, శ్రీపాద గోపాల కృష్ణ మూర్తి గారు, ఎ. వి. ఎస్. రామారావు, మహీధర నళినీ మోహనరావు వంటివారు ఈ రచనలు సాగించారు. విజ్ఞానం ఒక మహా ఖని. ఇంకా అది అమిత వేగంతో అభివృద్ధి చెందుతోంది. అలాటి పరిస్థితుల్లో ఇలాటి ప్రయత్నాలు ఏపాటి.

మనకి కనీసం వెంటనే ఒకటి రెండయినా కేవలం శాస్త్రీయ పత్రికలు కావాలి. దురదృష్టం ఏమంటే ఇలాటి ప్రయత్నా

లు అన్ని హంగుల తోటి, అనుభవం తోటి స్తోమతు తోటి జరగడం, విఫలమవడం జరిగింది. విజ్ఞానవాహిని, విజ్ఞాన ప్రగతివంటి ఏ తెలుగు భాషాసమితివారు ప్రచురించినా అవి త్వరలోనే ఆగిపోయాయి, అమెరికా ఆంధ్రులు "తెలుగు భాషాపత్రిక"ను నడుపుతున్నారు. అది ఇప్పటికే వుంది అని అనుకొంటా. తెలుగు అకాడమీ వారు నడుపుతున్న "తెలుగు" త్రైమాసిక పత్రిక ఒకటి చెప్పుకోతగ్గది. కాని దానికి తగినంత ఆదరణ లేదు. వారు కూడా నష్టం భరిస్తూనే నడుపుతున్నారు. ప్రభుత్వం ఇలాటి పత్రికలను నిర్బంధంగా కళాశాలలు పాఠశాలలు, గ్రంథాలయాలు కొనాలని నిర్దేశించాలి.

పత్రికలు, విజ్ఞాన రచనలను ప్రోత్సహించి, అవసరమయితే, ప్రఖ్యాత ఆంధ్ర శాస్త్రవేత్తలను అన్ని రంగాల నుంచి ఆహ్వానించి రచనలు జరిపించాలి మొదట్లో ఇలా జరిపితే తరువాత పరిస్థితి ఆరోగ్యవంతంగా ఉంటుంది అంటే బలవంతాన రాయించడం, కొనిపించడం (చదివించడం!) ఉండదు ఆదరణ దానంతట అదే బాగా అభ్యాసమవుతుంది. దిన వార మాసపత్రికలు కొంత స్థలాన్ని వీటికి కేటాయించాలి

తెలుగు భాషా సమితివారు ప్రచురించిన విజ్ఞాన సర్వస్వము ఒక సమగ్ర ప్రయోగము. కాని విచారకరమయిన విషయం ఏమంటే దానికి కాలదోష లోపం ఉంది. సుమారు 1954లో ప్రారంభించాక ఇప్పటికి 14 సంపుటీలు వెలువడ్డాయి ఇంకా కొన్ని సంపుటీలు రావాలి విజ్ఞానం అంతా అకారాది క్రమంలో కాక విషయ ప్రధానంగా సంపుటీలు రూపొందించబడ్డాయి. [illegible] శాస్త్రానికి సంబంధించిన సంపుటి 1978లో వెలువడింది. అయితే 1948 నుంచి రచనలు సాగుతున్నాయి. అంటే మనం అనుకొని రచనలు సాగించి, గ్రంథం బయటపడేసరికి విజ్ఞానశాస్త్ర స్వరూపం పోలికలేనంతగా మారిపోతోంది ఇంక ప్రయోజనం ఏముంటుంది?

ఈనాటి శాస్త్రవిజ్ఞానం వామనావతారం లాగా పెరిగిపోవడమే గాక కొన్ని సందర్భాలలో అర్థాలు, భావాలు, వివరణలు మారిపోతున్నాయి మరి దానితో పాటు మనం ఎదగాలికదా!

ఉదాహరణకు మళయాళభాషకు సంబంధించి విజ్ఞాన సర్వస్వానికి ఒక సంస్థ ఉంది నూతన సమాచారాన్ని దానికి చేరుస్తూ దాని విషయ పరిజ్ఞానాన్ని సజీవంగా ఉంచుతారు. ఎన్‌సైక్లోపిడియా రచన అయిపోయింది, పుస్తకాలు బైట పడ్డాయి అమ్మయ్య! అని పని పూర్తి అయిందని చేతులు కడిగేసుకోకూడదు కదా. ఒక అంగం నిత్యం పనిచేస్తూ దానికి సమాచారం కలుపుతూ వుండాలి. దానికి జీవం ఉంది అది అభివృద్ధి, మార్పు చెందుతోంది అని అనిపించుకోవాలి పోల్చుకోకూడదుకాని ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా చూడండి. 1978నాటి ఎన్‌సైక్లోపీడియా 32 సంపుటీలతో వెలువడింది 30 కోట్ల రూపాయిల పైబడి ఖర్చు అయింది. అత్యంత సమగ్రరచన ఇప్పటికి 15 ముద్రణలు పొందింది. వారు ప్రతి ఏడూ ఒక సంపుటిని ఆధునిక విశేషాలన్నిటిని క్రోడీకరించి ప్రచురిస్తూ ఉంటారు. తరువాత ముద్రణలో ఈ సంపుటి దానిలో అంతర్భాగమైపోతుంది. దాని స్థాయికి మనం ఎప్పటికయినా చేరుకో గలుగుతామా!

# వాడుక భాష – వ్యాకరణం

వఝ్ఝల వెంకటేశ్వర్లు

మానవుడు తన ఉపయోగం కొరకు తాను కనుగొన్న అద్భుతమైన ఉపకరణం భాష తనలో తాను భావించుటకై మాత్రమేకాక తన భావాలను అన్యులకు తెలుపుటకై కూడ మానవునకు భాష ఉపకరిస్తుంది. భాషవల్లనే వైవిధ్యం కల బహుశాస్త్రసార్థకమైన సాహిత్యం ఉత్పన్నమౌతుంది. వాక్యనిర్మాణ విధానంలో ఇమిడి ఉన్న శాస్త్రమే వ్యాకరణం. సంపూర్ణ భావబోధకమైన అఖండ వాక్యమును విశ్లేషించి ఒకొక్క భాగం ఉపయోగం, వేర్వేరు భాగముల పరస్పర సంబంధం, మొదలైన విషయాలను తెలిపే శాస్త్రమే వ్యాకరణం జీవద్భాష (ప్రజల వాడుకలో ఉన్నది) సర్వదా మారుతునే ఉంటుంది కాబట్టి, మారుతున్న భాషతోపాటు వ్యాకరణం కూడా మారడం సహజం మృతభాషలు (ఒకప్పుడు వాడుకలో ఉండి, ఇప్పుడు వ్యవహార భ్రష్టమైనవి) గ్రీకు–లాటిను సంస్కృతాలు మారే అవకాశం లేదు కాబట్టి వాటి వ్యాకరణం మారనక్కరలేదు.

వేర్వేరు భాషల సంప్రదాయాలు వేర్వేరుగా ఉన్నప్పుడు వాటి వ్యాకరణాలు కూడా కొంత వరకు భిన్నంగా ఉండక తప్పదు వాక్య నిర్మాణంలోను, పద స్వరూప స్వభావాలలోను ఇంగ్లీషు – లాటిను భాషలకు చాలా వ్యత్యాసం కలదు కాని ప్రాచీన వైయాకరణులు లాటిను వ్యాకరణమును మితిమీరి అనుకరించే లాటిను నియమాలను ఇంగ్లీషు మీద బలవంతంగా రుద్ది తమ బుద్ధి చాతుర్యం చేతను, ప్రయత్నబలం చేతను లేని నియమాలను కల్పించి ఇంగ్లీషు వ్యాకరణం తయారు చెయ్యడంలో ఆ భాషకు అపకారం చేశారు. ఇటీవలి వ్యాకర్తలు లాటిను – ఇంగ్లీషు భేదాలను పూర్తిగా గుర్తించి ఇంగ్లీషు భాషాతత్త్వం అవగాహన చేసుకొని ఆధునిక వ్యాకరణం వ్రాశారు. ఒక భాషకు వ్యాకరణం వ్రాసేటప్పుడు దాని సంప్రదాయం పదవాక్య ప్రయోగ విధానం, గమనించి తద్భాషా తత్త్వ ప్రదర్శకంగా వ్యాకరణం వ్రాయవలెనే కాని ఇంకొక భాష వ్యాకరణాన్ని ఆ భాషకు అంటగట్టరాదు. అందువల్లనే "ఒక భాష యొక్క వ్యాకరణాన్ని మరొక భాషకు అంటగట్టడం ఆ రెండవ భాషయొక్క తత్త్వాన్ని పూర్తిగా అపార్థం చేసుకొనడమే అవుతుంది" అని సెవ్ అనే పాశ్చాత్య పండితుడు ఒకచోట అన్నాడు. అయితే, ఒకభాషకు వ్యాకరణం

వ్రాయడంలో ఇంకొక భాష వ్యాకరణం ఎంతవరకు తోడ్పడుతోందో అంతవరకు దానిని అనుసరించడం దోషం కాదు.

లాటిను, ఇంగ్లీషు భాషల వలెనే సంస్కృతాంధ్రములు అనేక వైషమ్యాలను ప్రదర్శిస్తున్నవి. వాక్య నిర్మాణం, శబ్ద రూపనిష్పత్తి, సమాస రచన, పద క్రమం, లింగవచన పద్ధతి విభక్తి ప్రణాళిక మొదలైన పెక్కు విషయాలలో తెలుగు సంస్కృతానికి భిన్నంగా ఉంటుంది. సంస్కృత భాషతో తెలుగుకు మొదటినుంచి ఘనిష్ఠమైన సంబంధం ఉన్నప్పటికీ ఆ రెండు భాషలకును జన్యజనక సంబంధం గాని, సోదర సంబంధం గాని లేదు అని భాషా శాస్త్రవేత్తలు నిర్ణయించారు. ఈ సిద్ధాంతం నెలకొల్పిన వారిలో ప్రప్రథముడు బిషప్పు కాల్డువెల్ పండితుడు. తదనుయాయులు కోరాడ, వజ్ఝల గంటి ప్రభృతులు, తెలుగు ద్రావిడ భాషా కుటుంబానికి చెందినదనే సిద్ధాంతం నేడు బహు జనామోద యోగ్యమైనది

తెలుగు భాషకు మొదటి వ్యాకరణం నన్నయ కృత 'ఆంధ్ర శబ్ద చింతామణి' అనంతర వ్యాకరణాలలో ప్రముఖమైనవి అథర్వణ కారికావళి (వికృతి వివేకము), కవిశిరో భూషణము (అహోబల పండితీయము) అనే విపుల వ్యాఖ్యానం-ఇవి సంస్కృతంలో ఉన్నవి. చిన్నయ సూరి కృత బాల వ్యాకరణం, బహుజనపల్లి సీతారామా చార్యులు రచించిన ప్రౌఢ వ్యాకరణం మొదలైనవి తెలుగులోనే ఉన్నవి ఈ వ్యాకరణాలు అన్నీ సంస్కృత వ్యాకరణ ప్రణాళికపై నిర్మించ బడినవే. ఇటీవల వచ్చిన వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్యగారి 'వ్యావహారిక భాషా వ్యాకరణం' వ్యావహారిక భాషలో వ్యావహారిక భాషకై వ్రాసినదే అయినా, కేవలం చిన్నయ సూరి ప్రణాళికనే అనుసరించి ఉన్నది. ఈ వ్యాకరణాలు సంస్కృత వ్యాకరణాను సారులై తెలుగు భాషా ప్రకృత స్వరూపమును, శబ్ద తత్త్వమును సరిగా నిరూపించలేకున్నవి. నేడు విద్యాలయాలలో బోధించబడుతున్న వ్యాకరణం సంస్కృత వ్యాకరణచ్ఛాయ మాత్రమే కాని, నిజమైన తెలుగు లక్షణం కాదు.

ఉదాహరణగా ఒక్క నామవిభక్తుల విషయం తీసుకొని విచారించితే తెలుగు వ్యాకరణానికి జరిగిన హాని స్పష్టపడుతుంది. సంస్కృతంలో ఏడు విభక్తులు కలవు. నామ ప్రాతిపదిక రూపాలు సిద్ధిస్తున్నవి. ప్రాతిపదికకు సమాసగత ప్రయోగమే కాని స్వతంత్ర ప్రయోగం లేదు మన వైయాకరణులు తెలుగులో కూడ ఏడు విభక్తులే ఉండాలి. సంస్కృత విభక్తి ప్రత్యయాలు ఏయే అర్థాలను బోధిస్తున్నవో ఆయా అర్థాలలో తెలుగులో కూడ ప్రత్యయాలే ఉండాలి అని భ్రమించి తెలుగుకు లేని ఒక విభక్తి ప్రణాళిక రూపొందించారు ఈ అనర్థం తెలుగుకే కాదు, ఇతర ద్రావిడ భాషలకును, ఒడియా హిందీ ప్రభృతి ఉత్తరాది భాషలకును కొంతవరకు సంభవించకపోలేదు నన్నయాదులు సంస్కృత విభక్తి రూపాలను తెలుగులోనికి అనువదించి ప్రత్యయాలు కాని పదాలను, విభక్తి ప్రత్యయాలు కాని ఇతర ప్రత్య

యాలను, విభక్తి ప్రత్యయాలుగా పేర్కొన్నారు.

డు, ము, వు, లు - ఇవి ప్రథమా విభక్తి ప్రత్యయాలు కావు అని అనేక ఉపపత్తులు చూసి భాషావేత్తలు రుజువు చేశారు కూర్చి, గురించి, చేత, తోడ, వలన, పట్టి, కంటె, యొక్క, లో, లోపల, అందు - ఇవి కూడా, విభక్తి ప్రత్యయాలు కావు, పదములే అని నిరూపించారు క్రింద, మీద, వరకు, వెనుక, వెలుపల, తరువాత, కోసం, వలె, దనుక, దాక పైని - ఈ పదాలను ఏ గణంలో చేర్చవలెనో, 'చేత' మొదలైన పదాలను కూడ ఆ గణంలోనే చేర్చాలి వీటిని 'విభక్తి' ప్రతిరూప కావ్యయాలు', లేక 'విభక్త్యర్థాభిధాయకాలు' అని కొందరు వైయాకరణులు పేర్కొన్నారు. వీటికి ఈ వ్యాకరణంలో వైభక్తికములు' అనే సంజ్ఞ పెట్టడమైనది.

డు,ము వు - ఇవి తెరుచుగా తత్సమాలలో వచ్చే ప్రత్యయాలు - ఇది బహువచనంలో వచ్చే ప్రత్యయం. ఉత్తమ-మధ్యమ పురుషములలో వచ్చే అను, అము, అవు, అరు - ఇవి నిజమైన ప్రథమా విభక్తి ప్రత్యయాలు. నా వ్యాకరణంలో దీనికి నామవాచక విభక్తి అనే సంజ్ఞ వాడబడినది

'ల' నిజమైన ద్వితీయా విభక్తి ప్రత్యయం కాదు. దీనిలోని ఆత్వం సంబంధార్థంలో వస్తుంది. దీని మీద వచ్చే 'ను' వరకమే నిజమైన కర్మవాచక విభక్తి ప్రత్యయం. 'న' నిజమైన సప్తమీ విభక్తి ప్రత్యయం కాదు. దీని లోని 'అ' త్వం తృతీయా-సప్తమ్యర్థక కరణ-అధికరణార్థాలలో వచ్చే ప్రత్యయం. కు-కి-ప్రత్యయాలు షష్ఠీవిభక్తి అన్నారు. ఇవి సంప్రదానాది వివిధార్థాలను సూచించే ప్రత్యయాలు. 'ఆ-ఆరా' ప్రత్యతులను సంబుద్ధివాచక ప్రత్యయాలుగా మన వైయాకరణులు పేర్కొనలేదు. ఈ విధంగా తెలుగు విభక్తి ప్రణాళిక తెలుగులో శబ్దతత్త్వమును సరిగా నిరూపించలేదు.

'డు-ము-వు-లు శబ్దగతములే కాని ప్రథమా విభక్తి ప్రత్యయములు కావు అని కోరాడ రామకృష్ణయ్యగారు 'సంధి' అనే గ్రంథంలో ద్రావిడభాషాతత్త్వాన్ని అనుసరించి చారిత్రాత్మకంగా నిరూపించారు

"చక్కగా పరిశీలించినచో నివి (డు-ము-వు-లు) ప్రథమా విభక్తి ప్రత్యయము అనుటయే పొసగునట్లు తోచదు ఏలయనగా నీ భాషలో సామాన్య ప్రాతిపదికయే ప్రథమా విభక్త్యేకవచన రూపమగుచుండెనే కాని ప్రాచీన భాషలో ప్రథమా విభక్తిని సూచించుటకుగా ప్రత్యేక ప్రత్యయములు లేవు.

* * *

"స్త్రీలింగ - స్త్రీ సమ - శబ్దములకు ప్రథమైకవచనమున నేవో ప్రత్యయములను కల్పించుటయు, వానికి లోపమును విధించి లోపింపచేయుటయు ననునదంతయు సంస్కృత వ్యాకరణ పక్కి ననుసరించిన యాంధ్ర వైయాకరణ కల్పనా విలసితమే కాని వాస్తవముగా నీ భాషలో ప్రథమా విభక్తి కాక ప్రత్యయము కలుగుట కాని, లోపించుట కాని రెండును మిథ్యలే.

"ఇట్లు ప్రథమా విభక్తి ప్రత్యయము లెంతమాత్రము కావనియు వాని తుది నున్న ఉపకారము ప్రాచీనకాలమున హలంతములై యున్న శబ్దముల పై నుచ్చారణ సౌకర్యమునకై చేర్చఁబడినదే గాని శబ్దగతము కాదనియు స్పష్టము."

చిలుకూరి నారాయణరావుగారు "ఆంధ్రభాషాచరిత్రము"లో "ము-వు-లు" ప్రథమా విభక్తి ప్రత్యయములు కావు అని స్పష్టపరిచినారు.

ద్రావిడ భాషలలోని ప్రథమావిభక్తిని గురించి కాల్డువెల్ పండితుడు తన తులనాత్మక ద్రావిడభాషా వ్యాకరణంలో వ్రాసిన మాటలు భావం

"ద్రావిడ భాషలలో వలెనే సిథియను భాషలలోను నామములకు భిన్నభిన్న విభక్తి రూపాలు కలవు కాని నామవాచక (ప్రథమా) విభక్తికి ప్రత్యయాలు లేవు జపాను ప్రజల భాషలో నామములకు ప్రథమా (కర్తృ వాచక) విభక్తి లేదు అని చెప్పబడుతున్నది ద్రావిడ భాషలలో నామవాచక విభక్త్యేకవచనం ఎట్టి చేర్పులు, మార్పులు లేని నామమే: కాని నామవాచక విభక్తి రూపంలో నామముల ఏర్పాటున వచ్చే ప్రత్యయం అంతర్గతమై ఉంటుంది."

తెలుగు వ్యాకరణంలో సంస్కృతపు ఏడు విభక్తుల ప్రణాళిక ప్రవేశపెట్టడం వల్ల పెక్కు అనర్థాలు వాటిల్లినవి. "సర్వవిభక్తి సంస్కృత తుల్యా" అని నన్నయ్య భ్రమించి సూత్రించడమే మొట్టమొదటి గొప్పపొరపాటు. దీనివల్ల కలిగే ఆపత్తి తొలగించడం కోసం 'అన్యస్యాః క్వచిత్పంచమ్యాః' అని సూత్రించవలసి వచ్చినది. తెలుగులో ఆ ప్రత్యయమే కరణ - అధికరణార్థక తృతీయాసప్తమీ విభక్తులలో వస్తుంది అని గుర్తించలేకపోవుటవల్లను, ఇవి కర్మార్థక ద్వితీయావిభక్తి రూపాలను పోలి ఉండడం వల్లను, షష్ఠీ (సంబంధార్థక) రూపాలకు ద్వితీయారూపసామ్యం ఉండడంవల్లను, 'ఇతరత్రచద్వితీయా,' 'షష్ఠీభవేద్ద్వితీయాతుల్యా తత్పురుష సంస్థితా నామ్నామ్' 'శేషాంచి దుదంతానాం' మొదలైన సూత్రాలు వెలసినవి. 'ఔపవిభక్తిక నామ్నామత్వం స్యాత్ సప్తమీతృతీయార్థే' అన్న సూత్రంలో మాత్రం నిజమైన ఆ-ప్రయత్నం విధానం కనిపిస్తున్నది తక్కినవికృతక సూత్రాలు. తరువాతి వైయాకరణులు, అధర్వణ చిన్నయాదులు నన్నయ్య సూత్రపక్కినే అవలంబించారు.

నన్నయ చిన్నయాదుల వ్యాకరణాల లోని దోషాలను ఎనభై సంవత్సరాల క్రితమే టి. యమ్. శేషగిరి శాస్త్రిగారు గుర్తించారు. "నన్నయ తన బుద్ధికి తోచినట్లు లక్షణము చెప్పగా తదనుయాయులు కూడ ఆ భ్రంశములతోనే వ్యాకరణములు రచించినారు. తమిళ కన్నడ భాషల వ్యాకరణములలో అట్టి భ్రంశములు లేవు చారిత్రకముగా మన వైయాకరణుల లక్షణములు దుష్టములు, శబ్ద స్వరూప విరుద్ధములు, కాల్పనికములు అవాస్తవములు. అంతేకాక పాణినీయ వ్యాకరణ పరిభాషననుసరించిసూత్రరచన చేయుటచే అవి దురవగాహముగా ఉన్నవి అనిగుర్తించిన శేషగిరి శాస్త్రిగారు సులభ

సూత్ర పక్కని చారిత్రకముగా 'ఆంధ్ర శబ్దతత్త్వము' అనే వ్యాకరణం గత శతాబ్దాంతం లోనే వ్రాసి భాషకు మహోపకారం చేశారు కాల్డువెల్ సిద్ధాంతాలను ఆమోదించిన కోరాడవారు. వజ్ఝలవారు, గంటివారు మొదలైన ఆంధ్ర భాషాతత్త్వ పరిశోధకులు మన వ్యాకరణాలలోని దోషాలను స్పష్టీకరించారు. ముఖ్యంగా నామవిభక్తి ప్రణాళికను సవరించ వలసిన ఆవశ్యకతను సూపించారు శేషగిరి శాస్త్రిగారు పేర్కొన్న శుద్ధ ప్రత్యయములు అన్ ఇన్, ఉన్ (ద్వితీయ) అన్ (తృతీయ), కి కు (చతుర్థి) ఇ. అ ఉ (షష్టి)అన్ ఇన్ (సప్తమి) మాత్రమే. పంచమికి శుద్ధ ప్రత్యయాలు లేవు మిగిలిన కూర్చి – చేత – అందు మొదలైన వాటిని విభక్తి ప్రతిరూపక పదాలుగా గుర్తించారు. చిలుకూరివారు కూడ యొక్క' ఉత్తపదమే కాని ప్రత్యయం కాదు 'నే' సప్తమి కాదు. 'అన్' ప్రత్యయమే సప్తమి, ము–వు–వర్ణకాలు విభక్తి ప్రత్యయాలు కావు 'చేతన్, చేన్' మొదలైనవి - ప్రత్యయాలు కావు అని చెప్పారు కోరాడ వారు 'డు–ము–వు–లు' శబ్దగతములే కాని విభక్తి ప్రత్యములు కావు అని తేల్చినారు. ముప్పై సంవత్సరాల క్రితం గంటి జోగిసోమయాజిగారు కూడ "కు,ను న ఇ అ." అనునేతచ్చము లయిన వానిని ప్రత్యయములుగా చెప్పి యితరములను స్వతంత్ర శబ్దములుగా గ్రహించి యేను విభక్తుల క్రమము పొంత పోకుండుట యొక్క పద్ధతి కాదవ కాలము. ఇదియే తెనుగునకు కుదిరిన ప్రణాళిక యున వచ్చును" అని విశదీకరించారు.

ఇంతమంది మేధావులు మహాపండితులు తెలుగు విభక్తి పద్ధతిని నిరుషంగా నిరేశించినా, నేడు మన పాఠశాలలలో, విశ్వవిద్యాలయాలలో ఇప్పటికిని బాల– ప్రౌఢ– వ్యతిరేకరణాలను వాటిని అనుసరించి నేటి పండితులు రచించిన ఇతర వ్యాకరణాలను బోధిస్తున్నారు అంటే అది మన భాష దౌర్భాగ్యం కాక మరేమి? ఉపాధ్యాయిలు పాఠశాలలో పిల్లల ప్రథమాది విభక్తి ప్రత్యయలను అదే పద్ధతిలో పల్లె వేయిస్తున్నారు. ఉపాధ్యాయులకే దురవగాహమైన ఈ శబ్దతత్త్వం పసిపిల్లలు గ్రహించేది ఎట్లు?

విశ్వవిద్యాలయాలలో ఆంధ్ర శాఖాపీఠాలను అధిష్ఠించి ఉన్న, డాక్టర్లను తయారు చేస్తున్న తెలుగు అధ్యాపకులు కూడ అర్థరహితమైన, కృతకమైన విభక్తి ప్రణాళికను భేదించలేక పోతున్నారు. భాషా తత్త్వవేత్తలై అధికార లో ఉన్న వారు కూడ సంప్రదాయానికి కట్టుబడి పోయి ఏనాడో రావలసిన మార్పు నేటికైనా తీసుకొని రాలేక పోతున్నారు. విద్యా శాఖాధికారులు తయారు చేసిన సిలబసులు కూడా ప్రాచీన వ్యాకరణాను సారులుగానే ఉన్నవి సిలబసులకు వ్యాకరణాలే ఆధారం. వ్యాకరణాలు దోషభూయిష్ఠాలైనప్పుడు సిలబసులు దోషావహాలు కాక తప్పదు విద్యాశాఖ వారు ఆమోదించిన భాష గ్రాంథికమైనా, వ్యావహారికమైనా వాక్య నిర్మాణ రీతి, విభక్తి ప్రణాళిక, సంధి సమాసాదులు

భాషాతత్త్వ విరుద్ధంగా ఉండరాదు కదా. వ్యావహారిక భాష అన్ని విద్యాస్థాయుల లోను ఆమోదించబడుతున్న ఈ అదును న మార్గదర్శకమైన ఒక ఆధునిక వ్యాకరణం రూపొందించవలసిన అవశ్యకత ఎంతైనా ఉన్నది. అట్టి వ్యాకరణ నిర్మాణం నిమిత్తమే ఈనా ప్రయత్నం [1]

ప్రామాణికమైన తెలుగు భాషకు ఆధునికమైన వ్యాకరణం కాబట్టి దీనికి 'ఆధునిక ప్రామాణికాంధ్ర వ్యాకరణం' అని పేరు పెట్టడమైనది. నేటి శిష్ట వ్యావహారిక భాషనే ప్రామాణిక భాష అంటున్నాము నేడు పత్రికలలో పత్రికా రచయితలు వాడుతున్న భాష, రేడియో వార్తలలో వినిపిస్తున్న భాష, నేటి రచయితలు కథానికా నాటకాదులలో వ్రాస్తున్న భాష నేటి ఉత్తమ వక్తలు తమ ఉపన్యాసాలలో ఉపయోగిస్తున్న భాష – ఇదే ప్రామాణిక భాష

ఈ భాషలో గ్రంథాలు రచించిన ప్రసిద్ధ రచయితలు ఎందరో ఉన్నారు గిడుగు, గురజాడ, చెళ్ళపిళ్ళ, శ్రీపాద, విశ్వనాథ, నార్ల, పురిపండా, వడ్లమూడి మొదలైనవారు ఈ ప్రామాణిక భాషలో చక్కని వచన కవితలు వ్రాస్తున్న కవులు ఎందరో ఉన్నారు: శ్రీశ్రీ బాలగంగాధర తిలక్, కుందుర్తి, బెజవాడ గోపాలరెడ్డి, ఆరుద్ర మొదలైనవారు.[1]

బహుళ ప్రచారంలో ఉన్న నేటి ప్రామాణిక రూపాలు భాషకు విశ్వవిద్యాలయాధికారుల ఆమోదముద్ర లభించింది. విద్యాశాఖాధికారులు నేటి ప్రామాణిక భాషలో పాఠ్యగ్రంథాలు ప్రచురిస్తున్నారు. వాటిని విద్యార్థులు చదువుతున్నారు. శిష్ట వ్యావహారిక భాషలో వ్రాయబడ్డ గ్రంథాలు పాఠ్యాలుగా నిర్ణయించడం జరుగుతున్నది. అన్ని విద్యాస్థాయులలోను, అన్ని రచనా ప్రక్రియలలోను సంభాషణ మాధ్యమమైన భాషకు మిక్కిలి సన్నిహితమైన ఒక ప్రామాణిక భాష నెలకొంటున్నది. అటువంటి భాషకే భాషాతత్త్వ ప్రదర్శకమైన ఈ వ్యాకరణం ఉద్దిష్టమైనది

"అటు రచనా మాధ్యమంగా, ఇటు

1. ఇక్కడ ఒక్క తెలుగు విభక్తి ప్రణాళిక మాత్రమే చర్చించడమైనది. ఇదే రీతిగా తెలుగు వ్యాకరణం అనేక ఇతర విషయాలలో సంస్కరించడం అవసరం. 'తెలుగు వ్యాకరణాల తీరు తెన్నులు' అనే గ్రంథం (వ్యాసావళి)లో అవి చర్చించబడ్డవి ఈ వ్యాకరణంలో యథోచిత స్థానాలలో ఆయా విషయాలు వివరించడమైనది.

1. 'మహతి' (యువభారతి ప్రచురణ)లో శ్రీ బూదరాజు రాధాకృష్ణ గారు 'భాష – ప్రామాణికత' అనే వ్యాసంలో ఇలా వ్రాశారు: "జన సాంద్రత, వార్తాసౌకర్యాలు, విద్యాభివృద్ధి, ఆర్థిక రాజకీయ సౌష్ఠవం, భౌగోళిక సాన్నిహిత్యం మొదలైన ప్రధాన కారణాలవల్ల వ్యవహర్తల వాడుకలో నుంచి స్థానిక మాండలికాలు తొలగిపోయి ప్రామాణిక రూపాలు ఏర్పడి భాషలో ఏకత్వం అధికమౌతుంటుంది.

సంభాషణ మాధ్యమంగా శిష్టులు ఉపయోగించే భాషారూపం నిర్దిష్ట దేశకాలల్లో ప్రామాణికంగా పర్యవసిస్తుంది. సన్నిహిత సాంఘికాది సంబంధాలవల్ల భాషలో వచ్చే ఏకరూపతనే, సామ్యాన్నే ప్రామాణికమని వ్యవహరిస్తాం.

“పండితులను పామరులు అనుకరించడం యథార్థస్థితి ఈ అనుకరణ ఫలితంగా నిర్దిష్ట దేశకాలల్లో వచ్చే భాషారూపతౌల్యమే ప్రామాణికం.

యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదే దేతరోజనః’

ప్రజలు మాటాడే భాషకు వ్యాకరణం ఎందుకు అని కొందరు పండితులు అంటారు వారి దృష్టిలో బహుశః శబ్దరూప సాధుత్వాసాధుత్వ నిర్ణయమే వ్యాకరణ అయి ఉంటుంది మనం మాటాడే భాషనే సాధువుగా గ్రహించినట్లయితే ఆ భాషలో వ్రాసే రచనల శబ్దరూపాలకు ఇక అసాధుతా ప్రసక్తి ఉండదు కదా అని వారి వాదమేమో. నిజానికి శబ్దసాధుత్వాసాధుత్వ నిర్ణయం మాత్రమే వ్యాకరణంకాదు. వాక్యనిర్మాణ రీతులు, ఉద్దేశ్య ఆఖ్యాత సంబంధం, భాషాభాగ వర్గీకరణం, పదబంధ – ఉపవాక్యాదుల రచన, లింగవిభక్తి వచన వివేకం, క్రియా–కాలవాచ్యాది లక్షణం, సమాస నిరూపణం మొదలైన ఎన్నో విషయాలు వ్యాకరణ పరిధిలోనివి. అవి ఏ భాషకైనా అవశ్యకమే అనుట నిర్వివాదాంశం.

ప్రాచీన గ్రంథమైనా, ఆధునిక శిష్టవ్యావహారికమైనా శబ్దరూప పరిమాణం తప్పించితే తెలుగు భాష అంతా ఒక్కటే వచ్చెను. వచ్చినాడు, వచ్చాడు, వచ్చేడు, వచ్చిండు. ఈ క్రియారూపాలు అన్నీ సమానార్థకాలే. 'వచ్చెను, వచ్చినాడు' గ్రాంథికరూపాలు; తక్కినవి వ్యావహారిక రూపాలు, వీటిలో ఒకొక్కటి 'వచ్చు' ధాతువుకు విశుద్ధ భూతకాలరూపం, ఏకవచనం, పులింగం (వాడు) ఉద్దేశ్యమైనప్పుడు, అకర్మకం, కర్తృవాచ్యం – ఇట్లు లక్షణం చెప్పడమే వ్యాకరణం చేసేపని నా వ్యాకరణంలోని వాక్యాలను గ్రాంథికంగా మార్చితే అది గ్రాంథిక భాషకు కూడా వర్తిస్తుంది. నాటి గ్రాంథిక భాషకై వ్రాయబడ్డ నన్నయ–చిన్నయాది వ్యాకర్తల వ్యాకరణాలలోని భ్రమ – ప్రమాత – అవాస్తవితలు దురవగాహ సూత్ర పద్ధతి తొలగించి నేటి తెలుగు భాషకు భాషాతత్త్వ ప్రదర్శకమైన, సమగ్రమైన వ్యాకరణం నిర్మించేందుకే ఈ ప్రయత్నం జరిగింది

అచ్చంగా మాటాడేటట్టు వ్రాయడం ఆచరణ సాధ్యమూ కాదు. అభిలషణీయమూ కాదు; లిఖితభాష కథితభాషకు అవసరమైనంత సన్నిహితంగా ఉండడమే ఉత్తమ రచనా లక్షణం. ఒక లిఖిత సంజ్ఞకు ఒక ఉచ్చారణ ఉండడం ఏ భాషలోను సంభవంకాదు; అలా ఉండేటట్లు చేయడానికి ప్రయత్నించడం నిష్ప్రయోజనం సంస్కృతంలో, తితఉ (జల్లెడ) అనే మాటను 'తితవు:' అనే లఘువకారంతో పలుకుతాము. 'అతఏవ' (అందుచేతనే) అనే దానిని 'అతయేవ' అని లఘుయకారంతో పలుకుతాము. హిందీలో కూడ వ్రాతకు, పలుకుబడికి కొంత తేడా ఉంటుంది. ఉదా.–

| వ్రాత | ఉచ్చారణ | వ్రాత | ఉచ్చారణ |
| --- | --- | --- | --- |
| బకరా | బక్రా | ఖాట | ఖావా |
| ఝుటపేట | ఝుట్ పేట్ | బిరుకుల | బిర్ కుల్ |

ఒడియా భాషలో కూడ ఇట్టితేడా ఉన్నది.

| వ్రాత | పలుకుబడి | వ్రాత | పలుకుబడి |
| --- | --- | --- | --- |
| గాఈ | గాయి | మోతే | మొత్తె |
| దేఛి | దేవుచ్ఛి | మోతేడిఓ | మొద్దియొ |

అదేవిధంగా తెలుగులోను ఉచ్చారణ స్వల్పమైన వర్ణలోపాది వికారాలు ఉంటాయి ఉదా :-

| పలుకుబడి | అసలు మాటలు | పలుకుబడి | అసలు మాటలు |
| --- | --- | --- | --- |
| జింహా | జిహ్వా | ఇతర్లు | ఇతరులు |
| ఒక్కచ్చెప్పండి | ఒక కథ చెప్పండి | భారద్దేశం | భారతదేశం |
| భూమ్మీద | భూమి మీద | నీతప్పు | నీది తప్పు |
| వస్తునా | వస్తున్నాను | వెళ్లొచ్చింది | వెళ్లవలసి వచ్చింది |

ఉచ్చారణత్వర, అసావధానత మొదలైన కారణాల వల్ల పలుకుబడిలో ఏర్పడే వర్ణవికారాలను వ్రాతలో చూపితే మాటల స్వరూపం చెడి అర్థ బోధకు హాని కలుగుతుంది. కథక లిఖిత భాషలకు కొంత భేదం ఉండడం అవాంఛనీయం కాదు తాటాకు 'కొట్టాడు' పదాల లోని మధ్య అచ్చు ఆ-ఏలకు మధ్యగా ఉంటుంది. 'మేక', 'తేడా', ఇత్యాదుల లోని ఏత్వం కూడా అటువంటిదే. తాలవ్య-దంత్య చ-జల భేదం ఉచ్చారణలో ఉంటుంది కాని వ్రాతలో కనబడదు. ఇటువంటి భేదాలను సూచించే గుర్తులు క్రొత్తగా కల్పించినా ప్రయోజనం ఉండదు, ఎవరును వాటిని ఉపయోగించరు. చ-జల విషయమే ఇందుకు తార్కాణం. బ్రౌను దొరగారు కల్పించిన చ, జ, అనే దంత్య వర్ణపు గుర్తులను (నిఘంటువులలో తప్ప) ఎవరు వాడుతున్నారు? కొంతమంది పామరుల మాటలు కూడ రచనాయోగ్యాలు కావు. 'తింతన్నాను' (తింటున్నాను) అత్తోరు (అత్తవారు); 'ఎల్లాలి' (వెళ్లాలి) మొదలైనవి కనుక 'సంస్కారార్థోనియమః అనియమా ద్గ్రామ్యం హియత్త్వ వప్రభంశః' అన్న నన్నయ్య నుండి నేటి ప్రామాణిక భాషకు కూడా వర్తిస్తుంది. కేవలం మాటాడేటట్లు వ్రాయడానికి ప్రయత్నించే రచయితలు వ్రాతలో కొంత సంయమనం అలవర్చుకొనడం శ్రేయస్కరం. ఈ దృష్టితోనే నా వ్యాకరణంలోని ప్రసంగాలు, ఉదాహరణలు వ్రాయడం జరిగింది ప్రామాణిక భాషలోని రచనాయోగ్యాలైన పదరూపాలను నిర్ణయించి పటికలు తయారు చేసే నిమిత్తం విశ్వవిద్యాలయాధికారులు. విద్యాశాఖాధికారులు, ప్రసిద్ధ రచయితలు గల ఒక సంఘం ఏర్పడడం

వాంఛనీయం ప్రభుత్వం వారే ఈ పనిని చెయ్యడం విధేయం.

నా వ్యాకరణంలోని ఆధునికత గురించి కొంత చెప్పవలసి ఉన్నది. భాషణకు "ఏకకం" వాక్యం[1]. వాక్యంతో ప్రారంభమైన 'వాక్యవిజ్ఞానం' అనే మొదటి భాగంలో వాక్య విశ్లేషణం, వాక్యాంశాలు, భాషాభాగాలు, యుగ్మ భాషాభాగాలు, పదబంధ–ఉపవాక్య–జటా లక్షణాలు, సరళ–సంయుక్త – జటిల– ద్వంద్వ వాక్యభేదాలు మొదలైన విషయాలు ఆంధ్రభాషాతత్త్వ ప్రదర్శకంగా వివరించడమైనది సూలంగా వ్యాకరణమంతా ఇందులో ఇమిడి ఉన్నది చివరి భాగమైన 'రచనా జ్ఞానం' లో వాక్య–ఉపవాక్య–జటా భేదాలు, వాక్య పరివర్తనం, స్వముఖ – ముఖాంతరకథనం మొదలైన నూతన విషయాలు కలవు.

భాషాభాగ వర్గీకరణంలో నవ్యత ఉన్నది మనవై యాకరణులు పద రూపాన్నిబట్టి పేర్కొన్న 'అవ్యయం' అనే సంజ్ఞపద వృత్తాన్ని (వాక్యంలో అది చేసే పనిని) సూచించదు కాబట్టి వృత్తప్రధానమైన లింగడింపులో వైభక్తికం, కారకం, సంయోజకం, వ్యంజకం అనే భాషాభాగాలు చెప్పబడినవి. భాషాభాగ పద్ధతి ఇంగ్లీషుకు, సాంస్కృతానికి సరిపడినట్లే తెలుగు మొదలైన భాషలకు కూడా చక్కగా సరిపడుతుంది.

ఏడు విభక్తుల ప్రణాళిక తొలగించడం ఒక ముఖ్య విశేషం. విభక్తుల అర్థాన్ని బట్టి నామ–కర్మ – సంబంధ – కారక – సంబుద్ధి–వాచక విభక్తులు చెప్పడమైనది. విభక్త్యర్థవిషయకమైన కారక ప్రకరణం తొలగించడమైనది. క్రియల అర్థమును పోషించే పదాలకు (పూర్వ వ్యాకరణాల లోని క్రియా–విశేషాలకు) 'కారకం' అనే పేరు పెట్టడమైనది క్రియగాను విశేషణంగాను ద్వివిధ వృత్తం నిర్వహించే అసమాపక క్రియలకు 'క్రియా–విశేషణం' అనే సంజ్ఞ వర్తింపజేయడమైనది. క్రియా–విశేషణం, క్రియా–నామం, క్రియా–కారకం మొదలైన ద్వివిధ వృత్తంకల యుగ్మభాషాభాగముల లక్షణములు వివరింపబడినవి అసమాపక క్రియా–ఘటిత సంబంధాలకు 'జట' అనే సంజ్ఞ కల్పించడమైనది. వాక్య–ఉపవాక్య–జటా పదబంధాల వర్గీకరణ–ఉపయోగాదులు భాషాతత్త్వ నిరూపక పద్ధతిని వివరించడం జరిగింది.

'పదవిజ్ఞానం' అన్నిటి కంటె పెద్ద భాగం. దీనిలో వివిధ భాషాభాగాల వర్గీకరణం, వాటి రూప భేదాలు, వాటి ఏర్పాటు, ఉపయోగాలు మొదలైన అంశాలు విపులంగా ప్రసంగించబడినవి సమాస వర్గీకరణంలో నవ్యత కలదు. ప్రథమాది విభక్తులు లేకపోవుటవల్ల ద్వితీయ తత్పురుషాది సమాన సంజ్ఞలకు

1. ఇంగ్లీషులోని ' యూనిట్లు ' అనే మాట అర్థంలో ఈ 'ఏకకం' అనే పదం వాడబడినది. 'ఏక' మీద క–ప్రత్యయం చేర్చగా ఈ పదం ఏర్పడుతుంది. బర్మియా–హిందీ–ప్రభృతి భాషలలో 'ఏకకం' అనే పదాన్ని ఈ అర్థంలో వాడు తారు.

స్థానం లేకపోయినది తెలుగు తద్ధిత కృదంతాలతోపాటు తత్సమ తద్ధిత కృదంతాల ఏర్పాటు సమగ్రంగా వివరించడం జరిగింది.

అక్షరవిజ్ఞానం'లో వర్ణములు, వర్ణోత్పత్తి, అక్షరములు, లేఖన పద్ధతి, స్వరాఘాతం, స్వరస్థాయి మొదలైన విషయాలు విపులంగా వ్రాయడం జరిగింది సంధివిజ్ఞానం'లో విసంధి ప్రాముఖ్యం, సంస్కృతాంధ్ర సంధి నియమాలు వివరించడమైనది.

ఈ వ్యాకరణంలో దురవగాహమైన క్లిష్టమైన సూత్రపద్ధతి విసర్జించి ఒకొక్క భాషా విశేషం ఒకొక్క ప్రసంగంగా వ్రాయడమైనది విషయం సుబోధమయ్యేటందుకు ఉదాహరణలు అధికసంఖ్యలో ఇవ్వడం ఒక విశేషం.

ఈ వ్యాకరణం సమగ్రమని కాని, నిర్దుష్టమని కాని చెప్పసాహసించను. దీనిలో అజ్ఞానవశాన ఏదైనా భాషా విశేషాలు విడిచి పెటబడి ఉండవచ్చును ఏవైనా దోషాలు వేరే ఉండవచ్చును? అట్టి భాషావిశేషాలను దీనిలో చేర్చడం, లోపాలను తొలగించడం భావివ్యాకర్తల బాధ్యతలుగా పరిగణిస్తున్నాను.

*



# వాడుకభాషా ఉద్యమం - పూర్వాపరాలు

అక్కిరాజు రమాపతిరావు

క్రిందటి శతాబ్ది ఉత్తరార్ధం ప్రారంభానికే తెలుగు పత్రికలు కొన్ని బయలుదేరడంవల్ల వచన రచనలకు ప్రాముఖ్యం కలిగింది. మతం, సాహిత్యం, సామాజిక విషయాలు రాయడానికి తగిన భాషా శైలిని రూపొందించుకోవలసిన అవసరం ఏర్పడింది. 1862 వ సంవత్సరంలో సామినేని ముద్దు నరసింహాలు నాయుడుగారు 'హితసూచని' ని ప్రకటించారు. సామాజిక సమస్యలన్నిటినీ చర్చించే వ్యాస సంపుటం హితసూచని, నాడు సంఘంలో ప్రచురంగా కనపడుతున్న సర్వదురాచారాలను గూర్చి, దుష్టమైన విశ్వాసాలను గూర్చి, మతంపేరిట, కులం పేరిట సాంఘిక జీవితాన్ని కలుషితం చేస్తున్న, యాతనామయం చేస్తున్న పరిస్థితులను గూర్చి ముద్దు నరసింహాలు నాయుడు వివేచనతో ఎన్నో విషయాలు రాశారు. ఈయన రాసిన వ్యాసాలు వీరేశలింగాన్నికూడా ప్రభావితం చేశాయి. ఈ సమస్యలపైనే ఈయన అభిప్రాయాలను వీరేశలింగం కూడా బలపరచాడు కేవలం పండితుల ఆమోదం కోసం కాకుండా-నిజానికి సాంఘిక విషయాలలో పురోగమన భావాలను వాళ్ళెప్పుడూ ఆమోదించరు- అధిక సంఖ్యాకులైన ప్రజలకోసం హితసూచని ఉద్దేశితమైంది కాబట్టి ముద్దు నరసింహాలునాయుడు వాడుక భాషలోనే రాయడానికి పూనుకున్నాడు. వాడుక భాష అని తన రచనా శైలిని గూర్చి ఆయన చెప్పుకోకపోయినా 'సాధారణమయిన భాషయందు వాడుకలోనున్న గ్రామ్యపదములు చాలా మట్టుకు సరసమైన వాక్య రచనలో నంగీకరించ తగినవిగా నేను ఎంచుకుంటున్నాను, అన్నారాయన.

ఇంతకన్నా కూడా ఆరు సంవత్సరాలకు పూర్వమే ఉర్దూనుంచి చార్ దర్వేష్ కథలను అనువదించి ప్రకటించిన ఎర్రమిల్లి మల్లికార్జునుడు "....స్త్రీ పురుషులు ఒకరితో నొకరు మాటలాడు నట్లు సులభముగా అర్థమయ్యేలాగున సంక్షేపముగా ...." రచిస్తున్నానని గ్రంథమంటూ ప్రకటించారు. అంతే చిన్నయ సూరి

నీతి చంద్రికకు ముందు పాండిత్య ప్రదర్శకమైన శైలిపట్ల ఎవరికీ వ్యామోహం ఉండేది కాదని ఇందువల్ల తెలుస్తున్నది.

హితసూచని వెలువడిన పది సంవత్సరాలకు అంటే 1872 వ సంవత్సరం బందరు నుంచి ఆనాడు వెలువడుతున్న పురుషార్థ ప్రదాయిని పత్రికలో "ఆంధ్ర మునందుండ వలసిన అసత్యములైన విషయములు" అనే సంపాదకీయంలో తెలుగులో సులభమైన వచన శైలితో ప్రపంచ విజ్ఞాన విషయాలన్నీ వెలువడ వలసిన అవసరాన్ని నొక్కి చెప్పడం జరిగింది ప్రజల విజ్ఞానాభివృద్ధి కోసం వ్యవసాయ విజ్ఞానం, చేతి పనులు, వర్తక వాణిజ్యాలు కథలు - గాథలు, ప్రకృతి శాస్త్రవిజ్ఞానం, దేశచరిత్ర జీవచరిత్రలు, ప్రతి ఒక్కరూ చదివి తెలుసుకో గల శైలిలో తెలుగులో పుస్తకాలు వెలువడాలి అని పురుషార్థ ప్రదాయిని ప్రబోధించింది.

పురుషార్థ ప్రదాయిని ఈ విషయాలు రాసి నూట ఎనిమిది సంవత్సరాలు గడిచినా తెలుగులో నవీన విజ్ఞానమూ, అధిక సంఖ్యాకుల కర్థమయ్యే సులభ శైలీ నేటికీ దూర తీరాలుగానే ఉన్నాయి.

1872వ సంవత్సరంలో నేలంటేనూట ఎనిమిది సంవత్సరాల కిందట ఆనాటి అత్యున్నత న్యాయస్థానమైన ప్రీవీ కౌన్సిల్ - భారత దేశంలో న్యాయస్థానాల వాదవివాదాల తుదితీర్పు విషయంలో కూడా ఇచ్చిన తీర్పులను పదకి తిరుమలరావుగారనే వారు తెలుగులో ప్రచురించారు పుస్తకరూపంగా. ఈ తిరుమల రావుగారానాడు బళ్ళారిలో న్యాయశాఖ సంబంధమైన కోర్టు మున్సిఫ్ ఉద్యోగం నిర్వహిస్తూ ఉండేవారు. ఈ తీర్పుల సంగ్రహం ముందుమాటలో ఆయన 'దీన్ని వాడుకలో నుండే సులభమైన తెలుగు భాషలో సిద్ధ పరచియున్నాను' అని రాసుకున్నారు. కాబట్టి వాడుకలో ఉన్న తెలుగు భాషలోనే ఇటువంటి గ్రంథాలుండాలన్న విషయాన్ని నూరేళ్ల కిందటే బుద్ధిమంతులు గ్రహించారని విశదమవుతున్నది.

1857 తర్వాత భారతదేశంలో మూడు విశ్వవిద్యాలయాల స్థాపన జరగడమూ, ఆంగ్లభాషా మాధ్యం ద్వారా శాస్త్రీయ విజ్ఞానమూ, మానవీయ విజ్ఞానమూ, కళలూ, సాహిత్యం అధ్యయనం జరగడమూ మనకు తెలిసిన విషయమే

ఈ శతాబ్దపు మొదటి దశకంలో అప్పటి గవర్నర్ జెనరలైన కర్జన్ దేశంలో అన్ని స్థాయులలోనూ విద్యారంగంలోని సమస్యలనుగూర్చి చర్చించి తగిన నిర్ణయాలు చేయడానికి విద్యా విషయిక సదస్సు నొకదానిని ఏర్పాటుచేశాడు. ఈ సదస్సు 1901లోనే జరిగింది. అఖిల భారత స్థాయిన పదిహేనురోజులపాటు సిమ్లాలో ఈ సదస్సు జరిగింది. వందల సంఖ్యలో విద్యావేత్తలు పాల్గొన్నారు. నూట యాభై తీర్మానాలు ఆమోదించడం జరిగింది. సుమారు అర్థ శతాబ్దంగా ఈ దేశంలో ఇంగ్లీషు మాధ్యం క్రమక్రమంగా విస్తరిస్తూ దృఢపడుతూ వచ్చినా విద్యాధికులైన దేశీయులు తమకు తెలిసిన విజ్ఞానాన్ని దేశభాషల్లో ఎందుకు ప్రచారం చేయలేక పోతున్నారు అన్న మీమాంస ఎదురయింది ఈసదస్సు

వారికి. దేశ భాషలు ఈ అర్ధ శతాబ్దంలో ఆశించినంతగా వృద్ధికి రాక పోగా, అమాహ్యమైన, నిరాశాజనకమైన పరిణామాలను కూడా చవిచూడవలసి వచ్చింది. దేశీయులయిన ఆంగ్లేయ విద్యాధికులు దేశభాషల్లో రచన చేయడానికి ముందుకు రాలేదు. బ్రిటిష్ ప్రభుత్వం ఈ పరిణామాన్ని ఆశించలేదు విశ్వవిద్యాలయాల నుంచి సామాజిక జీవనరంగంలోకి ప్రవేశించే విద్యాధికుల ద్వారా నవీన విజ్ఞానం ప్రసారమవుతుందని విశ్వవిద్యాలయాలు స్థాపిస్తున్న సమయంలో ప్రభుత్వం ఆశించింది కాని అది జరగలేదు. దీనికి కారణం దేశభాషల్లో రచన చేయాలన్న ఆసక్తి గాని, సామర్థ్యం గానీ విద్యావంతుల్లో లేక పోవడమేనని వేత్తలు గ్రహించగలిగారు అందువల్ల కళాశాల స్థాయిలో అనువాదమూ, వ్యాసరచనా కౌశలమూ పెంపొందించాలని నిశ్చయించడం జరిగింది.

_తెలుగుదేశంలో పందొమ్మిదివందల అయిదు ఆరు ప్రాంతాలలో విశాఖపట్నం కేంద్ర స్థానంగా సర్కారు జిల్లాలన్నిటి పర్యవేక్షణాధికారంగల విద్యా విచారణాధికారిగా జె. ఏ. ఏట్సు అనే ఉన్నతోద్యోగి వుండేవాడు. అంతకు పూర్వం ఆయన మద్రాసులోని పచ్చయ్యప్ప కళాశాల ప్రధానాధ్యాపకుడుగా కూడా కొన్నాళ్ళు పనిచేశాడు. అప్పుడు తమిళమూ, తెలుగూ నేర్చుకోవాలన్న కోరిక ఆయనకు కలిగి వుండడం సహజమే. తెలుగు జిల్లాల పాఠశాలల విద్యా విచారణాధికారిగా ఆయన నియుక్తుడయిన తర్వాత పాఠశాలల్లో తెలుగునేర్పే విధానంపట్ల ఆయనకు ఆసక్తి కలగటంలో కూడా విశేషంలేదు. పాఠశాలలను తనిఖీ చేస్తుండగా లౌకిక భాషకూ, విద్యార్థుల విద్యార్జన మాధ్యమానికీ బాగా వ్యత్యాసం వున్న విషయం ఆయన గ్రహించాడు. బోధన విషయంలోనూ, పాఠ్యాంశ నిర్ణయంలోనూ, తెలుగుకూ, ఇంగ్లీషుకూ వున్న అంతరాన్ని కూడా ఆయన గ్రహించాడు. ఈ జిజ్ఞాసను సమన్వయించి సమాధానం చెప్పగల విద్యావేత్తకోసం ఆయన అన్వేషించాడు. పి టి శ్రీనివాసయ్యంగారూ, గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి ఆయనకి ఈసందర్భంగా అక్కరకు వచ్చారు ఉద్యమ రూపంలో వాడుకభాష ప్రాశస్త్యాన్ని గూర్చి తెలుగు దేశంలో ప్రచారం జరగడమూ, అది ఒక గొప్ప సంచలనానికి కారణం కావడమూ ఆ తర్వాత పరిణామాలు.

గురజాడ అప్పారావూ గిడుగు రామమూర్తీ మేధావులూ, విద్యావేత్తలూ కాబట్టి ప్రభుత్వం వారి అభిప్రాయాలను గౌరవించింది. ఫలితంగా 1910లో వ్యావహారిక భాషోద్యమానికి విజయంకలిగింది. ఇంటర్మీడియట్ స్థాయి పాఠ్యపుస్తక నిర్ణయంలోనూ, విద్యార్థులు అనువాదం, వ్యాసరచనా విషయికంగా పాటించాల్సిన శైలి సంబంధంగానూ కొన్ని మార్పులు ప్రవేశపెట్టారు దానితో భాషావిషయికంగా సంప్రదాయ పరినిష్ఠిత బుద్ధులూ, సదవగాహన లేనివారు పెద్ద ఆందోళన లేవదీశారు. 1911వ సంవత్సరంలో ఆంధ్ర సాహిత్య పరిషత్తు స్థాపనం జరిగింది. తెలు[illegible] వంతులూ, సంస్థానా[illegible]తులూ, [illegible]

ఆశ్రయించి వున్న పండితులూ, విద్యార్థులకు వ్యావహారిక భాషలో పరీక్ష పత్రాల సమాధానాలు రాయడానికి అనుజ్ఞ లభించడం దేశానికి భాషకు అరిష్టందాపురించడమేనని గగ్గోలు సృష్టించారు ఊరూరా వాడవాడా సభలూ సమావేశాలూ జరిపి ప్రభుత్వానికి మహజర్లు సమర్పించుకున్నారు అంతటితో విద్యాశాఖాధికారులు తాము జారీచేసిన ఉత్తర్వులను ఇచ్చిన అనుమతిని ఉపసంహరించుకోవలసి వచ్చింది ఇది 1914వ సంవత్సరంలో జరిగింది ఆ మరుసటి సంవత్సరమే గురజాడ అప్పారావు స్వర్గస్థుడు కావడం జరిగింది అయినా గిడుగు రామమూర్తి దేశహితం కోసం, తెలుగు భాషా సారస్వత హితాసంకోసం, తన సర్వశక్తియుక్తులతో రంగంలోకి ప్రవేశించి వితండవాదులైన పండితులతో హోరాహోరీ పోరాడారు ఆయన మహామేధావీ ప్రగతి కాముకుడూ, ద్రష్టా కాబట్టి క్రమక్రమంగా ఆయన వాదనలోని సబబును విజ్ఞులు గ్రహించగలిగారు తాతా సుబ్బరాయశాస్త్రి, పేరి కాశీనాథశాస్త్రి, వాసా సూర్యనారాయణశాస్త్రి బంకుపల్లి మల్లయ్యశాస్త్రి వంటి ఉద్దండ పండితులు రామమూర్తి పంతులుగారి వాదాన్ని సమర్థించారు బాసటైనారు

వాడుక భాషా ఉద్యమాన్ని గూర్చిన ప్రస్తావనవచ్చినప్పుడు ఇటీవల ఈవ్యాసరచయితతో మిత్రులు శ్రీ దాగంటి సోమయాజులు గారిలా అన్నారు విజయనగరంలో కొందరు మిత్రులతో వెళ్ళి శ్రీ రాయుడు శాస్త్రిగారిని దర్శించినప్పుడు, ఆయన వ్యావహారిక భాషోద్యమాన్ని గట్టిగా సమర్థించారు అని శ్రీ సోమయాజులుగారు చెప్పారు. వైయ్యాకరణ సార్వభౌములైన శ్రీ రాయుడు శాస్త్రిగారు సంస్కృత ప్రాకృత భాషా వికాసాన్ని, కాలిక పరిణామాలనూ రెస్సగా తెలిసినవారు కాబట్టీ. దర్శన శాస్త్రపారంగతులూ, ధర్మశాస్త్రవేత్తలూ కాబట్టీ, సాంఘిక పరిణామాలను గూర్చీ, ధర్మశాస్త్ర నిబంధనలలో అనివార్యమైన సవరణలను గూర్చి కూడా అభిభాషించారుట మనుస్మృతికీ పరాశర స్మృతికీ అనేక విషయాలలో భిన్నత వున్నప్పుడు, ఒక ప్రాంతంలోని శిష్టాచారానికీ మరో ప్రాంతంలోని సంప్రదాయానికీ తేడా వున్నప్పుడు, ఒక శాఖవారి కట్టుబాటు ఇంకో శాఖవారికి శిరోధార్యం కానప్పుడు, భాష ఈ విధంగానే ఉండాలి సర్వకాలికంగా అని శాసించడం అసంగతం అని గట్టిగా చెప్పారుట శ్రీ రాయుడుశాస్త్రిగారు అంతే కాకుండా సాహిత్య లక్షణం వుంటే చాలుననీ, రసనిష్యందిగా రచన వుంటే భాష ఏవిధంగా వున్నా పట్టించుకోవాల్సిన పని లేదనీకూడా హితవు చెప్పారుట శ్రీ శాస్త్రిగారు శిష్టభాష శిరోధార్యమన్నదే వారి సిద్ధాంతం. వఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు కూడా రామ్మూర్తి పంతులుగారి వాదాన్ని బలపరచినవారే. 'వ్యవహార వశమున భాషలు మారునపుడు వానిలో నాగరక వ్యవహారస్థ భాషను గ్రాంథిక భాషగా గ్రహించుట సకల ప్రామాణిక సమ్మతమయి యున్నది' అని 1913 వ సంవత్సరానికే కృష్ణాపత్రికలో వఝలవారు తమ

అభిప్రాయాన్ని ప్రకటించారు.

మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు సమ్మతించడమే కాక రామమూర్తి పంతులుగారిని సమర్థించారు పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు రామ్మూర్తి పంతులుగారి అనుయాయి వర్గంలో ప్రముఖ స్థానాన్ని పొందారు అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరులు వ్యావహారిక భాషోద్యమాన్ని సర్వాత్మనా ఆమోదించడమే కాక సర్వ రచనలూ వ్యావహారికంలోనే నిర్వహించారు. సిద్ధాంత గ్రంథమైన నేటి కాలపు కవిత్వాన్ని కూడా ఆయన వ్యావహారికంలోనే రాయడం గమనార్హం పల్నాటి వీర చరిత్రకు ఉమాకాంత విద్యాశేఖరులు రాసిన పీఠికను మల్లంపల్లి వారెంతగానో మెచ్చుకొన్నారు శైలీవిషయికంగా కూడా.

అసలు వ్యావహారిక భాషోద్యమాన్ని రామ్మూర్తి పంతులు ప్రవర్తింప చేయడానికి కారణం కుహనా పండితుల అభాసవాదమున్నూ, కూటకరణ గ్రంథ పరిష్కరణమున్నూ. చిన్నయ సూరి దాల వ్యాకరణసూత్రాలకు వ్యతిరిక్తంగా ప్రాచీన కావ్యాలలో ఏదైనా ప్రయోగం కనపడితే ఆ ప్రయోగాన్ని దిద్దడానికి పరిష్కర్తలు వెనుదీసేవాళ్ళు కారు. భారతాన్ని దిద్ది బగంపాడుచేశారని చెళ్ళపిళ్ళవారు పండితమ్మన్యులను నిరసించారు దీన్నే కూటకరణం అన్నారు రామమూర్తి పంతులుగారు. వేదం వెంకట్రాయ శాస్త్రిగారు, రాయదుర్గం నరసయ్య శాస్త్రిగారు ఇంకా ఇలాంటి పాతకాలపు పండితులు తాటాకు కావ్యాలను అచ్చులోకి తెచ్చేటప్పుడు భ్రాంతి మూలకమైన పరిష్కరణలు కొన్ని చేసినట్లు రామ్మూర్తి పంతులుగారు రుజువు చేశారు. వేదం వెంకట్రాయ శాస్త్రిగారు కొక్కొండ వెంకటరత్నంగారి గ్రంథాల నుంచి వేల అపప్రయోగాలు, లక్షణ విరుద్ధాలు చూపారు. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు నన్నయ్యగారినే వదిలిపెట్టలేదు నన్నయ్యగారు వేలకువేలు సంకర సమాసాలు, దుష్టప్రయోగాలూ చేసినట్లు ఆక్షేపించారుట అందువల్ల రామ్మూర్తి పంతులుగారు పాతకాలపు పండితులను గట్టిగా మందలించవలసి వచ్చింది. లోకంలో ఆయా కాలాలలో కవులంతా శిష్టభాషను ఆదరిస్తూనే వచ్చారని ఆయన నిరూపించారు.

"శిష్టజన వ్యవహారమందున్న భాష అఖిలలోకోపకారకమయినది. గ్రంథములు రచించడమునకు చిరకాలమయి పండితులు వాడుతున్నారు అది అపరిమిత ప్రయోజనమైనది. అపరిహార్యము. దానిని నిరసించగూడదు దానిని అవలంభించడం సత్సంప్రదాయమునకు విరుద్ధముకాదు" అని సిద్ధాంతీకరిస్తూ 'పాత తాటాకు అంచు తగిలితే మీరు ఎరువు తెచ్చుకున్న వజ్రాయుధము వెయ్యి ముక్కలయి పోతుంది' అని శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిని హెచ్చరించారు. కవులు పరస్పరం వారి వారి రచనలలో అపప్రయోగాలని నిందించినవాటిని వారి వారి స్వీయ రచనలలోనే చూపారు. పానుగంటి, చిలకమర్తి, శ్రీపాద, వంటి వారికే గ్రాంథికాంధ్రం సరిగా వంటబట్టనప్పుడు, పాఠశాలల్లోనూ కళాశాలల్లోనూ

గ్రాంథికాంధ్రం నిర్బంధంగా నేర్పడం. ఏమి సబబని రామమూర్తి పంతులు ప్రశ్నించారు.

"భాష అనగా లౌకిక భాష. లోకులు అనగా శిష్టులు. లౌకిక శబ్దాలు అనగా శిష్ట సంఘములో నలుగురికీ తెలిసే మాటలు. తెలియడమనగా చెవిని పడగానే మనస్సులో అర్థముస్ఫురించడము" అని పసుమర్తి కృష్ణమూర్తిగారి గృహలక్ష్మీ కంఠాభరణానికి పీఠిక రాస్తూ రామ్మూర్తి పంతులుగారు పేర్కొన్నారు

కావల్సివస్తే పద్యకావ్యాలను మీ ఇష్టం వచ్చిన ధోరణిలో రాసుకోండి గాని వచన రచనాభివృద్ధికి మీ వ్యాకరణ సూత్రాలు కొరగావు అని పదేపదే చెప్పారు రామ్మూర్తిగారు

"ఏ దేశమందైనా శిష్టులు వాడే భాష దేశభాషగా అంగీకరిస్తారు. పతంజలి మహాభాష్యములో అలాగుననే చెప్పినాడు. వ్యవహార భ్రష్టమయిన పాత మాటలు కావ్యాలలో వాడగూడదని తిక్కన చెప్పినాడు ఆంధ్రమండలమందు వ్యవహారములన్నీ దేశభాషలోనే జరగవలెను అందుకు శిష్టులు నేడు వాడే భాష ఉపచరిస్తుందిగాని గ్రాంథిక భాష ఉపచరించదు" అని 1935వ సంవత్సరం ఏప్రిల్ నెలలో రామమూర్తి పంతులుగారు చంద్రిక పత్రికలో తమ అభిప్రాయాన్ని తెలిపారు.

1940 వ సంవత్సరం మార్చి జూన్ నెలల ఆంధ్ర గ్రంథాలయం సంచికలో పంతులుగారిలా హితవు చెప్పారు.

"రెండుకోట్ల డెభ్భై లక్షల మంది ఆంధ్రులను విద్యావంతులను చేయడానికి నా మతము అంగీకరించేటట్టయితే ఒక మాసము రోజులలో సాధ్యమవుతుంది. ముందుగా వ్యావహారిక భాషలో మీ కరపత్రాలన్నిటిని అచ్చొత్తించండి ఆ తరువాత తెలుగుఅక్షరాలూ గుణింతమూ ప్రతివారికీ నేర్పడానికి గ్రామానికొక ప్రచారకుణ్ని ఏర్పాటుచేయండి అక్షరాలూ గుణింతమూ మామూలు తెలివితేటలుగల వాడు నేర్చుకోవడానికి వారం పదిరోజులకన్నా ఎక్కువ పట్టదు. ఎప్పుడయితే అక్షరాలూ గుణింతమూ తెలిసిందో ఆ క్షణం నుంచీ మీ కరపత్రాలు మొదలయినవి చదువుకో గలుగుతాడు. ఇంతకన్నా దేశములో విద్య వ్యాపింప చేయడానికి సులభ మార్గములేదు మీరీ పనికి పూనుకోవలెను ఈ విధముగా బాల్కను రాష్ట్రాలలో యుద్ధము అయిపోయిన తర్వాత చేసినారు నేను ఆ విషయమంతా చదివాను. బాల్కను రాష్ట్రాలలో ఆరు మాసాలలో విద్యా శూన్యత అంతా తొలగిపోయింది" అని రామమూర్తి పంతులుగారు ప్రయోజన విద్యా ప్రచారకులను, గ్రంథాలయోద్యమ కార్యకర్తలను ప్రబోధించారు

ఇంచుమించుగా మూడు దశాబ్దాల పాటు వ్యావహారిక భాషోద్యమం కోసం రామమూర్తి పంతులుగారు శ్రమించారు

అసలింతకూ గ్రాంథిక భాష అంటే ఏమిటి? వాడుక భాష అంటే ఏమిటి? వీటికీ పరస్పర వైరుధ్యం ఏమిటి? అని విచికిత్స మనకు కలగవచ్చు. గ్రాంథిక భాష వ్యావహారిక భాష అనేవి వేరువేరు భాషలు కావు. వేరువేరు శైలులు. అప్పుడీ వివాదం ఎందుకు తల

యెత్తిందంటే చిన్నయ్యసూరి బాల వ్యాకరణం కావ్య భాషనంతా శాసిస్తున్నదనీ, శాసిస్తుందనీ, శాసించాలని భ్రమపడడం వల్ల, చిన్నయ్యసూరిగారా మాట చెప్పనే లేదు అలా అభిప్రాయ పడనూ లేదు కొందరు పండితుల భ్రాంతి మూలకమైన అభిప్రాయాలవల్లచిన్నయ్య సూరిగారి వ్యాకరణ విరుద్ధమైన ప్రయోగాలన్నీ దోషాలని వాదించారు.

"తెలుగుకి సమగ్రమైన వ్యాకరణం లేదు వున్న కొద్దిపాటి వ్యాకరణాలు కొంత వుపకారం చేయకపోలేదు. గాని వుపకారం కంటె అపకారాన్నే యెక్కువగా చేశాయని నా బుద్ధికి తోసుంది. చిన్నయ్యసూరి వ్యాకరణం వ్రాస్తూ తన కాలం నాటికి మహా ప్రసిద్ధులుగా వుండే శ్రీనాథ మహాకవిని గాని, పిల్లల మర్రినిగాని తుదకు కవిబ్రహ్మ సోమయాజినిగాని నాచన సోమున్నిగాని భట్టుమూర్తినిగాని బాగా పరిశీలించ లేదని అతని తీర్మానాలవల్ల స్పష్టపడుతుంది." ఈ మాటలన్నది ఎవరో కాదు. కవనార్థమేపదయించానని చెప్పుకొన్న చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు అన్నారు.

"తెలుగు భాషకు వ్యాకరణాలు నామమాత్రాలనిన్నీ మహాకవి ప్రయోగాలే ముఖ్యాధారాలనిన్నీ మొదటినుంచీ నా వాదం"

"లోకంలోపుట్టి లోకంలో పెరిగిలోక మర్యాదలను అతిక్రమించడానికి ఎవరికీ శక్యం కాదు గదా? ఒకవేళ అతిక్రమించి కవిత్వాన్ని నడిపిస్తేనో? అది యీ లోకానికి మట్టుకు పనికిరాదని ఖండితంగా చెప్పవచ్చును. లోకాంతరస్థుల కోసం రచించామంటే 'కానివ్వండి అలాగయితే' అని సమ్మతించడమే కర్తవ్యం"

"మూడో నాలుగో అంగుళాలలో యిమిడిన తెలుగు వ్యాకరణానికి"

"జ్ఞానలవదుర్విదగ్ధుల దిద్దుబాట్లను పుచ్చుకొని పూర్వపాఠాలను వదులుకోవడం యెంత శోచ్యమో ఆలోచించండి."

"బాగా ఆలోచిస్తే శాస్త్రజ్ఞానం కంటే ప్రయోగ విజ్ఞానమే కవికి ముఖ్యం"

"కనక కవికి నూటికి తొంభైపంతులు లక్ష్య జ్ఞానమున్నూ తక్కిన పది పంతులు లక్షణ జ్ఞానమున్నూ వుండడం ఆవశ్యకమని చెప్పక తప్పదు"

అని నెత్తిన నోరు పెట్టుకొని మరీ మరీ చెప్పారు చెళ్ళపిళ్ళవారు సరిగ్గా రామమూర్తి పంతులుగారు బోధించింది ఇదే లౌకిక భాష కావాలా? అలౌకిక భాష కావాలా? ప్రజాస్వామ్యానికి విద్య విజ్ఞానం, విచక్షణ కలిగించడానికి లౌకిక భాషే ఉపయోగకారి. అందువల్ల శిష్టుల భాషని విజ్ఞాన వాహికగా మనం స్వీకరించాలి. అన్ని దేశాలలోనూ, అన్నికాలాలలోనూ ఈ సంప్రదాయాన్ని ఎవరూ నిరసించరు. నిరసించకూడదు అని రామమూర్తిగారు ప్రబోధించారు

ఇక్కడ ఒక విషయం చెప్పాలి. ఉగ్రవ్యావహారిక వాదులు 'శిష్టభాష' అనే భావాన్ని కూడా ఈసడిస్తే తప్ప తమ అతి అభ్యుదయ ధోరణి వెల్లడి కాదనుకుంటారు. ఇది అవిచారమూలకం. రవీంద్రనాథటాగూరు వాడుక భాషను చలిత్ భాష అనీ, ఇంకా ఆయనకు

ఏభై సంవత్సరాలకు ముందే ఈశ్వర చంద్ర సాగరుడివంటి మహా పండితులు సాధుభాష అనీ వ్యవహరించారు. అంతే కాని రామ్మూర్తి పంతులు శిష్ట వ్యావహారికమంటే, శిష్టులెవరు ? అని విపరీత ధోరణి ప్రదర్శించాల్సిన పనిలేదు శిష్ట వ్యావహారికంకూడా ఒక 'పరిభాషా పదం ఇంకొక విషయం ఏమంటే భిన్న ప్రాంతాల ప్రజాసామాన్యపు నుడికారం పరస్పరం అర్థావబోధకు అడ్డు వస్తుంది కాబట్టి, వాడుక భాషని మేమభిమానించటం అంటారు కొందరు. ఇది సరిఅయిన అవగాహన కాదు. సృజనాత్మక రచనల విషయంలో రసావిష్కరణం కోసం, వాస్తవికత కోసం ప్రాంతీయ నుడికారాన్ని రచయితలు వినియోగించుకుంటే అందువల్ల చిత్తూరు మాండలికం శ్రీకాకుళంలో అర్థం కాదనడం, ఆదిలాబాదు జనసుడి అనంతపురంలో అర్థం కాదనడం వాద సహజం కాదు. రసమహితంగా వుంటే అదే అర్థమవుతుంది. ఈ వాదాలన్నీ చర్విత చర్వణాలైపోయి చాలా కాలం కూడా గడిచిపోయింది. భిన్న ప్రాంతాలమధ్య ఇప్పుడు రాకపోకలు బాగా యెక్కువైనాయి. అందువల్ల క్రమక్రమంగా సార్వమాండలిక ప్రామాణిక భాషాశైలి ఒకటి రూపొందే అవకాశం మరింత దగ్గరైంది.

వాడుకభాషలో ప్రామాణికత కోసం ఎవరూ పనిగట్టుకొని వ్యాకరణం రచించాల్సిన పనిలేదు జీవద్భాషకు వ్యాకరణం ఎప్పుడూ పరిమిత ప్రయోజనాన్ని మాత్రమే సిద్ధింప చేయ్యగలదు. భాష అనేక ముఖాల వికసిస్తే తప్ప అనంతమైన విజ్ఞాన వాహికకాలేదు. అట్లా అని వాడుక భాష రూపురేఖలను, లక్షణాలను సూత్రీకరం చేయకూడదని కాదు, చేయవచ్చు. అయినా ఎప్పటికప్పుడు ప్రజల వ్యవహారాన్ని స్వీకరిస్తూ సేకరిస్తూ వుండాలి. వాడుకభాష రచనకుకొన్ని నియమాలంటూ చేకుమళ్ళ కామేశ్వరారావు గారు వ్యావహారిక భాష లక్షణాలను విశ్లేషించి చూపడానికి ప్రయత్నించారు. దానికి రామమూర్తి పంతులుగారు పీఠిక రాస్తూ వాడుక భాషకి అను శాసనం అనవసరం అన్న అభిప్రాయాన్ని ప్రకటించారు. పదకోశాలూ, వ్యాకరణమూ సార్వకాలికంగా సవరించుకొంటూ వుండవలసిందే వ్యావహారిక భాషా నిఘంటువును తుర్పాలని పిఠాపుర సంస్థాన విద్వత్కవులైన రామకృష్ణ కవులాశించారు. కాని ఈ నిఘంటువు సమగ్రంగా రూపుదాల్చిందో లేదో తెలియదు. ప్రయత్నం మాత్రం జరిగింది. సుమారు పాతిక ముప్ఫై సంవత్సరాల కిందట అయా సోమయాజుల నరసింహశర్మ గారు వ్యవహార చంద్రిక పేరుతో వాడుక భాషకి వ్యాకరణం సమకూర్చే ప్రయత్నానికి పూనుకొన్నారు. కాని ఇది కూడా ముందుకు సాగినట్లులేదు. తరువాత ఇటీవలి కాలంలో కూడా వ్యావహారిక భాషకు వ్యాకరణం రచించే దీక్షితులు కొందరు పూనుకొని కృతకృత్యులమైనామనుకొన్నారు కాని దానివల్ల ఏం ప్రయోజనం ఒనగూరిందో నవీన భాషాశాస్త్రిలే చెప్పాలి. ఈ శతాబ్దంలో మూడు వంతులు గడిచిపోయి డెబ్భై సంవత్సరాల కిందటే స్పష్టంగా సిద్ధాంతితమైన వ్యావహారిక భాష ప్రయోజనాన్నిగూర్చి. అపరిహార్యతను గూర్చి ఇంకా వాదులాడడం విరరకం. నిరుపయోగం. నిష్ఫలం. అవివేకం.

# తెలుగు పత్రికలు – వ్యావహారిక భాషావికాసం

ఏ. లక్ష్మణరెడ్డి, ఎం. ఏ. ఎం. ఫిల్.

[మొదటి నుంచీ వాడుక భాషా ఉద్యమానికి అండగా నిలిచిన అరసం వారు విశాఖలో "వాడుక భాషా ఉద్యమం డెబ్బయ్యో వార్షికోత్సవ సదస్సు" నిర్వహించటం ఎంతో ఆనంద దాయకమైన విషయం

ఈ సదస్సులో పాల్గొనటానికి అవకాశం కల్పించిన కార్యకర్తలకు నిర్వాహకులకు కృతజ్ఞతలు తెలుపు కుంటున్నాను]

పత్రికా ముఖంగా మొదటి సారిగా తెలుగు దర్శన మిచ్చింది 'ఫోర్ట్ సెంట్ జార్జి గెజిట్' లో. ఇది 1834 నాటి మాట. ఈ సెంట్ జార్జి గెజిట్‌లో కన్పించేది వ్యావహారికాంధ్రం 1838 ప్రాంతాల్లో ప్రారంభమై షుమారు నాలు గేండ్లు నడిచిన 'వృత్తాంతి' కూడా వాడుక భాషలోనే కొనసాగింది. 1842 జూన్ ఎనిమిదవ తేదీన ప్రారంభమయిన 'వర్తమాన తరంగిణి' అనే తెలుగు వార పత్రిక కూడా వ్యావహారికం మీదనే నడిచింది. మచ్చుకు 1842 డిశంబరు పదిహేనవ తేదీనాటి వర్తమాన తరంగిణిలో ప్రచురితమయిన ఒక వార్తా ఖండిక చూడండి

> ఈ నెల ౬_తేదీ మంగళవారం తెల్లవారి జామున అయిదు ఘంటలకు మిక్కిలి అద్భుతమయిన ఉల్క ఒకటి నైరుఋతి భాగము నుంచి ఈశాన్యమునకు పోగినది మనవారు దీన్ని తోక నక్షత్రమని వాడుకొంటున్నారు. ఈశాన్య దిక్కుకు వెళ్ళేటప్పుడు వెనక పార్శ్వం నిప్పులు కక్కేటట్టున్నా భూమి మీద అది పుట్టిన చోటినుంచి రాలిన స్థలంవరకు పోకకే చాలుగా పోకటిన్నర నిముషం పుండినది_కడావట కింద పడేటప్పుడు బాగా కాలిన ఫిరంగీ గుండువలెనే వుండి చూచినవారి కందరికీ వింతగా నుండినది. దీని వివరములు బాగా విచారించి_వ్రాతామనుకొన్నందునపోయిన సారే వ్రాయకూడక పోయెను.

1857 కు పూర్వం వెలువడ్డ 'హితవాది', 'దినవర్తమాని' అనే పత్రికల భాషకూడా వ్యావహారికమే.

కుంఫిణీ యుగంలో వెలువడ్డ తెలుగు పత్రికలన్నీ వ్యావహారిక శైలినే అనుసరించాయి. ఆంధ్ర భాషాభివృద్ధికి ప్రతిబంధకాలయిన అరసున్నలు, శకటరేఫలు, ఆనాటి పత్రికా భాషలో కన్పించవు. పద ప్రారంభంలో వు, వూ లు ఉపయోగించేవారు యడాగమం వాక్య ప్రారంభంలో ప్రయోగించేవారు ద్రుత ప్రకృతికంపై యడాగమం కన్పిస్తుంది. నాటి పాత్రికేయులు విసంధిగా రాసేవారు ఆ రచన లన్నిటిలో 'పేరా' విభజన లాంటివి పాటించారు 1842 నవంబరు మూడోతేదీ నాటి 'వర్తమాన తరంగిణి' లో చిన్నయసూరి రాసిన లేఖలో ఎన్నో వ్యావహారిక ప్రయోగాలు కన్పిస్తాయి.

> మహారాజశ్రీ వర్తమాన తరంగిణి ఎడీటరు గారి సముఖానకు ఈ యడుగున వ్రాసుకున్న పద్యంబు తమపత్రికలో ప్రచురము చేసి పండితులగు వారి వలన నా పద్యంబున కర్థంబు తెప్పించి తిరుగా తమ పత్రికలో ప్రచురము చేసి నా అభీష్టం బీడేర్తురని తమ ఘనమును ప్రార్థించెదను పద్యములోన తప్పిదంబులున్నం దిద్దించినవి అభిప్రాయము పోనీయకుండా అర్థమును తమ పత్రికలో ప్రచురము చేతురని కోరెదను.
>
> తమ వినయ విధేయుడగు
>
> చి॥ సూ॥

'వ్రాసుకున్న', 'పోనీయకుండా అర్థము' లాంటి ప్రయోగాలు గమనార్హాలు. 'వర్తమాన తరంగిణి ఎడీటరు', 'సముఖానకు ఈ యడుగున, నా అభీష్టంబు' లాంటి విసంధి ప్రయోగాలు కన్పిస్తాయి. బాలవ్యాకరణం క్రియా పరిచ్ఛేదం 18 వ సూత్రంలో "చేతురు, కోతు రిత్యాదుల సాధువులని యెఱుగునది." అని సూత్రీకరించిన సూరి ఈ లేఖలో చేతురని ప్రయోగించటం గమనార్హం

అయితే కుంఫిణీ యుగం నాటి తెలుగు పత్రికా శైలిలో కొన్ని విలక్షణాలు కన్పిస్తాయి 'స' కు 'శ' రాయటం, సంస్కృత పదాల వర్ణక్రమం భిన్నగా పాటించక పోవటం మొదలయినవి. ఇలాంటివి ఆ శతాబ్దం మొదటి పాదంలో వచ్చిన వ్యావహారిక గ్రంథాలలో బహుసకృతు. ఆ శైలిలో 'న్ను'లు ఎక్కువ దీనికితోడు విరతి గుర్తులు నియతంగా పాటించే వారుకారు. ముగింపు చుక్కకు బదులు అడ్డగీత పెట్టేవారు

పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్థంలో వెలువడ్డ పత్రికల్లో సుజన రంజని, ఆంధ్ర భాషా సంజీవని, అముద్రిత గ్రంథ చింతామణిలాంటి పత్రికలు గ్రాంథికంలో నడిచాయి. వీటిలో పెక్కింటిని తెలుగు పండితులు నిర్వహించారు. ఈ దశలో తెలుగు పత్రికా భాష పండితాధీనమై సామాన్య ప్రజలకు దూరమైంది. పత్రికల ప్రయోజనం సంఘంలో కొద్ది మందికే పరిమితమైంది. ఆనాటి పత్రికారచనలు పండితులైనవారు మాత్రమే గ్రహించదగ్గ రీతిలో వెలిశాయి. ఈ విషయాన్ని గురించి 1882 జూన్ 'వివేక వర్ధని' పత్రికలో వీరేశలింగం గారు ఇలా రాశారు.

కేవల సాహిత్యపరుల వృత్తాంత పత్రిక లేఖనమునకు పూనుకొనుట వలన వారి వ్రాతయందు గూఢ పదములును, దీర్ఘ సమాసములును, క్లిష్టార్థ వాక్యములును, యమకాదులును తప్ప ఉపయుక్త విషయము లంతగా కానరాకున్నవి.

'వివేక వర్ధని' వీరేశలింగంగారు సరళ గ్రాంథికంలో సాగించారు. అంతకు పూర్వమే 1872లో మచిలీపట్నం నుంచి ఉమా రంగనాయకులుగారు ప్రారంభించిన 'పురుషార్థ ప్రదాయిని' భాషా సారళ్యానికి బాటలు వేసింది. తెలుగు పత్రికా రచన జటిల సమాసాలతో నిండి సామాన్య అక్షరాస్యుడికి కొరకరాని కొయ్యగా మారిన సందర్భంలో పత్రికా ప్రయోజనం నిరక్షరాస్యులకు కూడా ఉందనిగుర్తించిన కారణంగానే ప్రజల సమస్యలను చేపట్టిన 'పురుషార్థ ప్రదాయిని' పత్రికా భాషకు గ్రాంధికం గుప్పిట్లో నుంచి విముక్తి కలిగించింది. మొదటి సంపుటి ఏదో సంచికలో 'మాస విషయములు' అనే శీర్షిక కింద పురుషార్థ ప్రదాయిని ఇలా రాసింది:

> తెలుగు భాషను విని గాని, చదివిగాని సాధారణముగా తెలిసి కొనగల వారి కందరికి కూడను ఇట్టి ఇహపర సాధనములైన పన్నిన్నియును సులభముగా తెలిసి అత్యంత ఉపయుక్తం లగుటకు వీలుగా సులభతరమైన శైలితో సామాన్యపు వచన రూపముగా వ్రాయబడి ప్రచురమై యుండలేదు ............ కాలక్రమమున నిట్టి తగని కొరతలను లేకుండ జేయుచుండు గొప్ప ప్రయత్నము నందుడుటయే ఈ పత్రిక యొక్క ముఖ్యోద్దేశము.

కుంపిణీ యుగం తర్వాత కాలంలో మొదటి సారిగా వాడుక భాషను పత్రికల్లో ప్రవేశపెట్టిన కీర్తి వీరేశలింగం గారికే దక్కుతుంది. 'బ్రాహ్మ వివాహం' 'వ్యవహార బోధిని' అనే నాటకాలు వాడుక భాషలో రాసి వీరేశలింగం గారు 'హాస్య సంజీవని'లో ప్రచురించారు వివేకవర్ధని, హాస్య సంజీవని, సత్య సంవర్ధని లాంటి వారి పత్రికల్లో ప్రచురితమైన ప్రహసనాలు, హాస్య ప్రసంగాలు మొదలైన వాటిలో వాడుక భాష ఉపయోగించబడింది.

ఈ కాలంలోనే పాత్రోచిత భాషా వివాదం తెలుగు పత్రికల్లో తలెత్తింది. గ్రాంథిక భాషాభిమానులైన పూండ్ల రామకృష్ణయ్య లాంటి పాత్రికేయులు కూడ పాత్రోచిత భాషావాదాన్ని సమర్థించారు. ఈ శతాబ్ది ప్రారంభం నాటికే వాడుక భాషా వ్యాప్తికి కావలసిన పూర్వరంగాన్ని సిద్ధం చేశాయి ఆనాటి తెలుగు పత్రికలు.

ఈ శతాబ్ది ప్రథమ దశకంలోనే అంటే 1904లో 'మంజువాణి' తిరుపతి వేంకటకవులు వ్యావహారిక భాషలో రచించిన 'పల్లెటూళ్ళ పట్టుదలలు' అనే ప్రహసనం ప్రచురించింది. 1910లో 'ఆంధ్రభారతి' వ్యావహారికంలో రచితమైన 'దిద్దుబాటు' 'మీ పేరేమిటి' అనే గురజాడ వారి చిన్న కథలు ప్రచురించింది. ఈ విధంగా మహాకవి గురజాడ వ్యావహారిక రచనలను ప్రప్రథమంగా ఆంధ్ర

భారతి పత్రికలో ప్రచురించిన సుకృతం అయ్యంకి వెంకట రమణయ్య గారిది.

ఇరవయ్యో శతాబ్ది రెండో దశకంలో వ్యావహారిక భాషా వివాదం తీవ్ర రూపం దాల్చింది. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక వ్యావహారికోద్యమాన్ని ప్రతిఘటించింది. 1913 నాటికి కృష్ణా పత్రిక వ్యావహారికానికి పాక్షికంగా స్థానమిచ్చి ఆదరించింది. ఆ సంవత్సరం బాపట్లలో జరిగిన ఆంధ్ర మహాసభల విశేషాలను 'కబుర్లు' అనే శీర్షిక కింద వ్యావహారిక భాషలో ప్రచురించింది

1914లో సుప్రసిద్ధాంగ్ల దిన పత్రిక 'హిందూ' ఈ విషయమై ఒక చర్చా వేదిక నిర్వహించింది. ఈ సంవత్సరమే గిడుగువారు పండితులకు సవాలుగా 'ప్రాఁదెనుఁగుంగమ్మ' అనే లేఖను అతి ప్రాచీనమైన తెలుగులో రాసి పరిషత్పత్రికలో ప్రచురించారు. ఈ లేఖ మీద పరిషత్పత్రికలో అనేక వ్యాఖ్యానాలు, విమర్శలు వచ్చాయి. 1916 మే 6న కృష్ణా పత్రికలో ప్రచురితమైన వార్తా నివేదికలో కాశీనాథుని వారు గుడివాడలో ఒక సభలో ప్రసంగిస్తూ "వాడుకయందున్న దేశ భాష నుపయోగించుట వలన పత్రికయందు సరళమైన భాషను వాడుట కవకాశము గలుగును"- అన్నారని వుంది. ఈ విధంగా 1916 నాటికి ఆంధ్రపత్రిక వైఖరిలో కూడ మార్పు వచ్చింది.

1919 సెప్టెంబరులో గిడుగువారు వ్యావహారిక భాషా ప్రయోజనం వివరించటానికి 'తెలుగు' పత్రిక స్థాపించారు. కుంఫిణీయుగం తర్వాత కేవలం వ్యావహారికం మీదనే నడిచిన పత్రిక ఇదే. ఈ పత్రిక ద్వారా వ్యావహారిక భాషోద్యమ ప్రచారానికి గిడుగువారు చేసిన కృషి ఫలించింది. ఆంధ్ర వచన రచనామార్గం వ్యావహారిక భాషోన్ముఖమైంది.

'తెలుగు' పత్రిక చదివి ఉత్సాహవంతులైన యువకులు 'సాహితీ సమితి' నెలకొల్పి 'సాహితి' పత్రికను 1919 లోనే వెలువరించారు 'సాహితి' వ్యావహారిక రచనలకు స్థానమిచ్చింది. యువ రచయితల కంఠాల్లోని గడియలు విడిపోయాయి. పాండిత్యం వుంటేగాని రచనకు దిగకూడదనే బెదురు పోయింది. వ్యావహారిక భాషావాదం రూఢమై మాతృభాషలో స్వేచ్ఛగా రాయవచ్చుననే ప్రత్యయం కలిగింది దాంతో వ్యాకరణ భయం లేకుండా గద్య రచన ప్రబలింది. ఆ కాలంలో భారతి, శారద, ప్రబుద్ధాంధ్ర, కళ, సఖి, లలిత, సుధ, విద్యార్థి, గృహలక్ష్మి, జయంతి మొదలైన పత్రికలు వ్యావహారిక రచనలకు గౌరవమిచ్చి ఆదరించాయి.

తర్వాతి దశలో నవ్యసాహిత్య పరిషత్తువారి 'ప్రతిభ' వ్యావహారిక భాషా ప్రచారానికి అంకితమయింది. ఈ దశలో, వాడుక భాషా వ్యాప్తికి కృషి చేసిన పత్రికల్లో వీణ' పేర్కొనదగింది. 1935 సెప్టెంబరు ప్రబుద్ధాంధ్రలో మారేపల్లి రామచంద్రశాస్త్రి (కవిగారు) గారు 'మన తెలుగు వార్తాపత్రికలలో వాడే భాష' అనే వ్యాసం రాసి వ్యావహారిక భాషా ప్రయోజనాన్ని ఎలుగెత్తి చాటారు.

తెలుగు పత్రికా రచనను వ్యావహారికంలోకి తేవటానికి తీవ్రంగా కృషి చేసిన వారిలో ఎస్. జి. ఆచార్య, తాపీ ధర్మారావు, నార్ల ముఖ్యులు. సింహాద్రి గోవిందాచార్య ప్రజాబంధు, జన్మభూమి చిత్రాంగి మొదలైన పత్రికలద్వారా వ్యావహారిక భాషను ప్రాచుర్యానికి తెచ్చారు ఆంధ్ర విశారద తాపీ ధర్మారావుగారు 'ప్రజామిత్రి' లో 'కొత్త పాళీ'తో వ్యావహారిక భాషకు రూప కల్పన చేశారు తెలుగులో 'పాప్యులర్ జర్నలిజానికి' ఆచార్య పునాదులువేస్తే, దానిపై భవ్య హర్మ్యాలు నిర్మించిన 'తాపీ' ధర్మారావుగారు వీరగ్రాంధిక వాదులైన పిఠాపురం మహారాజావారు 1936 లో స్థాపించిన జనవాణి' దిన పత్రికను కేవలం వ్యావహారికం మీదనే నడిపించారు తాపీ ధర్మారావుగారు తర్వాతి కాలంలో రాగడా, జనవాణి (వార పత్రిక) మొదలైన పత్రికల ద్వారా వీరు వ్యావహారిక భాషకు ఒక స్థాయి కల్పించారు. తెలుగు దినపత్రికలో వ్యావహారికానికి సంపూర్ణ ప్రవేశం కల్పించిన ఘనత ధర్మారావుగారిదే. ఆంధ్రప్రభ దినపత్రికలో నార్లవారు వీర గ్రాంథిక భాషావాదుల హృదయాలను సైతం చూరకొనగలిగిన వ్యావహారిక భాషను మలచి సరికొత్త రచనా శైలికి మార్గదర్శకులయ్యారు.

ఈ విధంగా 1910 ప్రాంతంలో ప్రారంభమైన వ్యావహారిక భాషా పునః ప్రతిష్ఠాపన కృషి 1940 నాటికి ఒక మహోద్యమంగా విజృంభించి పాత్రికేయులందరిమీద ప్రభావం చూపింది. వారి మార్గం మార్చివేసింది. పాత్రికేయులకు కొత్త ఉపకరణం తెచ్చి ఇచ్చింది. పత్రికల అభివృద్ధికి పాటుపడింది.

వ్యావహారికమయితే ప్రతిష్ఠాపిత మైంది కాని కొందరి వ్యావహారికం సంస్కృత పద భూయిష్ఠంగా తయారైంది తేట తెలుగు మాటలతో చిన్న చిన్న వాక్యాలతో సులభగ్రాహ్యమైన వ్యావహారిక భాషను రూపొందించవలసిన అవసరం గుర్తించబడింది ఈ విషయంలో వామపక్ష పత్రికలు చేసిన కృషి ప్రశంసనీయమైంది. సామాన్య విద్యావంతులకు కూడా అర్థమయ్యే శైలిని యీ పత్రికలు రూపొందించాయి

సువిశాలమైన తెలుగు దేశంలోని మాండలిక పదాలు ఉపయోగించి యావదాంధ్ర దేశానికి సంబంధించిన ఒక చక్కని వ్యావహారిక భాషా శైలిని రూపొందించడంలో ఈ పత్రికలు చాలా వరకు కృతకృత్యమయ్యాయి. మొదట్లో దీన్ని 'ప్రజాశక్తి' భాష అని హేళన చేసిన వారు సైతం తర్వాత దీని విశిష్టత ఒప్పుకోక తప్పలేదు కమ్యూనిస్టు పత్రికల కన్నిటికి సంపాదకుడుగా పని చేసిన మద్దుకూరి చంద్రశేఖరరావుగారు ఇలాంటి శైలిని రూపొందించటంలో ప్రముఖపాత్ర వహించారు.

ఈ విధంగా భారత స్వాతంత్ర్య మహోదయం నాటికి తెలుగుపత్రికల్లో వ్యావహారిక భాషా పునః ప్రతిష్ఠాపన జరిగింది.

("మానవుణ్ని అధ్యయనం చెయ్యడం కళ ప్రయోజనం")



# న్యాయశాస్త్రం - భాష

క్రొవ్విడి నరసింహము

ఏ దేశంలోనైనా న్యాయశాస్త్రానికి మూలం ఆ దేశపు రాజ్యాంగం అయి యుంటుంది మన దేశంలో మన రాజ్యాంగం 1950 వ సం॥రం జనవరి 26 వ తేదీని అమలులోనికి వచ్చింది అందుచేత రాజ్యాంగంలోని నిబంధనల ననుసరించి మాత్రమే ఆతర్వాతచట్టాలను రూపొందించాలి, రాజ్యాంగంలోని 13 వ నిబంధన ప్రకారం రాజ్యాంగం అమలు లోకి రాని పూర్వం అమలులోనికి వచ్చిన ఏ న్యాయశాసనమైనా ప్రాథమికహక్కుల విభాగములోని నిబంధనలకు విరుద్ధముగా వుంటే అట్లు విరుద్ధముగానున్న ఆ శాసనంలోని భాగం చెల్లదు

మన రాజ్యాంగంలోని 17 వ విభాగం లోవున్న 343 వ నిబంధన ప్రకారం అధికారభాష దేవనాగరిలిపి కల్గిన హిందీ భాష అయితే రాజ్యాంగ అమలులోకి వచ్చిన 15 సం॥రా॥ల వరకు ఇండియన్ యూనియన్ అధికార కార్యకలాపాల కొరకు ఇదివరలోలాగే ఇంగ్లీషు భాష కొనసాగుతూ వుంటుందని కూడ ఆ నిబంధనలోనే చెప్పబడింది. కాని అనేక కారణముల వలన యిప్పటివరకు ఇంగ్లీషు భాషలోనే ముఖ్యంగా కార్యకలాపాలు సాగుతున్నాయి

ఇది యిలా వుండగా 348 వ నిబంధన ప్రకారం హైకోర్టులు, సుప్రీమ్ కోర్టుల లోని కార్యకలాపాలు యింగ్లీషు భాష లోనే ఉండాలని, పార్లమెంటులోను, శాసన సభలలోను ప్రవేశపెట్టబడిన బిల్లులు వాటిచే ఆమోదింపబడిన చట్టాలు, రాష్ట్రపతి, గవర్నర్లచే జారీచేయబడిన ఉత్తర్వులు, రూల్సు, రెగ్యులేషన్లు బైలాలు, అన్నియు ఇంగ్లీషు భాషలో నున్న ప్రామాణికంగా తీసుకోవలెనని చెప్పబడినది.

కాని రాష్ట్రపతి యొక్క సమ్మతి ముందుగా పొంది ఏ రాష్ట్ర గవర్నరు గాని అధికార వ్యవహారముల కొరకు హిందీ భాషనుగాని మరి యే యితర భాషనుగాని ఉపయోగింపవచ్చును. హైకోర్టులోని కార్యకలాపాల విషయాల్లో గూడా ఆ ప్రకారం చేయవచ్చును. ఆ

విధంగా చేసినప్పుడు కూడ వాటన్నిటికీ యింగ్లీషు తర్జుమా అధికారరీత్యా చేయ బడాలి. అట్లు చేయబడిన యింగ్లీషు తర్జుమానే ప్రామాణికంగా తీసుకోవాలని కూడ ఆ నిబంధన శాసించింది.

పై విషయాలను బట్టి మనం ఇంగ్లీషు భాషను విడనాడి మాతృభాషను న్యాయ శాస్త్ర విషయంలో చేబట్టుట ప్రస్తుత పరిస్థితిలో అత్యంత కష్టమని తోస్తుంది. అందునిమిత్తం రాజ్యాంగాన్ని కూడా అవసరమైన మేరకు సవరించవల్సి రావచ్చును.

న్యాయశాస్త్రం అనగానే న్యాయ నిర్వహణ వెంటనే గుర్తుకి వస్తుంది. నిజానికి న్యాయ నిర్వహణకూడా న్యాయ శాస్త్రంలో ఒకభాగమే. న్యాయనిర్వహణ లేని న్యాయశాస్త్రం నిరుపయోగం అవు తుంది మనిషికి మనిషికి మధ్య, మనిషికి ప్రభుత్వానికి మధ్య వుండవల్సిన సంబంధాలు, ప్రజలకు ప్రభుత్వానికి వున్న హక్కులు, బాధ్యతలు, వారు నిర్వహించ వలసిన కర్తవ్యాలు, అందు నిమిత్తం న్యాయ నిర్వహణ జరగవల్సిన తీరు మొదలైన అనేక విషయాలను న్యాయశాస్త్రం నిర్దేశిస్తుంది. న్యాయ శాసనాలను శాసనసభలు రూపొందిస్తే న్యాయనిర్వహణ న్యాయ స్థానాలు చేస్తాయి.

సమాజ పరిణామంలో అనగా న్యాయ వ్యవస్థ ఏదో ఒకరూపంలో ఉంటూ వచ్చింది. మార్పుచెందుతూ వచ్చిన సమాజాన్ని నడిపేందుకు న్యాయశాస్త్రం కూడా తదనుగుణంగా మారుతూ వచ్చింది. వ్యక్తిగత ఆస్తిని మానవుడు కలిగియుండుట మొదలైనప్పటి నుండి దానిని కాపాడేందుకుతగు ధర్మశాస్త్రం రూపొందింపబడుతూ వచ్చింది. ఆ ధర్మ శాస్త్రం అమలు జరిగేలా చూచేందుకు తగు సాధనాలు కావల్సివచ్చారు. బలవంతులు బలహీనులుకావల్సివచ్చాయి. బలవంతులు బలహీనుల శ్రమశక్తిని తమ స్వప్రయోజనాలకు వినియోగించు కొనుటకుగాను తమ కనుకూలమైన ధర్మ సూత్రాలతో కూడిన న్యాయ శాస్త్రం రూపొందించేవారు బలహీనులు తమ హక్కులకై పోరాటాలు జరిపినకొద్దీ కొంతవరకు వానిని కల్పిస్తూ ధర్మ సూత్రాలు మార్పు చేస్తూ వచ్చారు.

మన దేశంలో బ్రిటీషువారు అడుగు పెట్టే సమయానికి ఒకరకమైన పంచా యితీల వంటి న్యాయస్థానములు మరో న్యాయనిర్వహణ జరుపుతూ వుండినట్లు కన్పడుతుంది అప్పుడు సహజంగానే ప్రజలయొక్క మాతృభాషలతో న్యాయ శాస్త్రం వుంటూ ఆ భాషలోనే న్యాయ నిర్వహణ జరుపబడేది. అందుచే ప్రజలకు వారి వారి ఆచార్య వ్యవహారాలు, కట్టు బాట్లు, హక్కులు కర్తవ్యాలు సులభం గానే తెలియుటకు వీలుండేది

1781 వ సం॥రంలో మొట్టమొదటి సారిగా ఈ స్టయిండియా కంపెనీ వారిచే చేయబడిన బెంగాల్ రెగ్యులేషను అప్పటి వరకు మన దేశంలో అమలులో వున్న న్యాయ వ్యవస్థకు మొట్టమొదటి సారిగా దెబ్బ తీసింది. ఆ తర్వాత రామ రామ బ్రిటీషు ప్రభుత్వం మన దేశంలో వేళ్ళూనుకొని వారు చేసిన చట్టాలు శాస నాలై, వా రేర్పర్చిన న్యాయస్థానములచే

న్యాయ నిర్వహణ జరుపబడుతూ వచ్చింది అంతవరకు మనకు స్మృతులలో చెప్పబడిన హిందూ ధర్మశాస్త్రముకు తెల్లదొరలైన హైకోర్టు న్యాయమూర్తులు, ప్రీవీ కౌన్సిల్ ప్రభువులు భాష్యాలు చెప్పుచూ హిందూ ధర్మశాస్త్రం రూపొందించడం జరిగింది. ఈ పరిస్థితి హిందూ న్యాయ శాస్త్రములోని ముఖ్య అంశములను క్రోడీకరిస్తూ 1955వ సం॥రంలో హిందూ వివాహ చట్టము, 1956 వ సం॥రంలో హిందూ వారసత్వ చట్టము, మైనార్టీ మరియు గార్డియన్‌షిప్ చట్టము, దత్తత మరియు మనోవర్తి చట్టములను పార్లమెంటు తీసుకొన వచ్చే వరకు కొనసాగింది.

అయితే బ్రిటీషు పరిపాలన వలన స్వాతంత్ర్య సముపార్జనానంతరం కూడ ఆంగ్లో శాక్సన్ న్యాయ వ్యవస్థనే మనం అనుకరిస్తూ యున్నాము అంతేకాక న్యాయమూర్తులు, న్యాయవాదులు కోర్టులలో ధరించవల్సిన దుస్తుల విషయంలోను ఆఖరుకు న్యాయవాదులు న్యాయమూర్తులను సంబోధించే పద్ధతిలో కూడ యిప్పటికీ వారిని అనుకరిస్తున్నాము

న్యాయశాస్త్ర పదకోశము మాతృభాషలలోనికి తర్జుమాచేయుట అంత సులభమైన విషయం కాకపోవచ్చును. ఎందుకనగా తర్జుమా చేయుటలో 'పిలి' అనగా 'మార్జాలము' అన్న రీతి పొడ చూపుటకు ఎంతైనా ఆస్కారమున్నది ఇప్పటి పాఠశాలలలోను,కాలేజీలలోను,తెలుగులో తర్జుమాచేయబడిన గణితశాస్త్రము, విజ్ఞాన శాస్త్రము,చూచినచో మనకు ఈ విషయం స్పష్టపడుతుంది. వాటినిబట్టి తర్జుమాలో గ్రాంథిక భాషా పదాలే ఉపయోగించాలనే తహ తహ యిప్పటికీ కొంతమందిలో వున్నట్లు తోస్తుంది

హైకోర్టు, సుప్రీమ్ కోర్టులలో తప్ప మిగతా న్యాయస్థానములలో ఇదివరలోను యిప్పుడుకూడ ప్లెయింట్లు, రిటెన్ స్టేట్‌మెంట్లు. అఫిడవిట్‌లు, కంప్లెయింట్లు మాతృభాషలో దాఖలు చేసుకొనుటకు అవకాశముంది అయితే న్యాయ శాస్త్రము ఇంగ్లీషుభాషలోనే అభ్యసించుట చేతను, ఇంగ్లీషులోనున్న చట్టములే ప్రామాణికము లగుటచేతను న్యాయవాదులు కూడా చాలామంది సౌలభ్యము కొరకు దావాపత్రములన్నియు ఇంగ్లీషు భాషలోనే వ్రాసి దాఖలు చేయుట జరుగుచున్నది ఇందుకుతోడు ఎక్కువ కాపీలు కావల్సినచో ఇంగ్లీషు టైపుమిషన్లు ఉండనే వున్నవి. అయితే న్యాయస్థానములలో జరుపబడే కార్యకలాపాలు, సాక్ష్యములు చెప్పుట, క్రిమినల్ కేసులలో ముద్దాయీలను పరీక్షించుట మొదలైనవన్నీ మాతృభాషలోనే జరుగుతూ వుంటాయి. వాటిని మరల ఇంగ్లీషులోకి తర్జుమా చేస్తారు

"న్యాయ శాస్త్రము తెలియకపోవుట క్షంతవ్యంకాదు" అనే న్యాయ సూత్రము ప్రకారం ప్రతీ మనిషికి న్యాయ ధర్మములు తెలిసియుండాలి న్యాయ విరుద్ధ పని తెలియక నేరం చేశాను. అంటే ఎవరికీ శిక్ష తప్పించుకొనుట సాధ్యం కాదు. భారతీయశిక్షాస్మృతిలో అనేకవిధములైన నేరాలు నిర్వచించబడి అట్టి నేరానికి ఎంత శిక్షకు అర్హులుఅన్న విషయంకూడ పొందుపరుపబడినాయి. ఏయే పరిస్థితిలో

ఒక పని నేరం అవుతుంది అన్న విష యం ఆ నేరాలను నిర్వచించిన సెక్షన్లలో చెప్పబడింది ఆయా సెక్షన్లలో ఉపయోగించిన పదజాలమును బట్టి నిజంగా నేరం చేసిన వారికి కూడ శిక్ష పడకుండా తప్పించడానికి న్యాయవాదులు చేసిన వాదనలవలన అనేకపర్యాయములు వీలవుతుంది. దీనినిబట్టి చూస్తే ఏఏ పనులు చేస్తే నేరపరిధిలోకి వస్తాయో ఏవి రావో సామాన్య మానవులకు చదువు వచ్చినా, రాకపోయినా కూడ తెల్సుకోవడం కష్టము న్యాయ శాస్త్రం పర భాషలో నుండటంవల్ల మనకు ఈ అవస్థ పట్టిందని ముఖ్యంగా చెపాల్సి యుంటుంది.

పోతే మన రాజ్యాంగం శ్రేయో రాజ్యాన్ని నిర్మించడానికై రూపొందింప బడింది ముఖ్యంగా రాజకీయ, ఆర్థిక, సాంఘిక న్యాయం కల్పించాలని ఉద్దే శించింది పెరుగుతున్న జనాభాను దృష్టిలో పెట్టుకుని వారి అవసరాలను తీర్చాలంటే అనేక విషయాలలో ప్రభు త్వం జోక్యం చేసుకోవల్సి వస్తుంది. సంఘ ప్రయోజనాల నిమిత్తం ఒక్కొ క్కప్పుడు వ్యక్తిగత హక్కులను కుదించవల్సిన అవసరం కూడ కలుగుతూ వుంటుంది అందుకుగాను రాజ్యాంగం యిచ్చిన శాసనాధి కారాన్ని వినియోగించుకొని అనేక చట్టాలను రూపొందించడమేగాక వాటిని సక్రమంగా అమలు జరుపుటకు అనేక నిబంధనలు కూడ చేయవల్సిన అగత్యం కలుగుతూ వుంది. ప్రభుత్వ సంస్థల విషయంలోగాని ప్రయివేట్ సంస్థల విషయంలోగాని, వ్యాపార రంగంలో గాని, ముఖ్యంగా నిత్యావసర సరుకుల పంపిణీ విషయంలోగాని, బ్యాంకింగ్ వ్యవస్థ విషయంలోగాని, రైల్వేలు, కమ్యూనికేషన్లు, ప్రచార సాధనాలు విష యంలోగాని, బడుగు వర్గాలకు సహాయం చేసే విషయంలోగాని, ఒక్క ముక్కలో చెప్పాలంటే ప్రజలయొక్క దైనందిన కార్యక్రమాలకు సంబంధించిన అన్ని విషయాలలోను ప్రభుత్వం చట్టాలుచేసి, రూల్సు కూడ రూపొందించి సమాజ శ్రేయస్సు దృష్ట్యా జోక్యం చేసుకొనడం అవసరం అవుతోంది. శ్రేయోరాజ్య నిర్మాణానికి అట్లా చేయడం తప్పనిసరి అవుతుంది (అయితే అవి అమలు జరిగే తీరు సక్రమంగా వుందని నేనంటునట్లు మాత్రం సభాసదులు నన్ను అపార్థం చేసుకోవద్దని నా మనవి)

పైన చెప్పబడిన చట్టాల విషయంలో ఉదాహరణలు కూడ యివ్వడం భావ్యం అనుకుంటాను. పారిశ్రామిక వివాదాల చట్టం ఫ్యాక్టరీల చట్టం, గనుల చట్టం, శ్రామిక జన నష్ట పరిహార చట్టం వగైరాలు కార్మికులకు సాంఘిక న్యాయం చేకూర్చడానికి చేయబడినాయి. కౌలాదీ చట్టాలు భూమిని దున్ని బ్రతికే రైతుల శ్రేయస్సుకోసం చేయబడ్డాయి, బ్యాంకుల జాతీయకరణ చట్టం, జీవిత భీమా, సాధారణ భీమా జాతీయకరణ చట్టాలు ఆర్థిక న్యాయం దృష్టిలో పెట్టుకొని చేయబడ్డాయి. ఇటువంటి చట్టాలు వాటి క్రింద చేయబడిన నిబంధనలు అన్నీ సమాజంలోని వివిధ రకాల వృత్తులు చేసి జీవించే ప్రజలకు గల హక్కులు,

వారి కర్తవ్యాలు తెల్పుతూ ఆ విషయాలలో ప్రభుత్వ జోక్యం కంట్రోలు ఎంత వరకు వుంటుందో కూడ తెలియజేస్తాయి.

రోజురోజుకు చట్టాలు, నిబంధనలు తామరతంపరగా చేయబడుతున్నప్పుడు అవన్ని ఇంగ్లీషు భాషలోనే కొనసాగితే అవి కోట్లాది ప్రజలకు తెలియడం అసంభవం అని చెప్పాలి మన రాష్ట్ర ప్రభుత్వం తెలుగు భాషను అన్ని స్థాయిలలోను ప్రవేశపెట్టాలని ఉద్దేశించి అందు నిమిత్తం కమిటీని వేయడం సంతోషించవల్సిన విషయమే. అంతే కాకుండా చట్టాలను తెలుగు భాషలోనికి తర్జుమా చేయించుట కొఱకు మరొక కమిటీని కూడ వేసిన విషయం కూడ సంతోషదాయకమే అయితే యింత వరకు ఆయా విషయాలలో అభివృద్ధి చాలా తక్కువ అనే చెప్పాలి ఈ విధంగా నత్త నడకనడిస్తే ఎంత కాలానికి మనం గమ్యం చేరుకోగలమో అనూహ్యం.

ఇది యిలా వుండగా మన రాష్ట్రంలో విద్యాలయాలలో బోధనా భాషగా తెలుగును ప్రవేశపెట్టినా ఇంగ్లీషు భాష కూడా ప్రక్కనే వుండుటవలన తెలుగు భాషకు అంతగా ప్రాధాన్యత లభించటం లేదనే చెప్పాలి ఇంతకుముందే చెప్పినట్లుగా విజ్ఞానశాస్త్రంలోగాని, గణిత శాస్త్రంలోగాని వున్న ఇంగ్లీషు పదాలను తర్జుమా చేయడంలో క్లిష్టమైన గ్రాంధిక పదాలను ఉపయోగించడం వలన విద్యార్థులకుగాని, ఉపాధ్యాయులకుగాని నోరు తిరగడం కష్టం అవుతోందంటే అతిశయోక్తికాదు దానికి బదులు ఇంగ్లీషు భాషలోని అన్ని టెక్నికల్ పదాలను యథాతథంగా తెలుగు భాషలోకి తీసుకు రావడం మంచిదని నా అభిప్రాయం. అదే విధంగా న్యాయశాస్త్రములోని క్లిష్టమైన ఇంగ్లీషు లాటిన్ పదజాలాన్ని కూడ యధా యథాతథంగా తెలుగు భాషలోకి దింపడంవలన కొంత కాలానికి వ్యవహారిక తెలుగుభాషలో ఆ పదాలన్నీ యిమిడి పోతాయి అని నా దృఢమైన అభిప్రాయం.

నిజానికి యిప్పటికే న్యాయస్థానాలలోని కార్యకలాపాలలోను దావా పత్రములలోను అనేక పారశీక, ఇంగ్లీషు లాటిన్ పదాలు వ్యావహారిక తెలుగు భాషగానే వాడుకలో వున్నాయి మనము పారశీక పదాలు నిత్యభాషలోనే ఉపయోగిస్తూ వుంటాము పోతే 'రెస్‌జూడికేటా', 'యిస్టాపెల్', అలిబీ', 'బినామీ', 'ఇన్సాల్వెంటు', 'కాపీరైటు', 'డిక్రీ', 'ఎక్సపార్టీ' 'లైసెన్సు' 'మెన్సురియా', 'అలాైవైరిస్' వగైరా ఎన్నో పదాలు దావా పత్రాలలో తెలుగు భాషలో మిళితం చేసి వాడుకలో నున్నాయి. అటువంటి పదాలను మనభాషలోకి ఇముడ్చుకుంటే భాషాంతీకరణ సులభ సాధ్యమవుతుంది. అంతేగాని అర్ధంకాని కఠిన పదాలను తర్జుమా పేరుతో తీసుకువస్తే దానివలన ఎట్టి ప్రయోజనము ఉండదు

అందుచే సమాజంలోని ప్రజా సామాన్యం అందరికి అందుబాటులో వుండే విధంగా న్యాయశాస్త్రాన్ని పైన చెప్పిన సూచనతో ననుసరించి మరల

గ్రాహ్యమైన వాడుక భాషలో తర్జుమా చేయాలి. ఇకముందు చేసే చట్టాలు, నిబంధనలు వగైరా అన్నిటిని కూడ ఆ ప్రకారమే తర్జుమా చేయించాలి అట్లు తర్జుమా చేయబడిన చట్టాలు, నిబంధనలు వగైరా ప్రభుత్వ ప్రచార సాధనాల ద్వారా ప్రజలకు విరివిగా తెలియజేయాలి. ఆ విధంగా చేస్తే ప్రజలందరికి న్యాయశాస్త్ర సూత్రాలు స్థూలంగా తెలియడానికి ఆస్కారం వుంటుంది.

న్యాయశాస్త్రం ఒక భాషలోను న్యాయ నిర్వహణ మరొక భాషలోను ఉంటే అనేక చిక్కులు ఏర్పడతాయి. ప్రస్తుతం న్యాయ నిర్వహణ క్రింది స్థాయి న్యాయస్థానాలలో అరకొరగా వాడుక భాషలో జరుగుతున్నా, న్యాయశాస్త్రం యావత్తు వ్యవహార భాషలోనికి తర్జుమా చేయబడిన నాడు, న్యాయస్థానాలోని కార్యకలాపాలు హైకోర్టు స్థాయి వరకు కూడ తెలుగు భాషలో జరుపుటకు వీలుపడును అట్లు జరిగినప్పుడు మాత్రమే 'న్యాయశాస్త్ర అజ్ఞానము క్షంతవ్యంకాదు' అనే న్యాయ సూత్రంలో అర్థం వుంటుంది. ఒక దశాబ్దంలోనైనా న్యాయశాస్త్రం, న్యాయనిర్వహణ తెలుగు వ్యవహార భాషలో పూర్తి స్థాయిలో వస్తాయని ఆశిస్తూ శలవు తీసుకుంటున్నాను



# పత్రికా భాష

## రాంభట్ల కృష్ణమూర్తి.

ఒకటి

రమారమి నూటయాభై సంవత్సరాలుగా తెలుగు పత్రికలు వస్తున్నాయి అప్పటప్పటి అవసరాలకు తగినట్లు అప్పటికి తోచిన పద్ధతిలో వార్తలు ప్రచురించడమే కాని వార్తాపత్రికలకు ఒక నియత రీతంటూ ఏర్పడలేదు పత్రికా భాషను నిర్ణీతశైలిలో ప్రయోగించే పద్ధతి తెలుగులో ఏర్పడలేదు పత్రికారచన ఒక చేతిమీదుగా సాగే పనికాదు విలేకరులు, ఉప సంపాదకులు విశిష్ట వ్యాస రచయితలు, వ్యాఖ్యాతలు ఇలా ఎందరో కలిసి పనిచేస్తేనే పత్రిక బైటపడుతుంది అందువల్ల పత్రికా భాషకు నిర్ణీతశైలి అవసరం. ఇంగ్లీషులో ప్రతిపత్రికకూ నిర్ణీతమైన సొంతశైలి ఉంటుంది అమెరికాలో అసోసియేటెడ్ ప్రెస్సు వారు తయారుచేసిన శైలి పత్రాన్ని అక్కడి పత్రికలన్నీ అనుసరిస్తాయి. ఇప్పుడు తెలుగులో ఈనాడు పత్రిక తన సొంత శైలిని రూపొందించుకొనడానికి ప్రయత్నిస్తోంది

తొలుత తెలుగు పత్రికలు అప్పటి వ్యావహారికంలోనే వచ్చేవి మధ్యలో నాటి సాహిత్య శైలికి మళ్ళిపోయాయి. పత్రికా ప్రచారం బాగా వ్యాపించడం వల్ల పాఠకుల అభిరుచిని అనుసరించి కొసకు వ్యావహారికాన్ని అనుసరించక తప్పలేదు అయితే ఇప్పటి పత్రికా భాషను పూర్తి వ్యావహారికం అనడానికి వీల్లేదు అలాగని అది గ్రాంథికమూ కాదు అదో హైబ్రిడు భాష. దాని శరీరం వ్యావహారికం ఆత్మ గ్రాంథికం

పత్రికా రచన అంటే హడావుడిగా రాసిన సాహిత్యం అని ఒక నిర్వచనం ఉంది అంటే ఆశు కవితలాగే అది ఆశు రచన అన్నమాట. "ఆశు కవిత ఒకటి అవుపేద ఒకటి స్వయముగాను శుద్ధ చయము ధువిని!" అని పానుగంటివారు ఆశు కవితను ఎద్దేవా చేశారు ఆశు రచన అయిన పత్రికా భాషను కూడా ఇప్పుడు పండితులు అలాగే ఈసడిస్తున్నారు. పత్రికా భాషకు "దరిద్రభాష-దౌర్భాగ్య శైలి"అన్న ముద్దుపేర్లిచ్చారు ఏమయినా

పత్రికా రచన కూడా సాహిత్యంలో ఒక శాఖ. ఒక భాషలోని ఉదాత్త సాహిత్య మాతృకను బట్టి పత్రికా భాషా పుత్రిక పుడుతుంది. అదికన్న గొప్పగా అచ్చు ఉండాలని ఆశించడం అర్థరహితం.

పత్రికా భాష బాగులేకపోతే అది రచయితల అసమర్థతకు నిదర్శనం కావచ్చునేమోకాని అది రచనాదోషం మాత్రంకాదు -భావస్పష్టత లేనివారు పదిసార్లు తిరగరాసినా అది సాఫీగా సాగదు కావ్యభాషలోని కశ్మలం అంతా తెట్టుకట్టి ఆధు కవితలోనూ ఆధు రచన లోనూ తేలుతుంది అందుకు ఆధు రచయితలను నిందించి ప్రయోజనంలేదు వారికి ఆదిగురువులుగా వున్న సృజనాత్మక రచయితలది ఆ దోషం.

## రెండు

ఏ భాషలో అయినా కవిత ఆఖువుగానే పుడుతుంది వాస్తవ జగతులోని విశేషాలూ సంఘటనలూ మనసుమీద ముద్ర వేయగా ఆ ముద్రలకు మాటల్లో కట్టిన బొమ్మలే కవితగా రూపొందుతాయి అలాంటి మాటల బొమ్మే 'మానిషాద శ్లోకం హోమరు వర్సలు వాల్మీకి తిరిగ్గా కూచ్చుని తుడుపులూ కొట్టివేతలతో కవిత అల్లినట్లు ఎక్కడా దాఖలాలేదు, ఆధు కవితకు ఆలంబనం జన వ్యవహారం. జన వ్యవహారానికి మూలం సాముదాయకత, "సాంమనస్యం". సాముదాయకతను సాంమనస్యాన్ని శాసించేది మంది కట్టడి, వేదకాలంవారు దీనికి "ఋతం" అని పేరు పెట్టారు. "సంజానీధ్వం సంపృచ్యధ్వం సంవోమనాం సి జానతాం.... సమానో మంత్రః సమితిః సమానా సమానంవ్రతం సహచిత్తమేషాం"అవి ఆ రోజుల్లో అంతా కలిసికట్టుగా పనిచేసుకు పోయేవారు. ఈ కలిసికట్టుతనం ఎవరికి ఇష్టంవున్నా లేకపోయినా పత్రికా రచయితలకు తప్పదు.

భాషను తయారుచేసేది జనం. జనం తాము చూసినవాటికీ చేసినవాటికీ పేర్లు పెట్టుకుంటారు, ఆ పేర్లను గుదిగుచ్చి తమ ఆలోచనలనూ ఊహలనూ అదే మోతాదులో ఎదుటివారికి బట్వాడా చేస్తారు అది కవిత అయినా కావ్యమైనా రోజువారీ సమాచారం అయినా ఈ పద్ధతి లోనే జరుగుతుంది. ఇలాంటి బట్వాడాకే కమ్యూనికేషను అని పేరు అందువల్లనే ఇప్పుడు పత్రికారచనను కమ్యూనికేషన్ అంటున్నారేకాని జర్నలిజం అని పిలవడం లేదు ఆది కాలపు కమ్యూనికేషనుకు "ఋతం"లాగే నేటి కమ్యూనికేషనుకు కూడా కట్టడి కావాలి అలాంటి కట్టడే పత్రికలవారు తయారుచేసుకునే శైలి పత్రం.

"మన భాషకు ఎక్స్‌ప్రెషను చాలదండీ. మనది చాలా పూర్ లాంగ్వేజండీ అన్న వ్యాఖ్యలు తరుచు పండిత మండలిలో వినపడుతూవుంటాయి నిజానికి ప్రపంచంలో మేధా దారిద్ర్యం ఊహా దారిద్ర్యాలున్నాయేకాని భాషా దారిద్ర్యం ఎక్కడాలేదు. నాగరిక భాషలనీ వైజ్ఞానిక భాషలనీ సంపన్న భాషలనీ ప్రపంచ భాషలనీ కొన్ని భాషలకు బిరుదులున్నాయి అనాగరక భాషలనీ ఆటవిక భాషలనీ

అలిఖిత భాషలనీ మరికొన్నింటికి పండితులు ముద్దుపేర్లు పెట్టారు. అయితే నాగరక భాషలో చెప్పగల ఎలాంటి భావాన్నయినా అలిఖిత భాషలో చక్కగా చెప్పవచ్చునని భాషాశాస్త్రజ్ఞులు నిరూపించారు. ఏ కొత్త భావాన్నయినా ఎంత జటిలమైన సమస్యనయినా ఒక వ్యక్తి తన మాతృభాషలో పరమ సమర్థంగా వ్యక్తీకరించగలుగుతాడు

మాతృభాష మాట్లాడేటప్పుడు ఎవరికీ తప్పులురావు కాని రాసేటప్పుడు మాత్రం తప్పులు కుప్పలుగా దొర్లుతాయి. ఇలా ఎందుకు జరుగుతుంది? మాట్లాడేటప్పుడు అది వ్యావహారికం ఉద్దిష్ట అర్థంలో అది ఎదుటి వారికి బట్వాడా కావాలి. రాసేటప్పుడు ఈ బట్వాడా దృష్టిలో ఉండదు. అక్కడ ఆత్మాశ్రయత ఆవరిస్తుంది అక్కడ వ్యక్తీకరణే ముఖ్యమనుకుంటారు అది తామాశించినట్లే అర్థాన్ని అందరికీ బట్వాడా చేస్తుందని భ్రమిస్తారు తమ చేతకానితనాన్ని పాఠకులమీద రుద్ది వారికిచదువు లేదనీ సంస్కారం లేదనీ భాషాజ్ఞానం కొరవడిందనీ నెపాలు మోపుతారు

## మూడు

మనం వ్యావహారికానికి విరుద్ధార్థంలో గ్రాంథికం అన్న మాట వాడుతున్నాం. దానికి సమానార్థకంగా అనువాద భాష అనే మరో పేరుంది ఒకప్పుడు యూరపు దేశాల్లో ఫ్రెంచిని సంస్కార భాషగా గౌరవించేవారు. చదువుకున్నవారూ ధనవంతులూ ఫ్రెంచి భాషలో మాట్లాడుకునేవారు. మాతృభాషలో మాట్లాడడం అసభ్యం, అనాగరకం అని భావించేవారు. అలాంటి వారిలో కొందరు సంస్కారులకు మాతృభాషలో రచనలు చేయాలనిపించినప్పుడు ఫ్రెంచిని అనుకరించేవారు ఫ్రెంచి భాషా సూత్రాలను తమ మాతృభాషకు అన్వయించి అలా తయారయిన హైబ్రిడ్ భాషలో రచనలు చేసేవారు. ప్రముఖ రష్యన్ నవలాకారుడు తుర్గెనీవ్ ఇలాంటి అనువాద భాషలోనే రచనలు చేశాడు ఈ అనువాద భాషలో రష్యన్ జనుల పలుకుబడిని చేర్చి దాన్ని కొంచెం జనం దగ్గరకు తెచ్చాడు పుష్కిన్.

తెలుగులో కూడా మనకు ఇలాంటి అనువాద భాషే కావ్యభాష అయింది. సంస్కృత భాషా సూత్రాల ప్రకారం తయారు చేసుకున్న తెలుగునే ప్రామాణిక కావ్యభాష అని మన పండితులు ముద్రవేశారు. ఈ సంస్కృతానువాద భాషకే వారు గ్రాంథికం అని పేరు పెట్టారు. అనాటి రచనలన్నింటికీ ప్రేరణ సంస్కృతం. ఆ సంస్కృతం ఆదిలోనే తెలుగు సాహిత్యాన్ని అచ్చు పోసేవారు. ఆధునిక శాస్త్రాల సాహిత్యాల అభివృద్ధి వల్ల విద్యా వ్యాప్తివల్ల సంస్కృతానికి బదులు ఇంగ్లీషు ప్రేరణ అయింది. ఈ కొత్త ప్రేరణతో వచ్చే భావాలను వ్యక్తపరచడం సంస్కృతానువాద భాషకు సాధ్యం కాలేదు. అందువల్ల ఇంగ్లీషు అనువాద భాషగా కొత్త గ్రాంథికం అవతరించింది. అయితే ఈ కొత్త గ్రాంథికం చూపులకు వ్యావహారికంలా కనిపిస్తుంది. కాని దాని ఆత్మ

మాత్రం గ్రాంథిక్కు, శీర్షికగా కూర్చుని తుడుపులూ దిద్దుబాట్లతో రాసే కథలు, నవలలు, పాఠ్య గ్రంథాలలోనే దిను, జరుగు, ఇమిడివుంది లాంటి మాటలూ యతద్దర్థక ప్రయోగాలూ కోకొల్లలుగా కనిపిస్తున్నప్పుడు, హడావుడిగా చేసే ఆశు రచన అయిన పత్రికా భాష దరిద్రంగా దౌర్భాగ్యంగా వుండడంలో ఆశ్చర్యం లేదు. పోతే పత్రిక రచయితలు కూడా అదే దౌర్భాగ్యపు అనువాదభాషలో రాస్తూ పత్రికా భాషకు పేర్లు పెట్టడం మాత్రం ఆశ్చర్యం.

## నాలుగు

తెలుగు పత్రికా రచయితలకు సరైన శిక్షణ లేకపోవడంవల్లా పత్రికలకు విశిష్ట శైలి పత్రాలు లేకపోవడంవల్లా ఆ భాష సరిగా పెరగలేదు. కాని కట్టుదులను సరిగా పాటిస్తే అచ్చమైన వ్యావహారిక తెలుగును సంపాదించే శక్తి ఒక్క పత్రికలకు మాత్రమే ఉందని కచ్చితంగా చెప్పవచ్చును. ఒకటి పత్రికలు సాముదాయక కృషి. అక్కడ సంపూర్ణసామరస్యంతో పని జరగాలి. రెండు పత్రికా రచన కమ్యూనికేషను.

పత్రికా రచనకు ప్రపంచ మంతటా కొన్ని కట్టుదులున్నాయి. వారికి కమ్యూనికేషనే ప్రధానం కాని భాషాచాపల్యం ఉండకూడదు. ప్రతి విశేషణమూ నామవాచకానికి శత్రువు. అయితే అయిదు రూపాయల భూరి విరాళం అనీ ఘోర అగ్ని ప్రమాదంలో ఒక కోడి మరణం అనీ కొన్ని శీర్షికలు పత్రికల్లో కనిపించే మాట నిజమే. ఇవి తెలియని తనంవల్ల వచ్చే లోపాలు. పిల్ల పిపాలో పడి ఒక శిశువు మరణిస్తే "పాపం పీపాలో పాప" లాంటి శీర్షికలు పెట్టే చాపల్యానికి కూడా అదే కారణం కొంపలకు అగ్గి అంటుకుంటే భస్మీపటలం, పరశురామ ప్రీతి లాంటి ప్రయోగాలకు కూడా భాషా చాపల్యమే కారణం. పత్రికా రచనలో వాక్యాలు తికమకగా వుండకూడదు. దీర్ఘంగా వుండకూడదు పదాలను స్పష్టమైన అర్థంలో వాడాలి సరళంగా సూటిగా క్లుప్తంగా చెప్పాలి వచ్చిన వార్తనిజానిజాలు తేల్చుకోవాలి అందులో వున్న వివరాలనుసరిచూసుకోవాలి.ఆ తరవాత విషయం చెడకుండా కుదించుకోవాలి

వార్తలో ఎవరు, ఏమిటి ఎప్పుడు, ఎక్కడ ఎందుకు ఎలాగ అనే ఆరుప్రశ్నలకు జవాబు ఉంటుంది ఇందులో అన్ని ప్రశ్నలకూ ప్రతి వార్తలోనూ జవాబు వుండకపోవచ్చు కూడా నేరాలకు సంబంధించిన వార్తల్లో ఎందుకు ఎలాగ అనే ప్రశ్నలకు జవాబు కోర్టులో మాత్రమే తేలుతుంది ఇందులో ప్రధానమైన ప్రశ్నలకు క్లుప్తమైన జవాబును వార్త లీడులోనే యివ్వాలనే నియమం కూడా వుంది. కావ్య నిర్మాతలు కూడా ఈ పద్ధతినే అనుసరించేవారు వార్తలోని లీడు లాంటి దాన్ని వారు కావ్య బీజం అనేవారు. మహాకవి కాళిదాసు మేఘ సందేశంలో "కశ్చిత్ కాంతా విరహ గురుణా" శ్లోకంలో అన్ని ప్రశ్నలకూ జవాబు వుంది. ఇప్పుడు పండితులంటున్నట్లు పత్రికా భాష నిజంగా దౌర్భాగ్య

శైలి అయితే పత్రికా మర్యాదనూ తూచ తప్పకుండా అనుసరించిన కాళిదాసునేం అనాలి.

## అయిదు

పత్రికా రచయితల్లాగే కాళిదాసుకు కూడా కమ్యూనికేషనుపద్ధతు లన్నీ తెలుసు అనాలి ఒక్క కాళిదాసుకేకాదు గొప్ప రచయితలందరికీ ఈ కిటుకు తెలుసు రచయితకు పత్రికా రచనలో అనుభవం వుంటే అది అతడి రచనలకు "కండ పుష్టి" నిస్తుందని లెవ్ తొల్‌స్తోయ్ అంటాడు యువ రచయితలకు పత్రికల్లో శిక్షణ చాలా ప్రయోజనకారి అంటాడు సోవియట్ నవలాకారుడు ఫెడిన్. పత్రికా శిక్షణను పోలింది సాహిత్యం లో మరొకటి లేదని ఆయన నమ్మకం

అసలు వార్త అంటే ప్రకృతికి సంబంధించిన సమాచారం ఎప్పన్నా దేశాల నుంచి వచ్చిన్న వృత్తులకు సంబంధించిన వృత్తాంతాలు రోజూ పత్రికలకు వస్తూ వుంటాయి. వాటి పూర్వాపరాలను అర్థం చేసుకుని వార్త లకింద మలిచి పాఠకులకు అందించవలసి వుంటుంది. ఆ విధంగా వారికి "లోక శాస్త్ర కావ్యాద్యవేక్షణ" తప్పనిసరి అవుతుంది దానికి తోడు తన భావాలను సూటిగా స రి ళ ంగా క్లుప్తంగా బట్వాడా చేయడం అలవాటు అవుతుంది ఇంతకన్న ర చ యి త కు శిక్షణ ఇంకేం కావాలి. అందువల్లనే ప్రపంచ కథకుడు చెహోవ్, మహా రచయిత మక్సింగోర్కీ పత్రికా రచనాను భవం తమ కెంతో ఉపకరించిందని చెప్పుకున్నారు "నీవు తుపాకీని వర్ణిస్తే కథలో అది ఎక్కడో ఒకచోట పేలి తీరాలి" అన్న సూ క్తి ని చెహోవ్ పత్రికానుభవంతోనే చెప్పాడు గోర్కీ తొలుత కవిత్వంలా వుం డే వచనం రాసేవాడు – మన పూర్వుల వృత్తగంధి వచనంలాగ. అది పదేళ్ల పాటు పీడలా పట్టుకుందంటాడు. కొసకు దాన్ని పత్రికా రచనానుభవంతో వదిలించుకున్నాడు.

## ఆరు

అందువల్ల నిజమైన జన వ్యవహార భాషను పు న రు ద్ధ రిం చి పుష్టిగల సాహిత్యం పుట్టడానికి తో డ్ప డే శ క్తి పత్రికా రచన క న్న ం త గా మరో ప్ర క్రి య లే దు కమ్యూనికేషను ధ్యేయంగా సమష్టి రచన ఒక్క పత్రికా రంగంలో మాత్రమే ఉంటుంది అరిగి పోయిన మాటలు, అనవసరం అయిన అన్యదేశ్య పదాలు ఒక ప్రాంతంలో తప్ప ఇతరత్రా అర్థంకాని శబ్దాలూ పత్రికలవాళ్ళు వాడరు. ఒకవేళ ఏదైనా మాటను తప్పనిసరిగా వాడవలసివస్తే దాని అర్థాన్ని వివరించి దానికి బహుళ ప్రచారం చేస్తారు బహుజనామోదం కల్పిస్తారు. తెలంగాణా ఆంధ్ర మహాసభ వారు తయారుచేసిన కార్యక్రమం, కార్యవర్గం, లాంటి మా ట ల ను పత్రికలే బహుళ ప్రచారంలో పెట్టాయి.

సంస్కృతానువాద భాషనీ ఇంగ్లీషు అనువాదభాషనీ తిరస్కరించి జన వ్యావహారికాన్ని పునరుద్ధరించే చారిత్రక బాధ్యత పత్రికలవారి మీద వుంది అయితే ఇప్పటికీ ఇంకా సంస్కృతానువాద భాషే వుండాలనివాదించే మహానుభావులున్నారు.

ఇంగ్లీషు అనువాద భాష కావాలనివాదించే వారు కూడా వుండి వుండవచ్చును అలాంటి వారికి పాదాలు ముందుకీ చూపులు వెనక్కీ వుంటాయి. ఈ బాపతు వారంతా ఎప్పుడో కథల్లో కలిశారు ఇప్పు డెవరైనా వుంటే వారు కూడా కథావశేషులవుతారు

తెలుగునకున్న వ్యాకరణ దీపం చిన్నది అని ఏనాడో అన్నారు చెళ్ళపిళ్ళ వారు. దీపమే కాదు తెలుగునకున్న నిఘంటు వెమ్మెకూడా చిన్నదే ఇంత వరకూ జనవ్యావహారిక నిఘంటువు మనకు లేదు. పత్రికలవారు ఎప్పటి కప్పుడు శైలిపత్రాలను, పదకోశాలను నిర్మించుకొనడం ద్వారా ఆ కొరతను కొంతవరకైనా తీర్చగలుగుతారు

ఈనాడు దినపత్రిక తనశైలిపత్రాన్ని తయారు చేసుకుంటోంది పత్రికారచనకు అవసరం అయిన పదకోశాన్ని నిర్మించు కుంటోంది పత్రికా రచయితల్లో సుశిక్షి తులు తయారయినప్పుడు, కమ్యూనికేష నుకు అనువుగా వారు జనవ్యావహారికాన్ని ఆకళించుకున్నప్పుడు పత్రికా భాష, పత్రికాశైలి తెలుగు సాహిత్యపుస్తకాలకు పాఠ్యగ్రంథాలకు మేలుబంతి అవుతుంది. ఒరవడి దిద్దుతుంది పత్రికా రచయితగా నాకా విశ్వాసం వుంది.



# భాషాశాస్త్రం

## డాక్టర్ అలెగ్జాండర్ డెమెతీవ్

రష్యన్, విదేశీ ప్రామాణిక సాహిత్యాన్ని కాచి వడపోసిన వ్లాదిమిర్ లెనిన్ ఎప్పటికప్పుడు ఆధునిక సాహిత్యాన్ని కూడ క్షుణ్ణంగా అధ్యయనం చేస్తూ వుండేవారు. రష్యన్ ప్రామాణిక గ్రంథాలనూ, సాహిత్యంలో చిత్రలేఖనంలో వాస్తవికతనూ ఆయన గాఢంగా అభిమానించారు.

సాహిత్యం విషయంలో యాంత్రికమయిన సిద్ధాంతాలు, సమానతా స్థాపన బొత్తిగా సాధ్యపడదని ఆయన నిశ్చితాభిప్రాయం. ఈ రంగంలో వ్యక్తిగత చొరవకూ, అభిరుచికీ, వూహకూ, కల్పనకూ, వస్తువుకూ, రూపానికి పూర్తి అవకాశముండాలని ఆయన అభిప్రాయపడ్డారు.

రూపం, శైలి, వర్ణనల్లో వైవిధ్యం లేని కళాసృష్టి అనూహ్యమని ఆయన స్పష్టంగా గ్రహించారు. వీటిని నియంత్రించ బూనుకోవడం సాహిత్యాభివృద్ధికి హాని చేస్తుందని ఆయనచెప్పారు. సాహిత్యానికి జీవిత సత్యం ప్రాతిపదికగా వుండాలన్నది ఆయన అభిప్రాయం.

సాహిత్యంలో కల్పన, సంకేత పద్ధతి, అత్యుక్తి మొదలయిన వాటిని కూడా ఆయన తిరస్కరించలేదు. ఎందుచేతనంటే కళా సాహిత్యాల్లో సత్యం నానా విధ రూపాల్లో అభివ్యక్తం చేయబడుతుందని ఆయన ఎరుగుదురు.

అయితే బహానా కళను ఆయన ఎల్లప్పుడూ నిరసించారు. ఇది లక్ష్యశుద్ధి లేకుండా రూపంలో చెలగాటం, రీతివాదపు గారడీ, వాస్తవ స్థితికి అర్థంపర్థం లేని వక్రీకరణ, క్షీణత మాత్రమేనని ఆయన అభిప్రాయపడ్డారు. "పాత కళ" లనే దానికి కాలదోషం ఏ మాత్రమూ పట్టలేదని, నిజమైన నమూనాగానూ, నిజమైన సౌందర్యానికి ప్రతీకగానూ దానికి గల ప్రాముఖ్యం యదాతథంగానే వుందని ఆయన భావించారు.

సోషలిస్టుకళా, సాహిత్యాలు, జాతీయ ప్రపంచ సంస్కృతి సాహిత్యాలయొక్క అత్యుత్తమ సంప్రదాయాలు, విజయాలతో ముడిపడి వున్నవని ఆయన భావించారు. విప్లవ నాయకుడు, కొత్త పుంత దేన్నయినా సరే వ్యతిరేకించే వారి నుంచీ, "విప్లవకళ" అనే ముసుగులో ప్రజలకు విరుద్ధమయిన భావాలు, కళా రూపాలను ప్రచారంలో పెట్టే వారినుంచీ కూడా సోవియట్ సంస్కృతిని కాపాడవలసి వుంటుందని ఆయన బోధించారు.

కళ, దాని ప్రయోజనానికి దీటుగాగలదిగా వుండాలని ఆయన చెప్పారు. గోర్కీ చెప్పినట్లు "మానవుణ్ని అధ్య

యనం చేయటం" కళ ప్రయోజనమని ఆయన అన్నారు.

సామాజిక, ఆర్థిక సంబంధాలను అధ్యయనం చేయటం ఎంత ముఖ్యమో వివిధ వర్గాల, సామాజిక బృందాల యొక్క ప్రతినిధుల మనోభావాలనూ చిత్తవృత్తులను, అలవాట్లను, అశయాలను, మనస్తత్వాన్నీ గ్రహించటం కూడా అంత ముఖ్యమని ఆయన విశ్వసించారు.

వాస్తవాన్ని అధ్యయనం చేసేందుకు కాల్పనిక సాహిత్యం ప్రాముఖ్యాన్ని ఆయన గ్రహించారు. ఆయన దాన్ని ప్రజల ఆత్మిక, బౌద్ధిక ప్రబోధానికి ఒక ఫలప్రదమైన సాధనంగా ఎంచాడు. దాన్ని పురోగామి, విప్లవకర, ఉదాత్త మానవతావాద భావాల భాండాగారంగా పరిగణించారు

వాస్తవాన్ని అధ్యయనం చేసేదిగానూ, సామాజిక జీవితానికి సంబంధించిన అతి ముఖ్య సమస్యలను ముందుకు తెచ్చేదిగానూ వున్నందునా, భూజానిస బూర్జువా వ్యవస్థ మౌలిక ప్రాతిపదికలను విమర్శిస్తున్నందునా, ప్రజల ప్రయోజనాలకు అండగా నిలబడుతున్నందునా ఆయన రష్యన్ ప్రామాణిక సాహిత్యాన్ని ప్రశంసించారు. ఆయన లియో టాల్‌స్టాయ్ గురించి యిలా రాశారు "ఆయన బ్రహ్మాండమైన సమస్యలను లేవనెత్తడంలో, కళాశక్తిలో అత్యున్నత శిఖరాల నందుకోవడంలో కృతకృత్యులయ్యారు. ఆయన రచనలు ప్రపంచ సాహిత్యంలో అత్యున్నత శిఖరాల నందుకొన్నాయి

లెనిన్ దృష్టిలో సాహిత్యం యొక్క సామాజిక విలువా, దాని కళాస్థాయీ అవిభాజ్యమైనవి

లెనిన్ అభిప్రాయం ప్రకారం నిర్దిష్ట లక్ష్యాలు పార్టీ సాహిత్యంపై వైటనుంచి రుద్దినవి ఎంతమాత్రం కావు అవి పార్టీ దృక్పథాన్ని, సరళిని, నీతి నియమాలు, సౌందర్యమూ గురించిన దాని భావనలను స్వేచ్ఛగా వ్యక్తం చేస్తాయి. పార్టీ సాహిత్య సూత్రమేమంటే, పార్టీ సాహిత్యకారుడు కమ్యూనిస్టు భావాలను సంపూర్ణంగా జీర్ణించుకోవాలి. అది అతడి విశ్వాసంలో, చైతన్యంలో అంతర్భాగం కావాలి వాటిని మార్గదర్శకంగా వుంచుకొని అతడు స్వేచ్ఛగా సాహిత్యాన్ని సృష్టించాలి

లెనిన్ అభిప్రాయం ప్రకారం కళ విషయంలో పార్టీ సూత్రం అతి ముఖ్యమైనదే అయినప్పటికీ కళాత్మక కృషి విషయంలో దాని పోషణ పాత్రను ఆయన ఏనాడూ నిరాకరించలేదు. ఆయన దృష్టిలో ప్రపంచ సాహిత్యం, విజ్ఞాన, సౌందర్య ఖని. అది మనిషికి శక్తినీ, ఆత్మ గౌరవాన్నీ, వాస్తవికత యొక్క హేతుబద్ధ పరివర్తనలో విజ్ఞతనూ ప్రసాదిస్తుంది.



# కళ గురించి లెనిన్ అభిప్రాయాలు

"అయితే, మనం కమ్యూనిస్టులం, అందుకని అవ్యవస్థను యథేచ్ఛగాసాగిపో నివ్వరాదు ఈ క్రమాన్ని మనం, రూపొందించుకున్న ఒకపథకం ప్రకారం నడపాలి దాని ఫలితాలకు రూపకల్పన చేయాలి. అయితే, మనం దీనికి ఇప్ప టికీ దూరాన చాలా దూరాన వున్నాం మనం చిత్రలేఖనం విషయంలో మరీ విపరీతమైన "విగ్రహ విధ్వంసకులం " సుందరమైనదాన్ని కాపాడాలి, "పాత దైనా" సరే దాన్ని ఒక వుదాహరణగా స్వీకరించాలి నిజంగా సుందరమైనదాని పట్ల మనం ఎందుకు విముఖత చూపాలి. కేవలం పాతది అనే కారణాన దాన్ని ఎందుకు విసర్జించాలి? కొత్తదాన్ని దైవంలా ఎందుకు ఆరాధించాలి "కొత్తది" అయినంత మాత్రాన్నే దాని ముందు మోకరిల్లాలా? ఇది అర్థరహితం, తెలివి తక్కువతనం, కేవలం అర్థ రహితం దీనిలో అచ్చమైన కపట నాటకం ఎంతో వుంది, పశ్చిమ దేశాలలో ప్రబలంగా కళా సంబంధమైన ఫ్యాషన్ల పట్ల మనకు తెలియకుండానే మనలో వున్న గౌరవభావం కూడా వుందని వేరే చెప్పనవసరం లేదు. మనం మంచి కమ్యూనిస్టులమే కాని ఎందుచేతనో మనం ఆధునిక కళకు దీటురాగలమని" కూడా రుజువు చేసుకోవాలనుకొం టున్నాం. కళాత్మక ప్రతిభ అత్యున్నత వ్యక్తీకరణ అయిన వ్యక్తీకరణవాదం, ఫ్యూచరిజం మొదలైనవి నాకు అంతు పట్టవు. నాకని అర్థంకావు అవి నాకు ఆనందం కలిగించవు "అయితే కళ గురించి మన అభిప్రాయం అంత ముఖ్యంకాదు కొన్ని కోట్ల జనాభాలో కొన్ని వందలమంది. లేదా కొన్ని వేల మంది దృష్టిలో కళ అంటే ఏమిటనేది కూడా అంత ముఖ్యమైన విషయంకాదు కళ ప్రజల సొత్తు అది శ్రామిక ప్రజా బాహుళ్యంలో లోతుగా వేళ్ళూనివుండాలి అది వారి భావాలను, ఆలోచనలను, సంకల్పాన్ని ఏకం చేయాలి, సమున్నతం గావించాలి అది వారిని సంచలింప చేయాలి, వారిలోని కళను పెంపొందిం చాలి

కార్మిక కర్షక ప్రజా బాహుళ్యం సామాన్యమైన నల్లరొట్టెకోసం అంగ లార్చుతుండగా మనం కొద్ది మందికి అపురూపమైన మిఠాయిలు కుడవబెట్టాలా? కింది మాటలను మనం అక్షరాల మాత్రమేగాక, అలంకారికంగా కూడా అర్థం చేసుకోవాలని వేరే చెప్పనవసరం లేదు. మన మెల్లప్పుడూ కార్మిక, కర్షకు లను దృష్టిలో వుంచుకోవాలి. వారికి సంతృప్తి కలిగించడం నేర్చుకొని తీరాలి ఇది కళా, సాంస్కృతిక రంగా నికి సైతం వర్తిస్తుంది.

# సాంఘిక శాస్త్రీ పాఠ్యగ్రంథాలు (డిగ్రీస్థాయి) భాష

కొత్తపల్లి కేశవరావు

అధిపతి, చరిత్ర & రాజనీతి శాఖ, ఆంధ్ర లయోలా కళాశాల.

## ఉపక్రమణిక

ఈ పత్రానికి ఆధారం మూడు అభ్యూహాలు:

1 తెలుగులో గ్రాంథిక-వ్యావహారిక భాషా వివాదము శిష్ట వ్యావహారిక భాషకు అనుకూలంగా పరిష్కారమయింది.

2 ఉన్నత విద్యారంగంలో కీలకమైన డిగ్రీస్థాయి ప్రమాణాల పెంపుదలకు మాతృభాషా మాధ్యమాన్ని హృదయపూర్వకంగా అంగీకరిస్తూ, దాన్ని సరియైన సాధనంగా రూపొందించడానికి ప్రభుత్వం అన్ని వర్గాల ప్రజలు సిద్ధంగా ఉన్నారో, లేదో తేల్చుకోవలసిన సమయం వచ్చింది

3. మాతృభాష ద్వారా సాంఘిక శాస్త్రాధ్యయనం సమాజ పరివర్తనా సాధనంగా పరిణమించటం అవసరం

## ఉన్నత విద్యలో డిగ్రీ స్థాయి

మనకు స్వాతంత్ర్యసిద్ధి కలిగిననాటి నుండి అభివృద్ధి చెందిన రంగాలలో ఉన్నత విద్య ఒకటి. అయితే దాని అభ్యున్నతి గుణాత్మకం కాదు, సంఖ్యాత్మకం ఆంధ్రప్రదేశ్, దేశంలోని ఉన్నత విద్య విషయంలో అనేక ప్రాంతాలతో పోల్చినప్పుడు, సంఖ్యాత్మకంగా కూడ వెనుకబడే ఉన్నది[1]

కొఠారీ కమీషన్ నివేదిక 1966 లో మన ఉన్నత విద్యారంగ సమస్యల్ని గురించి విమర్శనాపూర్వ అభిప్రాయాల్ని వెలిబుచ్చింది ప్రత్యేకంగా అనేక కళాశాలల్లో విద్యార్జన బోధన ఎటువంటి నిరుత్సాహజనకమైన పరిస్థితుల్లో కొనసాగుతుందో ఆ నివేదిక బహిర్గతం చేసింది విద్యార్థులు తమకు సరిగా అర్థం కాని (ఆంగ్ల) భాషలో ఉపన్యాసాలు, వినటానికి ఏదైనా భారతీయభాష బోధనా మాధ్యమంగా ఉంటే సరియైన పాఠ్య పుస్తకాలు, పరామర్శగ్రంథాలు లేక పడే బాధలను వర్ణించింది[2] కొఠారీ కమీషన్ నివేదిక ఉటంకించిన పరిస్థితుల్లో నేటికీ గణనీయమైన మార్పు రాలేదు.

ఇతర కారణాలవలన కూడ మన డిగ్రీస్థాయి విద్యా ప్రమాణాల్ని పెంచ

వలసిన ఆవశ్యకత ఇతోధికమైంది. నిరుద్యోగ భయం కూడ సమాజంలోని వివిధ వర్గాలకు చెందిన విద్యార్థులను కళాశాలలకు ఎగబ్రాకకుండ చేయలేకపోతోంది. వారిలో అనేకులకు డిగ్రీ చదువు అనుసంధానదశగాకాక అంతిమ స్థాయిగా పరిణమిస్తున్నది. 'విద్య' అంటే అధ్యాపకుల బోధన కాదు విద్యార్థుల స్వయం విజ్ఞానాన్వేషణ, విద్యాసంస్థల ఆవరణంలో, గడువులలో నియమిత గురువుల ద్వారా మాత్రమే కొనసాగేది కాదు,' విద్య జీవితంలో ఒక దశకు పరిమితంకాదు, అది జీవితపర్యంతం కొనసాగవలసినది' మొదలైన నూత్న భావాలెన్నో క్రమేపీ వ్యాప్తి చెందుతున్నాయి. అనుభవపూర్వకంగా సమస్యాత్మకంగా, వీలైనమేరకు ప్రాయోగికంగా నేర్చు నేర్పవలసిన అంశాలు నానాటికీ పెరుగుతున్నాయి కాని ప్రభుత్వ భాషా విధానం, ఉపాధి కల్పనా విధానం ఒకవంక ఆంగ్లభాషపై ప్రజల వ్యామోహాన్ని తగ్గించలేని స్థితిలో మరొకవంక ఆ భాషాధ్యయన ప్రమాణాన్ని మెరుగుచేయలేని స్థితిలో నున్నాయి. కాగా నేర్పవలసిన విద్యకూ, నేర్చుకొనేవారి శక్తికీ మధ్య పెరుగుతున్న అంతరాన్ని తగ్గించే ఉపాయాలలో మాతృభాషా మాధ్యమానికి మించినది లేదు.

**డిగ్రీ స్థాయిలో సాంఘిక శాస్త్రాలు**

ఇంక డిగ్రీస్థాయిలో సాంఘిక శాస్త్రాధ్యయన విషయంలో ప్రబలిన దురభిప్రాయములను దురాచారములను గురించి ప్రస్తావించక తప్పదు. జాతీయ ప్రభుత్వం 1947 తర్వాత ఈ శాస్త్రాలకు ఆర్థికాభివృద్ధిలో, సమాజపరిష్కరణలో గల ప్రాధాన్యాన్ని కొంతవరకు గుర్తించినప్పటికీ వాటి వికాసానికి తగిన వనరులను కేటాయించలేదు. భారత సాంఘికశాస్త్ర పరిశోధనా మండలి నియమించిన సమీక్షా సంఘ నివేదిక ప్రకారము అన్ని ప్రకృతి విజ్ఞాన, సాంకేతిక, వ్యావసాయిక, వైద్య శాస్త్రాలలో పరిశోధనకు రూ 2500 కోట్లు ఖర్చు చేసిన ప్రభుత్వం సాంఘికశాస్త్రాలలో పరిశోధనకు 2½ కోట్లు మాత్రమే ఖర్చు చేసింది.[4] ఆ నివేదిక వచ్చిన పిమ్మట సాంఘికశాస్త్రాల పరిస్థితి, విశ్వవిద్యాలయాల స్థాయిలో మెరుగయినా కళాశాలల స్థాయిలో దాదాపు ప్రగతి శూన్యంగానే ఉన్నది. విశ్వవిద్యాలయాల్లోని సాంఘిక శాస్త్ర శాఖలకు కళాశాలల్లో ఆశాస్త్రాలను బోధించే అధ్యాపకుల పట్ల చిన్న చూపు. డిగ్రీ అధ్యయన ప్రణాళికల్లో రావలసిన మార్పులను సకాలంలో తేవటానికి వాటికి అనుగుణంగా కళాశాలోపాధ్యాయులకు తగిన శిక్షణ ఇవ్వడానికి చాల విశ్వవిద్యాలయ శాఖలు ముందుకు రావటం లేదు. ముఖ్యంగా కళాశాలోపాధ్యాయులు, విద్యార్థులు తరగతి గోడల్ని దాటి బయట ప్రపంచంలోకి వెళ్లి, అక్కడ సామాజిక సంస్థలను ప్రజాసమస్యలను, ప్రభుత్వ విధానాల అమలును ప్రత్యక్షంగా అధ్యయనం చేయటానికి తగిన కౌశలాలను పెంపొందించుకొనునట్లు చేసే బాధ్యతను అవి విసర్జించాయి. వాటి వైఖరి అట్లా ఉంటే, కళాశాలల యాజమాన్యాలు

సామాన్యంగా సాంఘికశాస్త్ర అధ్యయనానికి కావలసినవి కుర్చీలు, బల్లలు మాత్రమేనన్నవైఖరిని ప్రదర్శిస్తుంటాయి కళాశాలల గ్రంథాలయాల్లో ఆయా సాంఘిక విజ్ఞాన విభాగాలపై తగినన్ని పుస్తకాలు, పత్రికలు ఉండవలసిన అవసరాన్నికూడ గుర్తింపవు. విజ్ఞాన తృష్ణ గల అధ్యాపకులు తమ అర్హతలను పెంపుచేసుకొనుటకు విశ్వవిద్యాలయ గ్రాంట్లసంఘం, రాష్ట్ర ప్రభుత్వం వంటివి వీలుకల్పించినా వాటిని వినియోగించుటకు ఎన్నో అడ్డంకులు కల్పిస్తాయి. అట్టి యాజమాన్యాలకు తగ్గట్టు హెచ్చుమంది సాంఘికశాస్త్రవ్యాపక సోదరులు అధ్యయన ప్రణాళికల్లో తీవ్ర మార్పులను హర్షించరు, వచ్చిన మార్పులకు అనుగుణంగా విజ్ఞానార్జన చేయరు. సాధ్యమైనంతవరకు నలిగిన పాఠాలు వాడుక రీతిలో చెప్పుకుపోవడంతో సరిపుచ్చుకుంటుంటారు. సాంఘిక శాస్త్రాలను అభ్యసించే విద్యార్థుల మేధోస్థాయి ఇటీవలకాలంలో పడిపోవడం అధ్యాపకుల ఉదాసీన వైఖరికి మద్దతుగా పరిణమిస్తున్నది. అల్పకృషితో పట్టభద్రులు కావాలనే దృష్టి వారిలో అధిక సంఖ్యాకుల 'గెస్టుండగా గురువులతో పని ఏమి' అని భావించువారు రోజువారీ పాఠాలకు బదులు చివరలో పరీక్షప్రశ్నలు చెప్పితే చాలదా' అనుకొనే వారు వారిలో కొల్లలు.

వారందరూ కల్పించే వాతావరణంలో సాంఘికశాస్త్రాధ్యయన లక్ష్యాలు ప్రయోజనాలు మరుగున పడ్డాయంటే ఆశ్చర్యమేముంది? కాగా మన మధ్య సగటు మానవుడు తన్ను తాను, తోటిమానవులతో తన సంబంధాలను, వాటి వ్యవస్థిత రూపాలైన సాంఘిక సంస్థలను అవగాహన చేసుకొనుటలో, వైయక్తిక సాంఘిక జీవితాలలో ఎదురయ్యే సమస్యలకు పరిష్కారాలను అన్వేషించి అమలు చేయుటలో అంటే ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, తదితర రంగాలలో తన పాత్రను నిర్వహించుటలో విఫలుడౌతున్నాడు. పైగా మానవుడు స్వప్రయోజన సాధనలో మునిగి తేలుతున్నాడు. ఈ పరిస్థితులకు వెనుక నిస్వార్థులైన విజ్ఞానధనులందరకూ విదితమే. అసమర్థనీయమైన అవమానత్వాలు కల్పించే వైరుధ్యాలు, అధిపత్యాలు కల్గించే దోపిడీలు, దౌర్జన్యాలు లేని సమాజ స్థాపన ఆ నవ సమాజంలో సహజంగా వ్యక్తి శ్రేయోసాధనకు గాక సర్వజన సౌఖ్య ప్రగతికి ప్రాధాన్యం లభిస్తుంది. దానిలో వైవిధ్యాన్ని గౌరవించే సంఘీభావం, ప్రత్యేకతల్ని గుర్తించే సమిష్టి జీవితం పుష్పిస్తాయి. అందుకు అవశ్యకమైన చైతన్యీకరణం సరియైన సాంఘిక విజ్ఞానార్జన ద్వారానే సాధ్యం. ఆ వైజ్ఞానిక కృషికి ప్రజలు లక్ష్యమైన మేరకు ప్రజల భాషయే తగిన సాధనం.

### సాంఘిక శాస్త్రాలపై పుస్తక రచన, ప్రచురణ

ఉన్నత విద్యాస్థాయికి తగ్గ సాంఘిక శాస్త్ర గ్రంథాలను రచించుటలో ప్రచురించుటలో గల సమస్యలు అనల్పమైనవి. సాంఘిక విచారణ సంప్రదాయము

లేని మన సమాజంలో సాంఘికశాస్త్ర విషయాలు సామాన్యంగా ప్రాథమిక పఠనస్థాయిని దాటిపోవు. ఏ పాటి పరిశోధన జరిగినా, అది కనుగొన్న యథార్థాలు, విధించిన సామాన్యీకరణములు పాఠ్య గ్రంథాలలోనే ఎక్కడానికి ఎంతో జాప్యం అవుతున్నది అందుచేత అంగంలో ఉన్న డిగ్రీస్థాయి పుస్తకాలలో ఉపజ్ఞత, దేశీయత సాధారణ్యంగా లోపిస్తాయి ఆయా విషయాలపై ప్రామాణిక విదేశీ గ్రంథాలకు నకళ్ళు, అనుకరణలు, క్రోడీకరణలు చెలామణిలో ఉంటున్నాయి మన రాష్ట్ర విశ్వవిద్యాలయోపాధ్యక్షులు 1970 సెప్టెంబరులో డిగ్రీస్థాయి విద్యాబోధన తెలుగులో జరగాలని నిర్ణయం చేసినప్పుడు, స్వభాషలో తగిన డిగ్రీ తరగతి పుస్తకాలు వ్రాయటానికి బోధనానుభవజ్ఞులైన ఉపాధ్యాయులను తెలుగు అకాడమీ ఎన్నిక చేసింది. రచయితలకు పుస్తక రచనలో సలహాలివ్వడానికి, వారు వాడిన భాషను సరి చేసే దానికి మెరుగులు దిద్దడానికి పుస్తక సంపాదకులు, అకాడమీ ఉద్యోగులు చేసిన శ్రమ మొత్తం మీద ప్రశంసార్హం తయారైన వ్రాత ప్రతులను ముద్రింపించి డిగ్రీ విద్యార్థులకు అందుబాటులో ఉన్నా, అకాడమీకి గిట్టుబాటు అయిన ధరలకు అమ్మటం సమస్యే ఇంతా చేస్తే డిగ్రీ విద్యార్థులకు అకాడమీ ప్రచురణలు తప్ప, తెలుగులో ఇతర పాఠ్య గ్రంథాలంతగా లభ్యం కాలేదు. ఇందుకు సంబంధించిన రాష్ట్ర ప్రభుత్వ విధానాలలోని గందరగోళంవలన ప్రైవేటు కంపెనీలు తెలుగులో డిగ్రీస్థాయి సాంఘిక విజ్ఞాన గ్రంథాలు విరివిగా ప్రచురించటానికి పూనుకోలేదు.[7] అన్నిటికీమించి, సాంఘిక విజ్ఞాన గ్రంథాలలోని అంశాలు, శైలి అల్ప ప్రేరణంగల సాంఘికశాస్త్ర విద్యార్థులను ఆకట్టుకోగలిగినవిగా ఉన్నాయా అను ప్రశ్న వేసుకోక తప్పదు అవి వివిధ ప్రసార ప్రజాసంసర్గ సాధనాలతో పోటీ చేయవలసిన పరిస్థితిని తక్కువగా అంచనా వేయలేము

## సాంఘిక శాస్త్ర గ్రంథాలలోని భాష

డిగ్రీస్థాయి సాంఘికశాస్త్ర గ్రంథాలు మాతృ ప్రాంతీయ భాషలో వ్రాయటం అధికార ముద్రకు నోచుకోకముందే శిష్ట జనసమ్మతం అయింది. స్వభాషా పునరుద్ధరణ విదేశీ పాలనలో క్రగ్గిన ప్రజల ఆత్మాభిమాన వర్ధకం దాని వికసన అట్టి సమాజంలోని శిష్టులకు సామాన్యులకు గల అఖాతాన్ని తగ్గిస్తుంది. ప్రజలకు ఆధునిక విజ్ఞానాన్ని అందుబాటులోకి తేగలదు. మాతృభాష ద్వారా విద్యార్థులు నిశితంగా ఆలోచించగలరు, సులువుగా విద్యార్జన చేయగలరు. విదేశీ మాధ్యమాన్ని ఆశ్రయించినప్పటివలే శాస్త్ర విషయాలను మననం చేసుకోనకుండా మెదడులో కుక్కుకొనవలసిన అవసరం వారికి ఉండదు.[8]

అయితే డిగ్రీస్థాయితో సహా ఉన్నత విద్యారంగంలో, ప్రమాణాలు పెంపొందించే విధంగా, మాతృభాషా మాధ్యమాన్ని ప్రవేశపెట్టుటలో గల చిక్కులను గుర్తించాలి. వివిధ అభివృద్ధి దశలలో గల సాంఘిక విజ్ఞానశాస్త్రములకు

గిన పారిభాషిక పదజాలాన్ని తయారు చేసుకొనటం, ఆ పదజాలం ప్రస్తుత వ్యాఖ్యానావసరాలకే గాక, మున్ముందు ర్పడగల విస్తృత విశ్లేషణావసరాలకు సరిపోవునట్టిదిగా రూపొందించటం సంఘటిత కృషిని కోరే కార్యాలు. పేదరికం వంటి ప్రజల సమస్యలను వారితో సన్నిహిత సంబంధాలు ఏర్పరుచుకొనుట ద్వారానే సరిగా అవగాహన చేసుకోగలం, అవినీతి వంటి చిక్కు సమస్యలను ప్రజల ఆర్థిక, విజ్ఞాన, నైతిక స్థాయిలను పెంచటం ద్వారానే పరిష్కరించగలం అని గుర్తించినప్పుడు, ప్రజల నుండి క్లిష్టమైన భావాలను వెలిబుచ్చడానికి తేలిక పదాలను కూడ సేకరించవచ్చునని తెలుసుకొన్నప్పుడు మాతృభాషాపరంగా సాంఘిక శాస్త్రజ్ఞుల బాధ్యతలు గురుతరమౌతాయి. అంటే సాంఘిక శాస్త్ర గ్రంథాలలోని భాష ఉన్నత విద్య పట్ల నిజమైన ఆసక్తిని ప్రేరేపించేదిగాను ఈ విజ్ఞాన రంగంలోని బుద్ధి జీవులను ప్రజలకు సన్నిహితం చేసేదిగాను ఉండాలి. మరొక సంగతి చెప్పుకుందాం. పరివిగా ఉపయోగించటం ద్వారానే ఆ భాషకు అలవాటు పడగలం దానికి మెరుగులు దిద్దగలం. ఈ దృష్ట్యా అనేక కళాశాలల్లో సాంఘికశాస్త్ర బోధన అనధికారికంగా ఇంగ్లీషులో జరుగుతూండటం శోచనీయం. అంటే సాంఘిక శాస్త్ర బోధకులు, విద్యార్థులు ఆంగ్ల భాషను పూర్తిగా విసర్జించమని చెప్పుట కాదు. దానిలోని దినదిన ప్రవర్ధమైన సాంఘిక విజ్ఞాన సంపదను యధేచ్ఛగా ఆస్వాదించగల స్థితిలో వారు సుదూర భవిష్యత్తు వరకు ఉండాలి. అవసరాన్ని బట్టిఆ భాషలో

భావప్రసారం చేయగల శక్తిని అధ్యాపకులు కోల్పోరాదు. విద్యార్థులు ఆ భాషలో సాంఘికవిజ్ఞానంపై ఉపన్యాసాలను గ్రంథాలను అవగాహన చేసుకొనగల్గాలి. ఈ ద్విభాషా విధానం సక్రమంగా అమలు జరగాలంటే తేలికగా, త్వరగా ఇంగ్లీషు నేర్చుకొనే పద్ధతులను ఉన్నత విద్యాస్థాయిలో ప్రవేశ పెట్టుట అవసరం.

ఇంకా డిగ్రీస్థాయి సాంఘిక విజ్ఞాన గ్రంథాలలో వాడిన, వాడవలసిన తెలుగు భాష స్థాయిని ఈ క్రింది విచారణీయాంశాలు నిర్ణయిస్తాయి.

1. శాస్త్ర విషయ విశ్లేషణ స్థాయిలు
2. సామాజిక ప్రయోజనము
3. లభ్యమయ్యే పారిభాషిక పదజాలము
4. రచయితల శైలి

విషయ, విశ్లేషణ స్థాయిలకు సంబంధించినంతవరకు సాంఘిక శాస్త్రాలలో తారతమ్యాలు గమనార్హం, ఆర్థిక శాస్త్రము, సామాజికశాస్త్రము వంటివి ముందుంటే, చరిత్ర, రాజనీతి శాస్త్రము వెనుకబడి ఉన్నాయి. అట్లాగే ప్రజల చైతన్య స్థాయిని పెంచ

టం అను సామాజిక ప్రయోజనం విషయంలో ఆర్థిక, రాజకీయ, సామాజిక శాస్త్రాలు ప్రాధాన్యం వహిస్తాయి. తర్వాత పారిభాషిక పదజాలాన్ని సృజించుకొనే విషయంలో సాంకేతిక విజ్ఞాన పరిశోధన కార్యకలాపాలు పెరిగినకొద్దీ స్థూల, సూక్ష్మ విశ్లేషణలు జరిగి, అంతర్జాతీయ పారిభాషిక పదజాలాన్ని ఎక్కువగా స్వీకరించవలసిన అవసరం పెరుతుగుంది ఏమయినా పారిభాషిక పదాలను సృష్టించటంలో ఎన్నుకొనటంలో శిష్టజనామోదం, సులభగ్రాహ్యత, సులభోచ్చారణ నిర్ణాయక సూత్రాలవుతాయి[10] సాంకేతిక పద నిర్మాణంలో వ్యాకరణ నిబంధనలను సడలించవలసిన అవసరం ఎంతైనా ఉంది[11] అప్పుడు దేశ విదేశీ భాషలలో అవసరమైన పదాలను అన్ని రూపాలలోనూ స్వంతం చేసుకొనుట ద్వారా తెలుగు భాష తెలుగునాట సాంకేతిక విజ్ఞానాభివృద్ధికి తోడ్పడగలదు భాష, భావముల అభ్యున్నతి రచయితలను ఉత్తేజపరచి వారి శైలికేకాక రచనలకు కూడ పరిణితి చేకూరుస్తుంది

## ముగింపు

ఉన్నత విద్యార్థినా మాధ్యమంగా తెలుగుకు ప్రాధాన్యమిచ్చి, ఆవశ్యకమైన మేరకు శిక్షణగతిని ఇంగ్లీషు నేర్చుకొనుటకు ఏర్పాట్లు చేసే ద్విభాషా విధానం ద్వారానే మనం సాంకేతిక విజ్ఞానశాస్త్ర రంగంలో ప్రగతిని సాధించి డిగ్రీలకు స్థాయిని కల్పించగలం అప్పుడు ఉన్నత విద్యారంగంలోని వారు ప్రజాచైతన్యీకరణ కార్యక్రమంలో పాల్గొని సామాజిక పరివర్తనకు దోహదం చేయగలరు ఆ విధంగా యావదాంధ్ర ప్రజానీకానికి తుష్టి, తెలుగు భాషకు పుష్టి చేకూర్చు ప్రయత్నంలో భాగంగా కొన్ని వర్యాలు కాసదస్సు పరిశీలించవచ్చు

1 పెరిగిన, పెరుగనున్న అవసరాల దృష్ట్యా తగిన పారిభాషిక పదజాలాన్ని సంఘటిత కృషి ద్వారా ఏర్పరచుకొనుటకు మన అధికార భాషా సంఘం తెలుగు అకాడమీ కలసి ప్రజా జీవితంలోని వివిధ రంగాలకు, ప్రాంతాలకు చెందిన అనుభవజ్ఞులను తరచు సంప్రదించాలి

2 కళాశాలల్లో ఐచ్ఛిక విషయాల బోధన / అధ్యయనలో తెలుగును ఎంత వరకు వినియోగిస్తున్నారో నిష్పాక్షికమైన దర్యాప్తు చేయించాలి

3. కళాశాల, ప్రజాజీవితముల మధ్య మరింత అర్థవంతమైన సంబంధాలు ఏర్పరటానికి సాంకేతిక విజ్ఞానవిభాగాలలో వ్యావహారిక/ క్షేత్రాభ్యాసన పద్ధతిని వెంటనే ప్రవేశ పెట్టాలి

# ఉదాహృత గ్రంథాల పట్టిక


1. Two decades of growth in Education, Education Department, Government of Andhra Pradesh, 1976, pp 11,12, India, A Reference Annual, 1979, pp 56–58

2 Report of the Education Commission 1964–66, Education & National Development, Ministry of Education, Government of India, pp 278–79

3 Edgar Faure and others Learning to be the World of Education Today and Tomorrow (UNESCO Report), 1973, pp XXIX - XLVI

4 A Report on Social Sciences in India, Retrospective and Prospective, Vol 1, by the I C S S.R , Review Committee, 1973, p 15

5 Symposium on Teaching of Social Sciences, Andhra University, 1971, (Prof. B. Sarveswara Rao), pp. 16–18, (Prof. G. Pardhasaradhy). pp 132-33.

6 Raymond Williams · Culture and Society 1780–1950, Penguin Books,1968, pp 301-24

7 Talluri Nageswara Rao, in Mahati, a Telugu Collection of Review Articles, 1972, pp 54–57

8 Edgar Faure & others, Op Cit p 61, Report of the Education Commission 1964–66, Op Cit pp 13–14, S R. Dougerkery University Education in India, 1967, pp 176–91.

9 Report of the Education Commission 1964–66, Op Cit. p 291

10 Dr Budaraju Radhakrishna, in Mahati, Op Cit., pp. 12–17

11 V P Raghavacharyulu, in Mahati, Op Cit p 28




Phone No. 532 P.P.

## *Durga Commercial Co.,*

**PADDY WORKING :: WARANGAL**

దుర్గా కమర్షియల్ కంపెనీ, పాడ్డీ వర్కింగ్, వరంగల్.

---

## M/s. VEERABHADRA TRADERS

*

**PADDY WORKING**

**W A R A N G A L**

---

Phone - Office 4441
Resi. 3582

## KONDURU JAGADISWARAIAH & CO.,

COTTON, RICE AND OIL MERCHANTS

**W A R A N G A L**

---

Tele { Add "KITTU"
Phone 3228

## THOTA RAMA KRISHNA RICE MERCHANT

Proprietor Thota Narasaiah Lingam

**Contractor of : Thota Ramachandram Rice Mill**

**ORUS, WARANGAL-506 002**